మా ఖాతాదారులకు, శ్రేయోభిలాషులకు మరియు మిత్రులకు దీపావళి శుభాకాంక్షలు.

# Housewives' favourite showroom. For Electrical & Domestic appliances.

**WET GRINDER:** To grind soaked food grains & masalas for homes, hostels, hotel, canteens & commercial purposes. A unique system for grind. Nice in shape smooth running minimum electricity.



**EXPRESSO COFFEE MACHINE:** Available in different sizes from 60 cups to 200 cups for commercial use in hotels, canteens, commercial purpose etc., Made with Stainless steel body.





**HOT CASE:** Keeps your food warm or hot, useful for homes hotels, hostels, cafetaria etc. Negligible Power consumption Designed for 230 volts AC. Power consumption on 500 watts/600 watts. Decent in looking.




**POP CORN MACHINE** cute in shape Pop corn machine is available in different sizes for commercial use in Hotels, Canteens, Theaters, and other commercial purposes etc

**COOKING RANGE:** Multipurpose gas cooking range for convenience in cooking, grilling & baking etc., available in super flame & GEM. Roomy oven, can accommodate four or five items at a time.



**TEA URN:** Available in different sizes from 35 cups to 175 cups for hotels, canteens, hostels, cafeterias etc., Made with Stainless steel body it keeps same temperature upto 8 to 10 hours. Decent in shape.





**JUICER** It is made for commercial use only. It is in a big shape with metalic body. Can run on Electricity you can have fresh juice of any fruit at any time at the Touch of your finger for commercial use etc.



**TROLLY:** The Answer to your Bed room, drawing room & lawn service. Made with stainless body and glass. Richest in look easy for serving, a unique boon to your home.

**STAINLESS STEEL CHAFING DISH:** The answer to your buffet & banqueting problems for homes, hotels and commercial purpose. You can serve any were at any time.



## For Quality Variety Service.

**Steel Palace**®



NAMPALLY STATION ROAD HYDERABAD-1 Phone: 52808 46150

**Brightways Enterprises**

LEONAR ADS

డిస్ట్రిబ్యూటర్సు: ఎలైట్ ఏజన్సీస్, జగదీష్ మార్కెటు అబిడ్స్, హైదరాబాద్. ఫోన్: 223148

# మనలో మాట

పాఠకులు, రచయితలు, రచయిత్రులు, ఏజంట్లు, ప్రకటన కర్తలందరికీ మా దీపావళి శుభాకాంక్షలు.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక నిర్వహించిన దీపావళి కథల పోటీలో ఎంతో ఉత్సాహంతో పాల్గొని దానిని జయప్రదం చేసిన రచయిత, రచయిత్రులందరికీ మా కృతజ్ఞతలు.

ఈ ఏడాది సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చి ఒక్కొక్కటీ రు. 600 లు బహుమతి పొందిన ఆరు కథల పేర్లని అక్షర క్రమంలో ఈ దిగువ యిస్తున్నాము :

**★ ఉప్పులేనికూడు ★ దూరం ★ నీ గుండెకార్చిన కన్నీళ్లు ★ పిసరంత గుండె ★ మదర్పిత ... తాంబూలాది ... ★ హసీనా**

ఈ ఆరు కథలలో మూడు కథలని అదే క్రమంలో ఈ సంచికలో వేస్తున్నాము. మిగతా మూడు కథలనీ పై వారం సంచికలో ప్రచురిస్తాము.

బహుమతి పొందిన ఈ ఆరు కథల రచయిత(త్రు)లకి ప్రత్యేకంగా మా అభినందనలు తెలియచేస్తున్నాము.

ఈ ఆరు కథలలో పాఠకుల "బాలట్"లో ఉత్తమంగా వచ్చిన కథకి మరో రు. 650 లు అదనపు బహుమతిగా లభిస్తుంది.

పాఠకుల బాలట్‌లో రెండవ, మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు. 550 లు, 450 లు అదనపు బహుమతులుగా లభిస్తాయి.

మిగిలిన మూడు కథలకి ఒక్కొక్కదానికీ రు. 250 వంతున కన్సొలేషన్ బహుమతిగా లభిస్తుంది.

బాలట్ పత్రం తదితర వివరాలని పై వారం సంచికలో ప్రచురిస్తాము. దీపావళి కథల పోటీకి వచ్చిన కథలలో కొన్ని కథలని సాధారణ ప్రచురణకి స్వీకరించాము. ఆ విషయాన్ని తెలియచేస్తూ ఆయా కథారచయిత(త్రు)లకి ఉత్తరాలు రాశాము. మిగిలిన కథలని ప్రచురణకి స్వీకరించలేదని గమనించ కోరుతున్నాము.

పోటీ నిబంధనలని అనుసరించి ప్రచురణకి స్వీకరించని కథలని ఏటువంటి సందర్భంలోనూ తిప్పి పంపడం జరగదు కాబట్టి వాటి విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకి ఏంత మాత్రం అవకాశం లేదని మరోసారి మనవి చేస్తున్నాము.

## అందరికీ మా అభినందనలు


**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 - 1972]
శుక్రవారం : 26-11-'82
దుందుభినామ సం. కార్తీక శు. దశమి
**సంపుటము 75 : సంచిక 13**
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
విడి ప్రతి వెల రు 2-25
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
"దీపావళి ముచ్చట్లు"
(చిత్రకారుడు : "శంకు")





మా ఖాతాదారులకు, శ్రేయోభిలాషులకు, మిత్రులకు దీపావళి శుభాకాంక్షలు !



మంగళ్ దీప్ లో
విమల్ వారి
తొమ్మిది అతి
చక్కని
విమల్ చీరలు

విమల్ వారి నవరత్నాలు

సిల్కి గ్రేస్
సిల్కి క్రౌన్
సిల్కి ఫెంటసి
సిల్కి బ్రీజ్
సిల్కి హేట్రిక్
సిల్కి వేవ్
సిల్కి రోజ్
సిల్కి సైనషూర్
సిల్కి జాయ్




మంగళ్ దీప్

కోఠీ, హైదరాబాద్, ఫోన్ : 45786

ఆంధ్ర ప్రదేశ్‌లో అన్నిటికన్నా
పెద్దదైన విమల్ షోరూం

® is the registered trademark of Reliance Textile Industries Ltd.

Mudra/RTI/ 785 TE

## "ధర్మో రక్షతి రక్షితః"

పొరకుల్ని పట్టు విడువకుండ చదివించుకున్న ఉత్తమ నవలల్లో 'ధర్మో రక్షతి రక్షిత:' ఒకటి. అదనులో కురిసిన వర్షంలా, నేటి సమాజానికి అవసరమైన నవల ఇది. ఆహ్లాదంతోబాటు, అగ్ని గుండాల్ని కూడా లోపల దాచుకో గల్గినవారు సనాతన బ్రాహ్మణులు. వేదం పలికిన నోటితోనే, జోలి పట్టి బిచ్చము అడుక్కున్న సాంప్రదాయిక కుటుంబాలు నాటికి, నేటికీ వున్నాయ్.

దీక్షితులగారి పాత్రను మలిచిన తీరు, ఒడుదుడుకుల కేమాత్రం తొణకని ఆయన వ్యక్తిత్వం ఎంతో ఉన్నతమైనవి. 'కార్యేషు దాసి, కరణేషు మంత్రి'గా మసలుకునే ఉదాత్తమైన పాత్ర లలితాంబ. ఇక శ్రీరాం పాత్ర—నేటి సమాజంలో అన్ని విధాలా అణగారిపోయిన యువతల్లోని, నిర్లిప్తతకు ప్రతీక. కష్టపడి చదివి, గణనీయమైన శ్రేణిలో ఉత్తీర్ణులైనా, ఆ ఆనందానుభూతికి తాము తగమని, అటు ప్రభుత్వం ప్రోత్సహించదని తెలియజేయడానికి సృష్టించబడింది.

ప్రశాంతంగా వుండే సముద్రం అప్పుడపుడు అలజడి లేపుతుంది. తుఫాను సృష్టిస్తుంది. ఇది లోక సత్యం. తనకు జరుగుతున్న అన్యాయానికి మానసికంగా కృంగిపోయిన గౌతమ్ ఉపవాసాలుండి, (చేస్తున్నవని ఆత్మవంచనే అయినా!) ధర్మాన్ని కాపాడటానికి ఉపక్రమించాడు. పిల్లాడిని దార్లో పెట్టడానికి 'అదిగో బూచాడు' అని ఏ తల్లైనా అంటుంది. అజ్ఞానంచేత మారాం చేస్తే 'అదిగో ఆ తలుపు చాటున దొంగాడు వున్నాడ'ని ఆ తల్లే గొప్ప అబద్ధం చెబుతుంది. విచ్చలవిడిగా తిరిగే వారికి పాప భీతి, దైవభక్తి కల్గించాలి. అవిలేనినాడు, ఈ సమాజంలో జరుగుతూన్న అన్యాయాలు, అరాచకాలు



ఏవిధంగా జరుగుతున్నాయో మనం చూస్తూనే వున్నాం. మనిషిలో నైతిక విలువలు లోపించడమే ఇందుకు కారణం. సరిగ్గా అలాంటి పనే చేశాడు గౌతమ్. నవలాంతంలో అతడు తనువు చాలిస్తాడు. ఎవరికోసం? దీక్షితులగారికి గౌతమ్ వ్రాసిన లేఖ, అతడిచ్చిన వివరణలు చదువుతూంటే ఎవరికైన అశ్రుజలాలురాలకమానవు. హృదయం ద్రవీకరించక పోదు. ఒకచోట (పరమేశ్వరుడు గౌతమ్ మోసాన్ని పసిగట్టినసమయంలో) ఏకాంతంగా గౌతమానందుల వారితో సుబ్బరాజు అంటాడు- "నిన్న కూడ.... నువ్వు ఫలహారం చేయలేదు" అని. దీన్ని బట్టి గౌతం ఒక వైపు ఆత్మ ప్రక్షాళన చేసుకుంటున్నాడనే అనుకోవాలి. పరిశుద్ధాత్ముడని ఒప్పుకోవాలి. ఒక వస్తువు తయారవ్వాలంటే ఇనుము తాను ముందుగా ఎర్రగా కాలాలి. ప్రజలను ధార్మిక జీవనం వైపు నడిపించడమే గౌతముని ప్రధాన ధ్యేయం.

తన తండ్రికి వ్రాసిన ఉత్తరంలో "బ్రాహ్మణుడంటే కులం మాత్రం కాదని" ఆయనే అన్నట్లు తెల్పుతాడు. పుట్టుకచేతనే బ్రాహ్మణుడు కాలేడని, అభిప్రాయం. 'జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే బ్రాహ్మణః' అన్నట్టు, సంస్కారంచేత ప్రతివాడు బ్రాహ్మడే. అయితే కృషి చేయకుండా ఆ ఉన్నతికి ఎవరూ చేరుకోలేరనేది నగ్న సత్యం. సంస్కారవంతులైన బ్రాహ్మణ దంపతుల గర్భాన జన్మించిన గౌతమ్ తప్పక సద్బ్రాహ్మణుడవుతాడు. ధర్మో రక్షతి రక్షిత: అన్నదే తన ధ్యేయమని తండ్రికి ధైర్యంగా చెప్పుకుంటాడు. (ఉత్తరంలో) చెయ్యో, కాలో తీసేస్తే తప్ప రోగి బ్రతకడనుకుంటే వైద్యుడాపని చేయక తప్పదు: అక్కడ హింసకు ప్రాధాన్యం ఇస్తున్నామా? లేక ట్రీట్మెంటుకా? ఆపద్ధర్మం— తప్పదుకదా— అదిగో ఆ పనే చేశాడు గౌతముడు, లింగోద్భవం చేసి. మత్తు వదిలించాడు ఈ సమాజానికి.

గౌతమ్ తాను లింగైక్యం చెందడం ద్వారా ధర్మ యజ్ఞానికి వో సమిధగా తనను అర్పించుకున్నాడు. అజ్ఞానం చేత తప్పు దోవన పోతున్న వాళ్ళకి చిరుదీపమై తిమిర సంహారం చేశాడు. పిరికిపాడిలా సమాజానికి భయపడి పలాయనం చిత్తగించలేదు. అదే అతని హిమోన్నత సదృశ వ్యక్తిత్వం.

పరుగెత్తైనా సరే పాలు తాగుదామని, ఎటో పయనిస్తూన్న నేటి యువత ఆత్మ పరిశీలన చేసుకోవల్సిన సమయమిది. 'ఇంటరాస్పెక్షన్' ప్రతి ఒక్కరికి అవసరమిపుడు.

'ధర్మో రక్షతి రక్షిత:' రచయిత శ్రీ ఆకెళ్ళ వెంకట సూర్యనారాయణగార్కి అభినందనలు.

నిధనపాటి హరినాథ శర్మ (యాడికి)

## "బ్రాహ్మణకులం నశించాలి"

5.11.82 సంచికలోను "ధర్మో రక్షిత రక్షిత:" సీరియల్పై శ్రీయుతులు రాజారావు, కృష్ణబాబుల ఉత్తరాలు చదివిన తరువాత ఈ ఉత్తరం రాయటం అనివార్యమైంది.

రచయిత కేవలం "బ్రాహ్మణుని కుల పునరుద్ధరణకే" నవల రాశారని మిత్రుల అభియోగం. వారు సీరియల్స్ జాగ్రత్తగా చదువుకొని ఉంటే ఈ రకంగా రాసేవారు కాదని అనిపిస్తోంది. రచయిత చాలా చోట్ల బ్రాహ్మణకులం నశించాలి— ప్రతి మనిషి బ్రాహ్మణుడు కావాలి అని రాశారు. ఇక్కడ బ్రాహ్మణ పదం, స్వచ్ఛత, పవిత్రత, మంచితనం లాంటి సద్గుణాలకు పర్యాయపదంగా వాడబడిందని మరువరాదు. ప్రతి కులస్థుడూ బ్రాహ్మణుడు కావాలని వాంఛించటంలో "విశ్వమానవ శ్రేయస్సు" ముడిపడి ఉంది. ఈ విషయాన్ని వారు సరిగ్గా అర్థం చేసుకొనలేదనిపిస్తోంది.

ప్రతి భారతీయుడు పైకి రావాలన్నది పవిత్ర ఆశయం. కాని ఎదుటివాడిని కొట్టి కాదు, ఎదటివాడితో కలిసి సమైక్యంగా రావాలి.

రచయిత బాధ్యత సమకాలీన పరిస్థితుల్ని చెప్పటం. శ్రీ సూర్యనారాయణగారు ఉన్నదున్నట్లు విషయాన్ని చెప్పటంలో తప్పులేదని భావిస్తున్నాను.

పీసపాటి (హైదరాబాదు)

* * *

సి. హెచ్. గుర్రాజుగారి ఉత్తరంలో కేవలం బ్రాహ్మణులు మాత్రమే కుల వృత్తులు, ఆస్తులు లేక చెడిపోతున్నారు అనటం అర్థరహితమయినది ఆ మాటకొస్తే కులవృత్తులు లేనివారు ఇతర



# ఉత్తరాలు

అగ్రకులాలు వారు కూడా. కష్టం లేని కుల వృత్తి (పౌరోహిత్యం) బ్రాహ్మణులది. పరి ఆస్తులు అందరిలా బ్రాహ్మణులకు కూడా ఉన్నాయి. బీదరికం ఒక్క బ్రాహ్మణులకు పరిమితంకాదు. అన్ని కులాలకు వర్తిస్తాయి రిజర్వేషన ప్రభావం ఒక్క బ్రాహ్మణులకే గాక ఇతర అగ్ర కులాల వారికి వర్తిస్తుందన్న వాస్తవాన్ని గ్రహించాలి. మిగతా (కుల) వృత్తులు చేపట్టడానికి అగ్ర కులమనే సుపిరియారిటి కాంప్లెక్స్ విడిచిపెట్టి ముందుకువచ్చిన వారెవ్వరూ లేరే?

ఎస్. వి. రామరాజు (రూర్కెలా)

## ఆసక్తికరమైన ముగింపు

రాజ్యలక్ష్మి ముఖ చిత్రంతో వెలువడిన సంచికలో "ధర్మో రక్షతి రక్షితః", "కాలం కరిచాక" సీరియల్స్‌ని ఆసక్తిదాయకంగా ముగించినందులకు ఆయా రచయితలకు మా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలుపుచూ, త్వరలో వెలువడే చిట్టారెడ్డి సూర్యకుమారిగారి "రాగాగ్ని" సీరియల్ కోసం వేయి కన్నులతో ఎదురు చూస్తుంటాము.

ద్విభాష్యం కృష్ణమూర్తి, కాశీ విశ్వనాధం (మొగల్తూరు)

## న్యూఢిల్లీ లేఖ

భారతదేశంలో ముఖ్య ఆర్థికవేత్తలలో దుబాషి గారు ఒకరు. వీరి సందేశాలను, అనుభవాలను తెలుగు భాష ద్వారా మాకు అందజేస్తున్న మీకు నా అభినందనలు. ముక్కామల వి. రత్నం (న్యూఢిల్లీ)

* * *

ఈ మధ్య మీరు ప్రచురిస్తున్న "న్యూఢిల్లీ లేఖ" బాగుంటున్నది. ఎంతో విజ్ఞానాన్ని ఈవిధంగా మా కందిస్తున్నందుకు రచయితకి మా అభినందనలు. బి. సుభాష్ (హైదరాబాద్)

* * *

22—10—1982వ తేదీనాటి సంచికలో వెలువడిన "న్యూఢిల్లీ లేఖ" చాలా బాగుంది. రష్యాలో భారతదేశం కర్మాగారాలు నెల కొల్పితే? అనే ఆలోచనను శ్రీమతి గాంధి కార్య రూపంలో సాధించగలిగితే ప్రతిభారతీయుడు గర్వించ దగ్గ విషయం. ఇంత చక్కని వ్యాసం వ్రాసిన డాక్టర్ జియ్‌దుబాషి గారికి నా ధన్యవాదములు.

దేవినేని జయచంద్రబాబు (బోధన్)

## జర్నలిస్టుల స్వార్థం !

15.10.82 తేదీ పత్రికలో న్యూఢిల్లీ లేఖతో జర్నలిస్టుల స్వార్థం తెలిసింది.

మళ్ల మల్లేశ్వరరావు (హరిపాలెం)

## అభినందనలు

"న్యూఢిల్లీ లేఖ" శీర్షికలో రాజకీయ పరిజ్ఞానముతో కూడిన అనేక విషయాలను క్లుప్తంగా వ్యక్తపరుస్తున్న రచయితకు మా అభినందనలు.

బి. మహమ్మద్ సలీమ్ (గుత్తి)

### మన పరిస్థితి

న్యూఢిల్లీ లేఖ డాక్టరు జయ దుబాషిగారు 'రష్యాలో భారత్ కర్మాగారాలు నెలకొల్పితే?' శీర్షిక చాలా చక్కగా విపులీకరించారు. మన ప్రభుత్వ మంత్రివర్యులకు విదేశపర్యటనలు ముఖ్యము గానీ, మన దేశ గౌరవము, ఆత్మ విశ్వాసము అక్కర్లేదు. మన నాయకులకు మంత్రి పదవులు, వాళ్ల ఐశ్వర్య పెంపుదల తప్ప రెండో ధ్యాస ఉండదు. అందులకే మన రాష్ట్రానికి నాల్గవ ముఖ్యమంత్రి గారు వచ్చారు. అత్యధిక మెజారిటీ గల ప్రభుత్వానికి 4 గురు ముఖ్యమంత్రులా? పత్రిక అట్టపై దేశ నాయకుల బొమ్మలు వేయ ప్రార్థన.

—మళ్ల మల్లేశ్వరరావు, హరిపాలెం,
ముఖనగరిక (ఎస్. ఒ.)

### అంతా అలా ఉంటే

"టికెట్ లెస్ ట్రావెల్" కథ సూపర్బ్‌గా వుంది. ఇందులో టి. సి. తన కర్తవ్యాన్ని నిర్వర్తించినట్లు నేటి సమాజంలో ఉద్యోగులంతా అట్లా వుంటే ఇక మనది రామరాజ్యమే !

ఎ. నాగమల్లేశ్వరరావు (మచిలీపట్నం)

### కొత్త సీరియల్స్

కొత్త సీరియల్ నవలలు 'రాగాగ్ని' మరియు 'నీలాకాశం' ఆదిలోనే మా ఇంటిల్లిపాదిని ఆకట్టుకున్నాయి. ఈ సంచికలోని 'తిరిగి రాని వసంతం, మరియు 'మానవ నైజాలు' అనే కథలు చాలా బాగున్నవి.

పి. మస్తాన్ అలీఖాన్ (నంద్యాల)

### చర్విత చర్వణం

చర్విత చర్వణం ఈనాటి రాజకీయాలకు అద్దం పట్టినట్టు ఉంది.

టి. తారక రామారావు (జాతుపురం)

### తిరిగిరాని వసంతం

"తిరిగి రాని వసంతం" బాగుంది. చాలా సన్నివేశపూరితంగా ఉంది. సమస్య సమాజ దర్పణం అంతర్గతంగా ఉంది.

రాజాజానిజాన్ (ఖమ్మం)

## మనవి

**అనివార్య కారణాల వల్ల ఈ వారం విద్యార్థిలోకం వ్యాసరచన పోటీలో ప్రత్యేక బహుమతి రు. 150 పొందిన వ్యాసాలని వెయ్యలేక పోతున్నాము.**

**ప్రత్యేక బహుమతి పొందిన వ్యాసరచయిత్రి కుమారి డి వి ఎస్.ఎన్.ఎస్. లక్ష్మి (హైదరాబాదు) తమ ప్రస్తుత చిరునామా తెలుపుతూ ఫొటో, జీవితవివరాలు వెంటనే పంపగోరుతున్నాము. — సం**

* లోకంపోకడ — ఊమెక *















# దీపావళి పండుగ పరమార్థం

— సుచంద్ర

ఆశ్వయుజ బహుళ త్రయోదశి నుంచి కార్తీకశుద్ధ విదియవరకు అయిదురోజులు జరపాల్సిన పండుగ దీపావళి. అయితే ఈ పండగ ఉత్తర భారతదేశంలో అయిదు రోజులు, దక్షిణ భారతదేశంలో మూడు రోజులు జరపబడుతుంది. దీపాల పండగ అని జానపదుల నోటిలో వ్యాప్తమైన ఈ దీపావళి పండగలో వున్నన్ని అంతరార్థాలు మరే పండగలో లేవని చెప్పవచ్చు. చైతన్యానికి సంకేతమైన 'జ్యోతి' ఈ పండగలో ఆద్యంతం ప్రముఖపాత్ర వహించు తున్నదని చెప్పాలి. దీపం వెలిగించుకున్న మనిషి తన పరిసరాలను వెలుగుతో నింపి జారచోరుల నుండి రక్షణ పొందుతున్నాడు. మనసులోని చీకటిని కూడ తొలగించుకొని అరిషడ్వర్గ విముక్తుడవుతున్నాడు; తేజోభరితుడై భాసిస్తున్నాడు.

ఈ మహాపర్వదినం పిన్నలకు, పెద్దలకు ఆనందప్రదాయిని; అశ్రద్ధ వలన కొన్ని సందర్భాలలో ప్రమాద దాయిని కూడా. దీని వెనుక ఎన్నో పురాణ గాథలు ప్రచారంలో వున్నాయి. లోక కంటకుడైన నరకుని పరిమార్చిన శ్రీకృష్ణుడు సత్యభామా సమేతుడై ద్వారకకు తిరిగివచ్చిన సంతోష కారణాన ద్వారకావాసులు దీపములు వెలిగించి, పండగ చేసుకున్న కారణాన తదాదిగా యిది దీపావళిగా జరుపబడుతున్నదని సర్వులకు తెలిసిన విషయమే. అంతకన్న ముందుకు వెళితే బలిచక్రవర్తిని అణగించి వామనుడు జగత్కల్యాణాన్ని గలిగించిన పర్వదినం గూడ దీపావళియే అన్నది జనశ్రుతిలో వున్నది. కనుకనే నాల్గవరోజును బలి పాడ్యమిగా పరిగణించి, బలిచక్రవర్తిని అర్ధాంగి సమేతంగా పూజిస్తారు. తరువాత గోవర్ధనగిరిని నిర్మించి శ్రీకృష్ణపూజ చేస్తారు. త్రయోదశి నాటిరాత్రి దీపాన్ని వెలిగించి ఇంటి ముంగిట వుంచి దాన్ని యమదీపం అని అపమృత్యువు నుండి నివారణ పొందుతారు. చతుర్దశిని నరకచతుర్దశి అంటారు. ఈ దినం ప్రాతఃకాలాన లేచి అభ్యంగన స్నానంచేసి, సర్వులూ బాణసంచా కాల్చుకొని వినోదిస్తారు. నాలుగు వత్తులు గల దీపాన్ని నరకాసుర స్మృత్యర్థం వెలిగిస్తారు. నరకచతుర్దశి నాడు నూనెయందు లక్ష్మి, నీటియందు గంగ అధివసించి యుండునని పద్మపురాణం చెప్పటంచేత నూనె దీపాలను నదులలో వదలుతారు ప్రజలు. ఆ సాయంత్రం దేవాలయాల్లోనూ, గృహపరిసరాల్లోనూ దేదీప్యమానంగా దీపాలను వెలిగిస్తారు. పిల్లలు బాణసంచా కాల్చి వినోదిస్తారు.

మూడవరోజు ప్రధాన పర్వదినం దీపావళి. ఈ రోజు ప్రతిఒక్కరూ దరిద్ర దేవత నివారణార్థం లక్ష్మీపూజను గావిస్తారు. వ్యాపారస్థులు క్రొత్త దస్త్రాలను ప్రారంభిస్తారు. సంగీత నాట్య వినోదాలతో, షడ్రసోపేతమైన విందులతో ప్రజలు తమ ఆనందానికి తార్కాణంగా దీపావళి పండుగను ఉల్లాసంగా గడుపుతారు. నాల్గవరోజు బలి పాడ్యమి అనీ, అయిదవరోజు యమ విదియ అని పేర్లు. మన ప్రాంతంలో ఈ రెండు రోజులు పండగ జరుపుకోము. కాని ఉత్తర

## దీపావళి

వచ్చింది వచ్చింది
దీపావళి పండుగ
తెచ్చింది తెచ్చింది
కాంతి కన్నుల విందుగ

నాన్నగారు తెచ్చారు
టపాకాయల బుట్ట
తాతయ్య వెలిగించె
నింపాదిగ తన చుట్ట

చిట్టి మరదలు కాల్చింది
సీమ టపాకాయలు
పొట్టి బావ కాల్చాడు
తుస్సు టపాకాయలు

అమ్మమ్మ వెలిగించింది
ప్రమిదలో వత్తులు
అమ్మ వెలిగించింది
కాకర పూవ్వొత్తులు

పాపాయి మోములో నవ్వు
వెలిసింది వూరంతా
కాంతిలో కాంతియై
దీపావళి రోజంతా

— ఎ. వి. రంగయ్య



# పేల్తుందో పేలదో?

వచ్చావా దుందుభి
దీపావళీ వచ్చావా
ఢాం ఢాం ఢాం

ఏలావచ్చావు?
విమానం మీదా
హైజాకర్ను ఆపలేదూ!

రైలు మీదా —
పట్టాలు తప్పలేదా!
బస్సు మీదా డీసెల్
బస్సా, పెట్రోలు కారా -

ఏదైనా — ఈ రోజుల్లో
టపాకాయల బుట్ట
వందరూపాయలు
పెట్టినా నిండదు.
పైగా అవి పేలవు.

ప్రాంతీయపార్టీలు
పేలుతున్నాయి!
సినీ నటులు పేలుతున్నారు

నీవు ఆలస్యంగా వచ్చావు
శూన్యమాసం
అధికమాసం

నిజమాసం — ఏమిటో
దొరకదు సమాసం.
బోనస్ ఆలస్యం
అంతా అపసవ్యం

రానున్న రాజకీయ
దీపావళి రాజీవ్‌దా —
రామారావుదా?
చెప్పవమ్మా దుందుభి
దీపావళి — చెప్పవమ్మా
మతాబాల తారావళి!

— ఎం. ఎస్. ఎం.

## దీపావళి పండుగ పరమార్థం

భారందేశంలో మాత్రం ఆఖరురోజు సోదరి యింటిలో భుజించాలని శాస్త్రం వున్న కారణంగా ఆ విధంగా చేస్తారు. యముడు ఆ విధంగా తన సోదరి యింట ఆ రోజు భుజించి వుండటంచేత ఆ నమ్మకం యేర్పడింది. ఉత్తర భారతంలో ఈ రోజును ''భయ్యా దూజ్'' అంటారు, కొన్ని ప్రాంతాల్లో స్త్రీలు తమ సోదరులకు తిలకం దిద్దుతారు. అలా చేస్తే తమ సోదరుల ఆయుర్దాయం పెరుగుతుందని, యముడు వారికి దూరంగా తొలుగుతాడని వారి నమ్మకం. నరకాన్ని దూరంగా వుంచటం ప్రతివారి వాంఛితం.

మన తెలుగువారికి నరక చతుర్దశి, దీపావళి అమావాస్య రెండే ప్రధానమైన పండగలు. తెలుగింటిలో ప్రతి పెరటిలో తులసికోట వుంటుంది. దీపావళి పండుగల సందర్భంగా తులసీపూజ చేయటం గూడ తెలుగువారి ఆచారం. స్త్రీల ఆయురారోగ్య వున్నతులు గలిగించటంలో తులసి పాత్ర ఎంతో విశిష్టమైనది. ఆ తదుపరి వచ్చే కార్తీకమాసమంతా పుణ్యస్త్రీలకు పర్వదినాలే. నదీతీరాలో నోములు, వ్రతాలు చేసుకొని, నదులలో దీపాలు వదలి వనితలు ఎంతో ఆనందాన్ని, పవిత్రతను సేకరించుకొంటారు. నాగులచవితి, కార్తీకపౌర్ణమి ఇలాంటి పండగలు.

మన పండుగలన్నీ ఎంతో లౌకిక, ఆధ్యాత్మిక పరమార్థాలకు కుండలులుగా వుంటాయి. దీపావళి పండుగ ప్రతి మనిషిని అజ్ఞానాంధకారంలోంచి తొలగి, వెలుగు బాటలో పయనించమని పరోక్షంగా ప్రబోధిస్తుంది. కేవలం విలాస వినోదాలేగాక విజ్ఞాన చైతన్యాలను సంక్రమింపజేసే ఉత్తమ పర్వదినం దీపావళి. ''తమసోమా జ్యోతిర్గమయ'' అన్న నినాదానికి, ఆచరణలో రూపుకట్టిన దీపావళి పండగ తర తరాలుగ తరుణారుణ దీప్తినిచ్చే వెలుగు వెల్లువలా మన హృదంతరాల్లో నిరంతర స్థానం వహించి వున్నది. ★



# రు. 40,000 కోట్లకి లభించేది ఏమిటి ?

గట్టి ప్రభుత్వం గట్టి మందు లాగే ఉంటుంది — గుణం ఇచ్చినా ఇతర బాధలు వేరే వస్తాయి!

తాము దేశానికి గట్టి ప్రభుత్వాన్ని ప్రసాదించామని శ్రీమతి గాంధీ ఎప్పుడూ చెబుతూ ఉంటారు. గట్టి ప్రభుత్వం ఏమిటో ఆమె చెప్పరనుకోండి, అది వేరే సంగతి. మనకి కావలిసింది ఏమిటి? ప్రభుత్వం గట్టిదయినా కాకపోయినా అది సమర్థవంతంగా ఉండాలి. శ్రీమతి గాంధీ ప్రభుత్వం సమర్థవంతంగా లేదు. అసలు అది జనానికి ఏమీ చెయ్యలేదు.

భారతదేశంలో ప్రభుత్వపాలన మోతాదు మించింది. ప్రభుత్వమే రొట్టెలు తయారు చెయ్యాలా? [మోడరన్ బ్రెడ్], మందులు తయారు చెయ్యాలా? [ఐ. డి. పి. ఎల్.]. అసలు ఆ ప్రభుత్వానికి ఏ పనీ బాగా చెయ్యటం రాదే! మందుల కర్మాగారాలలో ఉత్పత్తి శక్తిలో సగంకన్నా ఉత్పత్తి కావటం లేదుట, ఎప్పుడు చూసినా నష్టాలే. రొట్టెలు కాల్చటంలాంటి పనులు మానుకుని దొరతనం వారు అణుశక్తి కేంద్రాలు స్థాపించరాదూ? గత 30 సంవత్సరాలుగా నేను ఈ సర్కారు పని చెయ్యటం చూస్తున్నాను. నా అభిప్రాయంలో వారు అన్నిరకాల పనులూ చెయ్యటం మానుకోవాలి.

పొద్దునలేస్తే గవర్నమెంటు డయిరీ వారి పాలు; ఉదయం టీలో వేసుకునే చక్కెర ప్రభుత్వంవారు కంట్రోలు చేసినది; ఆఫీసుకి వెళ్ళే బస్ రాష్ట్ర సంస్థ; ఆఫీసు కూడా ఎన్నో సందర్భాలలో గవర్నమెంటు వారిదే అయి ఉంటుంది; కాలికి వేసుకునే చెప్పులు ప్రభుత్వరంగానివి అయి ఉంటాయి; హోటలు సయితం దీనికి చెందినదే కావచ్చు; పత్రిక వదిలితే అది వాడే న్యూస్‌ప్రింట్ ప్రభుత్వ రంగంలో తయారయినది కావచ్చు, భారత దేశంలో ప్రభుత్వరంగాన్ని వదిలి వెళ్ళకుండా జీవించటం వీలవుతుందని ఎవరో లెక్కలు వేసి చెప్పారు. మన అవసరాలన్నీ ఒక వర్గం వారే తీర్చటం మంచిదా? ఈ వర్గం వారు ఫలానా అని కూడా మనం చెప్పలేమే! రేషనుకారు నుంచి పరిశ్రమ పెట్టటానికి లైసెన్సు దాకా ప్రభుత్వమే ఇస్తే సమాజం పరాన్నభుక్కు కాక ఏమి చేస్తుంది?

ఇది ఇంతటితో ఆగదు. ఇక సమాజంలో అభివృద్ధి లోపించినప్పుడు, దానిలో అవినీతి ప్రబలినప్పుడు, ఆ సమాజం పరాన్నభుక్కుగా జీవించవలసి వచ్చినప్పుడు ఆ సమాజానికే దెబ్బ తగులుతుంది. సమాజం తనకి ఉన్న బలాన్ని కాస్తా కోల్పోతుంది. బలమంతా ప్రభుత్వానిదేనాయె! ఏది కావలిసినా పోరాటం, యుద్ధం — ప్రభుత్వం వదిలివేసే ఎంగిలి మెతుకులయినాసరే, వాటికోసం తగవు




తప్పదు. అందుచేతనే మన సమాజంలో హింస పెరుగుతోంది. అందుకనే ఉద్రిక్తత అధికం అవుతోంది. మనం హింసాత్మక సమాజం అవుతున్నామంటే పరిస్థితులు అలాగ ఉన్నాయి.

సమాజం కన్నా ప్రభుత్వం ఎక్కువ బలం కలిగినదయితే ఏమవుతుందో తెలుసుకొనటానికి పోలాండు లోని పరిస్థితులని పరిశీలించండి. ఇక్కడ 35 సంవత్సరాలుగా కమ్యూనిస్టులు అధికారంలో ఉన్నారు. వాళ్ళలో వాళ్ళు కొట్టుకుంటున్నారు. లేదా మాస్కో సంగతి తీసుకోండి - ఇక్కడ కమ్యూనిస్టుపార్టీవారు 60 సంవత్సరాలుగా పాలిస్తున్నారు. వారి పాలనలో సోవియెట్ సమాజం అన్నివిధాలుగానూ నిరుపేద అయిపోయింది, అక్కడి ప్రభుత్వంలోను పాలించే ప్రజలకి కావలిసినంత తిండి తయారుచెయ్యలేకపోతోంది.

దక్షిణ ఢిల్లీలో సరోజనగర్ అనే పేట ఉంది. ఇక్కడి కూరగాయల మార్కెట్ కి సోవియెట్ రాయబారి వర్గాలవారు డజనుల కొద్దీ వస్తారు. ఇదేమయినా పెద్ద బజారా అంటే అదీ కాదు. కాని, రష్యా వారి కళ్ళకి అన్ని కూరగాయలు అద్భుతంగా కనిపిస్తాయి. ఒక్కొక్క కారులో ఎందరో ఎక్కి వస్తూ ఉంటారు వారు [చిన్న గుంపులుగా ప్రయాణం చెయ్యటానికి వారి ప్రభుత్వం అంగీకరించదు] ఒక 40 ఏళ్ళ రష్యా దేశస్థుడు నాకు చెప్పాడు- ఇంత శాకసమృద్ధి తన జీవితంలో చూడలేదని, ఆయన భార్యయేమో, ''మాస్కోలో క్యూలో నుంచోకుండా ఏమీ కొనలేముకదా!'' అన్నటుంది. [క్యూలో నుంచునేది సామాన్యులు. పార్టీ పెద్దలకి ఈ అవసరంలేదు] కోట్ల రూబుళ్ళు ఆయుధాలకీ, అంతరిక్ష నౌకలకీ కర్చు అవుతూ ఉంటే రొట్టె, టొమాటాలకి ఈ క్యూలు ఏమిటి?!

మనమూ రష్యా వారిలాగే అయిపోతున్నాము. ఆసియాడ్, జంబో విమానాలు, అంతరిక్ష నావలకి కోట్లు కర్చు చేస్తాము. కాని, మన జనానికి కావలసినంతగా ఆహార పదార్థాలు ఉత్పత్తి చేసుకోలేము. మన ప్రభుత్వం మీద మనకి అయ్యే కర్చు ఎంతో తెలుసా? సాలుకి రు 40,000 కోట్లు! అంటే, మన జాతీయాదాయంలో మూడవ వంతు; వ్యవసాయ రంగాన్ని మినహాయిస్తే ఇంకా ఎక్కువే కూడా. ఇంకా చెప్పాలంటే మన రూపాయిలో 50 పైసలు ప్రభుత్వం కోసం అన్నమాట. ఇంత కర్చుకి మనకి వచ్చేది ఏమిటి? అంతూలేలాంటి దొంగలు, గుండురావులాంటి దుండగీళ్ళు— భోన్సే లాంటి పేరిగాళ్ళ సంగతి సరేసరి. ప్రభుత్వ రంగం కంపెనీలు తీసుకోండి వాటి నష్టాలు ఎంతెంత? ఐ. డి. పి. ఎల్ అనే ఒక్క కంపెనీ పోయిన ఏడాది 25 కోట్ల రూపాయలు నష్టపోయింది. ఈ మందుల కంపెనీకి ఇంత నష్టమయితే తక్కిన మందుల కంపెనీలు ఎంతెంత లాభాలు చేస్తూ



## పాఠం

పగిలిన అద్దం
ఎప్పుడూ
ఒక విషయం చెబుతుంది ?
మనిషెంత
పతనమైనా
నిజం చెప్పడం
మాత్రం
మానవద్దని !

"సింహం"



## న్యూఢిల్లీ లేఖ

న్నాయి ? విదేశీ సంస్థలు కొన్ని నెలకి రు. 25 కోట్లకన్నా విదేశాలలో ఖర్చు చెయ్యటంలేదూ !

గట్టి గవర్నమెంటు అంటే పెద్ద గవర్నమెంటు అని శ్రీమతి గాంధీ అనుకుంటున్నారు. ఇది తప్పు. లావుపాటి వాళ్లంతా ఫయిల్వాన్‌లుకారు. స్విట్జర్‌లాండ్‌ని తీసుకోండి. యూరోపులో ఇంతకన్నా సమర్థవంతంగా నడిచే ప్రభుత్వం ఉండదు. కాని అది ఎవరికీ కనిపించదు జెనివా విమానాశ్రయాన్ని యూరోపులో కెల్లా ఎక్కువ ప్రయాణికులు వాడుతారేమో కాని ఒకసారి నేను దానిద్వారా వెళ్ళినప్పుడు నాకు ముగ్గురే ప్రభుత్వాధికారులు కనిపించారు– ఒకరు కస్టమ్స్ అధికారి, మరోకరు ఇమిగ్రేషన్ అధికారి, మూడవ వ్యక్తి ఎవరో తెలీదు కాని విమానాశ్రయం మేనేజరు అయి ఉండవచ్చు. వాళ్ళు కాక ఇంకా ఎందరో ఉండే ఉండాలి కాని వాళ్లు కంటికి కనిపించరు ! ఈ ముగ్గురే అంతా నిర్వహిస్తున్నారనిపిస్తుంది ! లండన్ నుంచి వచ్చిన మా విమానంలోని ప్రయాణికులందరి సంగతీ వీరే చూసుకున్నారు. పోలీసు వారంటారా, ఒక్కరు కంటికి తగలలేదు ఇక ఢిల్లీ విమానాశ్రయంలోనా ? జెనీవా అంతటా ఎందరు పోలీసువారు ఉన్నారో అంతకన్నా ఎక్కువ మంది ఇక్కడ కనపడుతారు ! గట్టి ప్రభుత్వం అంటే ఇంతేనా ?



# ఉప్పు లేని కూడు

దీపావళి కథల పోటీలో రు.600 బహుమతి పొందిన కథ

**శృంగవరం లింగన్నగారి పంపుసెట్టు దగ్గిర, సిగ్గెరగని ఆడతనం సబ్బు అరగదీసుకుంటోంది. లింగన్నగారి జీతగాడు వెంకటేశుకు ఇష్టంవున్నా లేకపోయినా, ఆ నిత్యకృత్యం మాత్రం ఆగిపోయేదికాదు.**

బారెడు పొద్దెక్కినా యింకా నిద్రమైకం వదలని ముఖాలతో నలుగురు ఆడవాళ్ళు పంపునీళ్ళకు అడ్డంపడ్డారు. రాక్షసిమూకకు జడిసి కకావికలై పోయే మునిగణంలా, పంపునీళ్ళు హోరుమంటోంది.

ఇరవైలోనే అరవైఏళ్ళ అనుభవాన్ని నెత్తికెత్తుకున్నందువల్లనేమో, వాళ్ళ సొంపులూ, మేని వొంపులూ ముతకబారిపోయి, సహజంగా కాక, సొమ్ములు పెట్టుకున్నట్లుగా కనిపిస్తున్నాయి.

వాళ్ళు కచ్చికతో పళ్ళుతోముకుని, తడి చీరలు చుట్టుకుని స్నానాలు చేస్తూ, రాత్రి తమతో గడిపివెళ్ళిన విటుల విపరీత చేష్టల్ని గురించి — ఎంత నగ్నంగా చెప్పవచ్చునో అంత సూటిగానూ, స్పష్టంగానూ ఒకరి కొకరు చెప్పుకోసాగారు ఆ కబుర్లు వినటానికి ఆసక్తికరంగానే వున్నా, అక్కడ నిలబడటానికి సిగ్గు వేసింది వెంకటేశుకు. నీళ్ళు ఎంతవరకూ సాగిందో చూచే నెపంతో, అతడు చెరకుతోటలోకి దారి తీశాడు.

చెరకు గుముల చాటు నుంచి వారకాంతల బూతు సల్లాపాలు శివాలెత్తిన గంగమ్మలా దూకుళ్ళతో వినిపిస్తూనే వున్నాయి. బావికి ఇరవై బారల దూరంలో ఎత్తుగావున్న తారు రోడ్డుకు యివతల చింతచెట్ల గుబురునీడల కింద పూరింటి వాకిట నిలబడి, మార్కెట్టుకు వెళ్తున్న కూరగాయల గంపను దింపించి బేరమాడుతున్న సుందరమ్మ అతడి కళ్ళ బడింది. క్యారుమని ఖాండ్రించి, "సిగ్గులేనోడు, సిగ్గులేనోడు !" అంటూ



తుపుక్కున ఉమ్మేసాడు వెంకటేశు.

లింగన్నలాంటి పెద్దమనిషి యిలాంటి పని మాత్రం చేసి వుండకూడదు !

వరసగా రెండుసార్లు పంచాయతీ సర్పంచ్‌గా వుండి కూడా ప్రజలకు ఏమీ చేయలేకపోయిన లింగన్న ముచ్చటగా మూడో సారి ఎన్నికైన తరవాతయినా తాగునీళ్ళులేని వాడల్లో బోరింగులు వేయించకపోతాడా, కటిక చీకటో మునిగిపోయిన వాడల్లో కరెంటు వెయ్యకపోతాడా అని ఆశలు పెంచుకున్నారు జనం. నీళ్ళా, నీటిదీపాలూ లాంటి చిన్న విషయాలెందుకని, ప్రజలకు పెద్ద సౌకర్యమే కలిగజేసి పుణ్యం కట్టుకున్నాడు లింగన్న.

శ్రీరామచంద్రుల వారి పేరు పెట్టుకున్న ఒక తిరుగుబోతు, సుందరమ్మను లేవదీసు కొచ్చి శృంగవరంలో కాపురం పెట్టాడు. సుందరమ్మ కంటే మెరుగైన మరో బొమ్మను లేవదీసుకుని శృంగవరం నుంచీ మాయ మయ్యాడు.

'అన్నా, ఆడదాన్ని ! నాకు ఫలానా సాయం చెయ్యి' అని లింగన్నను శరణువేడింది, దిక్కులేని సుందరమ్మ.

ఊరి చివర రోడ్డు పక్కనే లింగన్న పొలాలున్నాయి. ఆ పొలాలకూ రోడ్డుకూ మధ్యనున్న ఖాళీస్థలం హైవేస్ వారికి చెందు తుంది. వారం తిరక్కుండానే లింగన్న వెయ్యిరూపాయలు ఖర్చుపెట్టి అక్కడొక ఐదంకణాల పూరిల్లు కట్టించాడు. సుందరమ్మ ఆ యింట్లో నాలుగు వెదురు తడికలు అడ్డంపెట్టి, వ్యాపారంలోకి దిగింది. ఆ రంగంలో ఆమెకు అంతో యింతో అనుభవమూ, నేర్పూ వున్నట్టున్నాయి. చీకటివేళలో ఏ క్షణంలో వెళ్లినా మగవాడి మదనతాపం తీర్చటానికి ఆ యింట్లో నలుగురు గుమ్మలు సిద్ధంగా వుంటారు. వారానికీ రెండు వారాలకూ పాతవాళ్లు ఎగిరిపోయి, కొత్తవాళ్ళు దిగుతుంటారు.

సానికొంపలో దూరేటంత దమ్ములు శృంగవరంలో ఎవరికుంటాయి లెమ్మను కున్నాడు వెంకటేశు, మొదట్లో. రాను రాను అతని అంచనా తల్లకిందులైపోయింది ఒకరికి తప్పుగా అనిపించేది మరొకరికి ఒప్పుగానూ వుంటుంది. పాప ఫలాన్ని భక్షించవద్దని దేవుడంతటివాడు శాసిస్తే, ఆదం అవ్వలు విన్నారు గనకనా ? తడికల చాటున కిరసనాయిలు బుడ్డీదీపాల గుడ్డి నీడల్లో సుందరమ్మ వ్యాపారం మూడు పువ్వులూ ఆరుకాయలుగా వర్ధిల్లుతోంది. సినిమా థియేటర్స్ వాళ్ళు కూడా ఇప్పుడు తమ పోస్టర్‌లను ఊరిచివర సుందరమ్మ యింటిగోడకు పోటీపడి మీద అంటిచేస్తు న్నారు. లింగన్నకు ఇంటద్దె వారానికి వందరూపాయలు పువ్వుల్లో పెట్టి యిచ్చు కుంటున్నది సుందరమ్మ.

చివరి కయ్యలోకి నీళ్ల మళ్ళించి, మళ్లీ పంపు దగ్గరి కొచ్చాడు వెంకటేశు. ఆ నలుగురూ జలకాలు ముగించి, తడిచీరలు విడిచి పొడిచీరలు కట్టుకుని, ఉతికిన లంగాలూ, బాడీలూ ఎండలో ఆరవేసుకుంటు న్నారు. ఊరిబయట నిర్మానుష్యంగా వున్న పైరు పచ్చల నడుమ సీతాకోకచిలుకలు రెక్కలల్లార్చుకుంటున్నట్టుగా వున్న ఆ దృశ్యం నయనానందకరంగానే వుంది.

సుందరమ్మ కొంపలో నుంచి కొత్తపిట్ట ఒకటి బద్ధకంగా నడిచొచ్చి కురులు విప్పుకుని, కోడెవయసులా దూకుతున్న నీళ్ళ కింద కూర్చునేసింది. వెంకటేశు కంటిమీద రెప్పపడలేదు. ఆ అమ్మాయికి పదహారేళ్ళుం టాయి. ఏ ఒక్కడికో స్వంతం కావాల్సిన ఆమె లేత ఒళ్ళు పదిమంది చేతుల్లోనూ నలిగినందువల్లనేమో, సిందెలోనే పండిపోయి నట్టుగా వుందామె యౌవనం.

"కొత్తపిల్లగా వుందే ! ఎప్పుడొచ్చింది?" అన్నాడు వెంకటేశు.

"రాత్రొచ్చింగలె ఆ తిలోత్తమ ! ఏం ? నీకు గావాల్నా ?" అని రాగం తీసిందొక ఒయ్యారిభామ.

"నా కెందుకు ?"

"ఎందుకా ? ఏం, నువ్వు మొగోడివి కావా ?" అంది తిలోత్తమ. అందరూ కిలారున నవ్వారు.

"సిగ్గులేనోడు !" అని గొణుక్కుంటూ, తుపుక్కున వుమ్మేశాడు వెంకటేశు. "సిగ్గులేనోడు సొంతలాబం కోసరం బంగార మట్టాంటి వూరిని పాడుజేసినాడు. అసలీయ నకు ఏం తక్కువయిందనీ ? ఆ సిస్తిలో అంతస్తులో ఈయన్ని మించినోళ్ళు లేరు కదా ? మర్యాదగా బతికే వూర్లో బోగం కొంప బెట్టించినాడు, సిగ్గులేనోడు !"

కొత్త పిల్ల ప్రయోగించిన కనికట్టు మహోత్యంకాబోలు, పంపు సెట్టు దగ్గరికి కాశీపతి ఎప్పుడొచ్చి నిలబడిందీ వెంకటేశు గమనించనే లేదు కాశీ సిల్కులుంగీ కట్టుకున్నాడు. కశ్మీరు గ్రౌరెను భుజాల మీది కెక్కించుకున్నట్టు, గుండీలు






# ఉప్పులేని కూడు

వూడదీసిన చొక్కామీద టర్కీటవల్ వేలాడ దీసుకున్నాడు, కొత్తపిల్లను చిదిమి బుగ్గన పెట్టుకున్నట్లు, టూత్‌బ్రష్ దవడ సందులో ఇరికించుకున్నాడు.

కాశీపతి లింగన్నగారి ముద్దులకొడుకు. పట్నంలో చదువుకుంటున్నాడు. సెలవుల్లో ఇంటికొచ్చాడు. వారంరోజుల నుంచీ క్రమం తప్పకుండా ఉదయవేళల్లో పంపుసెట్టు దగ్గిరికి హాజరవుతున్నాడు. నూనూగుమీసాల నూత్న యౌవనాన్ని కవ్వించే ప్రయత్నంలో ఒళ్లంతా మెలికలు తిప్పుకుంటోన్న తిలోత్తమ తెంపరితనాన్ని చూడలేక, చెరకుదోట చుట్టూ తిరిగివచ్చాడు వెంకటేశు. అప్పటికి ఆ ఆడవాళ్లు అక్కడలేరు. పిండుకున్న చీరను భుజానవేసుకుని, తిలోత్తమ గుడిసెవైపు నడుస్తోంది. నీళ్లలో యింకా అడుగైనా పెట్టని కాశీ చొక్కా తడిసిపోయి వుంది. ఎవరో నీళ్లు చిమ్మకపోతే చొక్కా ఎలా తడుస్తుంది ? ... శృతి కలిసిందన్నమాట !

ఆ రాత్రే కాశీ డ్యూయెట్ సాంగ్ పూర్తి చెయ్యటం వెంకటేశు కళ్లబడింది. వేసవిరేయి చల్లగావున్నా, నడిజాముదాకా నిద్రపట్టక, పంపుషెడ్డు పక్కన నులకమంచం వాల్చుకుని కూర్చున్న వెంకటేశు — బహుళ చతుర్దశి నాటి చిమ్మచీకటిలో సుందరమ్మ గుడిసెలో దూరబడుతున్న కాశీపతిని పోల్చుకునేశాడు. అరగంట తరవాత గుడిసెలో నుంచి బయట పడి, తొందర తొందరగా రోడ్డు వెంట వెళ్లిపోతున్న కాశీపతి — ఎదురుగా వస్తున్న లారీ హెడ్‌లైట్ల ఫోకస్‌లో స్పష్టంగా కనిపించాడు.

సానికొంపలోకి ఎవరైనా రావచ్చు, ఎవరైనా పోవచ్చుగానీ, కాశీపతి వచ్చివెళ్లడం మాత్రం విచిత్రమే ! తాను తీసిన గోతిలో తానే పడటమంటే, యిదే కదా ? కాశీ వేశ్యల కౌగిళ్లలో విశ్రమించి వెళ్ళాడన్న వాస్తవం లోకానికి తెలియకపోతే నష్టమేమీ లేదు కానీ, ఆ కొడుకును కన్న తండ్రికి తెలియకుండా మాత్రం అది మరుగైపోరాదు. అణ్వస్త్రాలవల్ల ఉత్పత్తిల్లే దుష్ఫలితాలను గురించి మొదట తెలుసుకోవలసిన వాడు, వాటిని తయారుచేసి అమ్మకానికి పెడుతున్న అగ్రరాజ్యంవాడే కదా ?

మరునాటి ఉదయం వారాంగనల జలక్రీడలు ముగిసిన తరవాత కాసేపటికి పంపు ఆపాడు వెంకటేశు. పొలం గట్ల మీదుగా నడుస్తూ, బావి దగ్గరకు వచ్చాడు లింగన్న చెరకుతోటవైపు, అరటితోటవైపు, మిరపతోటవైపూ చూశాడు. తల పైకెత్తి, బావిగట్టున వున్న కొబ్బరిచెట్లలోని కాయల వైపు చూశాడు. "ఒరే ఏంకిటిగా ! ఈ దినం ఒక్క పొద్దులంట్రా ! సుబ్బులుకు రెండు అరిటాకులూ, రెండు టెంకాయలూ కావాలంట !"అన్నాడు.

అతడు వచ్చింది, సానికొంపకు అద్దె వసూలు చేసుకోటానికేనని వెంకటేశుకు తెలుసు కాశీపతి వ్యవహారాన్ని బయట పెటగానే అతడి ముఖం ఎలా మారుతుందో నని ఊహించుకుంటూ, వెంకటేశు కొబ్బరి చెట్టెక్కి, రెండు కాయల్ని తుంచి కింద పడేశాడు కిందికి దిగివచ్చి, అరటితోటలో మంచి ఆకులు రెండు కోసుకొచ్చాడు.

"ఆ సుందరమ్మను పిలవరా !" అన్నాడు లింగన్న.

వెంకటేశు గుడిసెవైపు ముఖంతిప్పి, "సుందరమ్మా !" అని కేకేసి, తగ్గు గొంతుకతో యిలా అన్నాడు : "అన్నా ! నీ కొక రహస్యం చెప్తా, చెప్పకపోతే ఎట మరి ? అబ్బ రాత్రి సుందరమ్మ గుడిసెకొచ్చి అరగంటసేపుండిపోయినాడు. కొత్తగా కుర్ర ముండొకటొచ్చిందితే ! నేను జెప్పినానని అబ్బతో చెప్పొద్దు !"

వెంకటేశు లింగన్న ముఖంవైపు పరీక్షగా చూశాడు. అర్థంకాని లిపిలా వుంది ఆ ముఖం.

సుందరమ్మ బావి వైపుగా వస్తూ వుండటం చూసిన లింగన్న కోపాన్ని గొంతులో అదిమిపట్టుకుంటూ, "ఒరే ! అరిటాకులూ, టెంకాయలూ యింట్లో యిచ్చిరాపో !" అన్నాడు. వెంకటేశు వాటిని అందుకుని అడుగడుక్కీ వెనక్కితిరిగి చూస్తూ ఇంటి దారి పట్టాడు.

ఇల్లు చేరగానే అతడి కళ్లు కాశీపతికోసం చుట్టూ వెతికాయి కాశీ కనిపించలేదు. వెంకటేశు చురకత్తి తీసుకుని కొబ్బరికాయల పీచు ఒలుస్తూ, "అబ్బ ఏడమ్మా ? లేడా ఇంట్లో ?" అని లింగన్న భార్య సుబ్బులమ్మను అడిగాడు.

"ఆడ, గురకబెడతా వుండేది ఎవరను కుంటివి ? వాడే ! ఇంకా మంచం దిగలా !"

పీచు తియ్యటం పూర్తిచేసి, గొడ్లపాకలో చూరుకింద పెట్టిన సత్తుగిన్నె కడిగి తెచ్చుకుని, అందులో చద్ది పోయించుకుని కలుపుతూ సావిట్లో కూర్చున్నాడు వెంకటేశు.

అంతలో, జేబులో చెయ్యివేసుకుని లింగన్న యింటికి తిరిగొచ్చాడు. అతడి ముఖంలోని గంభీర ముద్రను చూసి, ఆ ఇంట్లో ఆపూట భూమి బద్దలు కావడం తథ్యమను కున్నాడు వెంకటేశు.

లింగన్న మౌనంగా నడవలోకి వెళ్లాడు. లోపలి గదిలోకి తొంగిచూసి ఒక్కసారి

ఏపాకాయలిచ్చి అదే బోనసంటే ఎలాగండీ?





# ఖర్చులు తగ్గించుకొనేందుకు–
# సిఫార్సుప్రకారం ఎరువులను వాడండి








నీటిసాగు వేరుశనగ పంటకు సిఫార్సు ప్రకారం ఎరువులను వాడిన చాలా లాభకరం.

ఏ పంటకైనా ఎరువుల వాడకంద్వారా ఒక క్వింటాలు దిగుబడికయ్యే ఖర్చును తగ్గించవచ్చు. నీటిసాగు వేరుశనగకు సిఫార్సు ప్రకారం ఎరువులను వాడిన ఒక క్వింటాలు వేరుశనగ పండించటానికి అయ్యే ఖర్చు క్రింద సూచించిన విధంగా తగ్గుతుంది.

| నీటిసాగు వేరుశనగ | ఎరువులు వేయకపోతే | సిఫార్సు ప్రకారం ఎరువులు వేసినప్పుడు |
|---|---|---|
| ఎకరానికి సాగుబడి ఖర్చు | రు. 1000/-లు | రు. 1240/-లు |
| ఎకరానికి దిగుబడి | 4 క్వింటాళ్లు | 8 క్వింటాళ్లు |
| క్వింటాలుకు ఖర్చు | రు. 250/-లు | రు. 155/-లు |

పంట ఖర్చులు తగ్గించుకోవాలన్నా, హెచ్చు లాభాలు పొందాలన్నా సిఫార్సు ప్రకారం ఎరువులను వాడాలి.

**నీటిసాగు వేరుశనగకు అనువైన ఎరువు విజయ్**

14-28-14. ఎకరానికి 75 కిలోల విజయ్ 14-28-14ను దుక్కిలో విత్తేటప్పుడు విత్తనానికి 5 సెం.మీ. లోతుగాను, 5 సెం.మీ. ప్రక్కగాను వేయండి.

ఇంకా వివరాలకు ఈ క్రింది చిరునామానుండి ఈ పంటకు సంబంధించిన పుస్తకాన్ని తెప్పించుకోండి.

ఏరియా మేనేజరు
మద్రాసు ఫర్టిలైజర్సు లిమిటెడ్
44, శాంతినగర్
హైదరాబాద్-500 028







| విజయ్ 14-28-14 ఎరువుల నిర్ణీత పరిమాణముల శాతం | |
|---|---|
| నత్రజని | 14 |
| భాస్వరం | 28 |
| పొటాష్ | 14 |
| నింపుడు పదార్థం (మెత్తటి ఇసుక లేదా డాలమైట్) | 11.5 |

HTM-MFL-2817

బుసకొట్టాడు. "ఇంకా నిద్ర లేవలేదన్న మాట" అని దాని అర్థం. జేబులోని చేతిని పైకి తీశాడు. ఒక చేతిలో పదిరూపాయల కాగితం, మరో చేతిలో ఐదురూపాయల కాగితం పట్టుకుని వాలుకుర్చీలో చేరగిల బడ్డాడు.

"ఒసే! నీ కొడుకు జేసిన నిర్వాకం చెప్పమంటావా ?"

"ఏం జేసినాడో ?"

"రాత్రి వీడు ఆ బోగమోళ్ళ గుడిసెలో దూరి పరీక్ష రాసొచ్చినాడు. అందుకుగాను సుందరమ్మ కిచ్చిన రిజిస్ట్రేషన్ ఫీజు, ఇదో, ఈ పదిరూపాయలు! సరే, వొచ్చేటప్పుడు వూరికే రానొచ్చు గదా ? ఊహుఁ! క్లాసు రావాలగదా ! ఆ కుర్రముండకిచ్చిన ట్యూషన్ ఫీజు, యిదో, ఈ అయిదు రూపాయలు !"

"అందుకేనా ఆ మొద్దు నిద్దర !" అంటూ బుగ్గలు నొక్కుకుంది సుబ్బులమ్మ.

# ఉప్పులేని కూడు

"ఒసేయ్ సుబ్బులూ ! మేనేజిమెంటు చేతికొచ్చి కొంప గుండం జేసుకోకముందే, నీ కొడుక్కు కొంచెం బుద్ధిమతులు చెప్పు! మనిషికి పెద్దరికం అంటగట్టేది దుడ్లేనే ! కాలేజీలో నేర్చుకునేదిగాదు సదువంటే ! తెలివైనోడు డబ్బు సంపాయిస్తాడు గానీ, కర్చుబెట్టడు. అదీ సదువంటే !.. అది కాదే, ఏదన్నా కావాలంటే దుడ్డు పారెయ్యాలనేదే రూలా ? నేను జూడు, వూరికి సర్చించినా ? రోడ్డుమీద అంగళ్ళుండాయిగదా, నడుంమింద చెయ్యి ఆనించుకుని పండ్లంగడి ముందర నడిరోడ్డులో నిలబడి 'పండ్లు మంచివేనా?' అంటాను. పండ్ల కుప్పుసామి హైక్లాస్ అరిటిపండ్లొక డజనూ, ఒంటిచేత్తో పట్టుకుంటే జారిపడిపోయే ఆపిల్ పండ్లు రెండు కాయితంలో చుట్టి మర్యాదగా చేతికిస్తాడు. నన్ను వాడు దుడ్లడిగిందీలేదు, నేను వాడికిచ్చిందీలేదు నేను సర్చించిని గదా? నాతో మంచిగా ఉండకపోతే వాడి అంగడి వుండదు. ఇట్టాంటివి చెప్పాలంటే, వెయ్యి చెప్పొచ్చు ! ఆ సుందరమ్మకు ఆధారం చూపించింది నేను గదా. ఈ మొద్దోదవ దుడ్డియ్యకపోతే అదేమన్నా వీణ్ణి మెడబట్టి తోసేస్తుందా ? ఫూల్ !"

పశ్చాత్తాపంతో మాడిపోతాడనుకున్న లింగన్న ఇలా అంటుంటే, వెంకటేశు రక్తం కుత కుత లాడిపోయింది. మొదటి ముద్ద గొంతు దిగకముందే, తెరుచుకున్న నోరు తెరుచుకున్నట్లే వుండిపోయింది. "సిగ్గులేనోడు సిగ్గులేనోడు !" అనుకుంటూ నోటిలోని కూటిని కసికొద్దీ తుపుక్కున వుమ్మేశాడు వెంకటేశు.

"ఏందిరా ఎంకటూ ? ఏమయింది ?" అంది సుబ్బులమ్మ.

"ఉప్పేసుకోలేదమ్మా !" రకీమని జవాబిచ్చాడు వెంకటేశు. ★

CHAITRA-G-120 TEL

# త్రివిధ చర్యగల ట్రైలో నీలి డిటర్జెంట్ బిళ్ళ

మరే ఇతర పేరెన్నికగన్న డిటర్జెంట్ బిళ్ళలకన్న 25% ధర తక్కువ




ట్రిలో వలన ఎంతో బాగుగా నురుగు—గనక మీరు మరెన్నో బట్టలను ఉతికేవీలు. మరే ఇతర డిటర్జెంట్ బిళ్ళ కన్న ఎక్కువగా!

ట్రిలో మరెంతో బాగా ఉతుకుతుంది—బాగా మురికి పట్టేసిన మీ బట్టల్ని కూడా ఉతికే శక్తి గలది. మీ బట్టలు తెల్లగా, తాజాదనం ఉండేలా చేసేందుకుగాను నీలి మందు జతచేయబడింది.



ట్రిలో ఎంతోకాలం అది వస్తుంది—
ఇది ముద్దగా అయిపోదు
గనక పూర్తిగా అరిగిపోయేదాకా
వాడే వీలు

త్రివిధ చర్యగల కొత్త
ట్రిలో మరెంత మేలైనదో
చూడండి!

గోద్రెజ్
ఉత్పాదన




**వి. ఎస్. — బాపట్ల**

మావారు నన్ను తిట్టినా, బాధించినా నాలో విపరీతమైన సంఘర్షణ చెలరేగుతుంది. మన దేశంలో స్త్రీ ఎందుకిలా అణగ ద్రొక్కబడి వుంటూంది అనిపిస్తుంది.

అత్యంత ఆధునికమనుకొంటున్న అమెరికాలో కూడా భార్యల పట్ల దారుణమైన హింసను ప్రదర్శించడం ఎక్కువేనని యీ మధ్య అక్కడి ప్రముఖ సేవా పరాయణి చెప్తూంటే యీ చెవులని నమ్మలేకపోయాం. అంచేత మనిషిలో రాక్షసాంశకీ సంస్కారానికీ సంబంధం లేదేమోననిపిస్తుంది. స్త్రీలు కూడా యీ పరిస్థితికి చాలాబాధ్యత వహించక తప్పదు. గుంభన, దాపరికం, అవమానం, పిరికితనం ఒకటేమిటి 'మొగుడు కొట్టాడని కాదు. ఆడబిడ్డ దెప్పిందని, బాధపడే లాగా ఉంటారు. పడి వుండడం ఆడ లక్షణం అనుకుంటారు కాని తాము మనుషులుగాకాక శరీరాలుగా చూడబడుతున్నారన్నది గ్రహింపుకి వచ్చేసరికే పరిస్థితి విషమించిపోతూంది. చదువు, ఆర్థికమైన బలం, తన ఆత్మ గౌరవం వాటిని గురించి పెళ్ళి కాగానే ఆడది మరిచిపోవాలని ఎక్కడుంది? మరిచిపోయి తన 'ఐడెంటిటీ' వదులుకోవడం వల్లనే పురుష పక్షపాతి అయిన యీ సమాజంలో కనీసపు గౌరవానికి కూడా నోచుకోని జీవిలాగా తయారైంది. ఆడది భార్యే కాదు. మనిషి కూడానని ఏ మగవాడూ జ్ఞాపకంపెట్టుకోడు—నిజమే. ఆమెకే లేని బాధ అతని కెందుకు ఉంటుంది!?

**డి. ఆర్. ఎల్. — రాజమండ్రి**

మనిషి అదృష్టం కర్మఫలమా! అతని చేతలు ఆలోచనలపై ఆధారపడి వుంటుందా?

అదృష్టం చాన్సు. అనేక పరిస్థితుల కలయిక మన కృషికి జత కలిసినప్పుడు అంది వస్తుంది.

**వెంకట్ — ఉరవకొండ**

పురుషులు రాసిన ఈ శాస్త్రాలు స్త్రీల పాలిట సంకెళ్ళవంటి వంటే అతిశయోక్తి కాదనుకుంటాను కె. రామలక్ష్మిగారూ ?

పురుష దృక్పథానికి అవిఅద్దం పడుతున్నాయి. న్యాయానికి సమ దృష్టికి కాదు.

ఈ ఆధునికయుగంలో కన్నతల్లి కడుపుచూస్తే కట్టుకున్న పెళ్ళాం వీపు చూస్తుందంటారు?

వీపా? ఎందుకు? పూర్వం జేబు చూస్తుందనేవారే! అయినా ఈ కాలంలో తల్లులూ జేబులే చూస్తున్నారన్న దానికి నిదర్శనే—కట్నం గొడవలు, కోడం(ట)కాలు.

**డి. కె. ఆర్. — బైపల్లి**

ఐ లవ్ యూ అనే డైలాగు ప్రేయసీ ప్రియులలో ఎవరు ఎవరితో అంటే బాగుంటుంది?

ఎవరు ఎవరితో అన్నా అవి వాళ్ళ మధ్య అనుకున్న మాటలే గాని—మనందరి కోసంకాదు.

**సి. హెచ్. పి. ..ర్. — నిడుబోలు**

కవురవులలో మనకు ఇద్దరిపేర్లే తెలుస్తాయి. మిగతా తొంభయి ఎనిమిది మంది పేర్లు తెలుప గలరు ?

బాబోయ్ ! అది ఏ పరిశోధనా విద్యార్థో డిగ్రీ కోసం పడవలసిన పాట్లు ! మనకెందుకండి ?! బుర్ర పాడుచేసుకోవడం.




**జె. వి. బి. — రామగుండం**

ప్రశ్నావళిలో మీ జవాబులు చూసి మిమ్మల్ని ఉన్నతురాలిగా వూహించాను. కాని ఈ మధ్య కొత్త పత్రికలలో కొన్ని సినిమాల సెన్సారు విషయంలో మీరు ప్రవర్తించిన తీరు గురించి చదివాక ...

మనసు మార్చుకున్నారు ! అంతేగా చూడండి. ఆ పత్రికలపేర్లుగాని ఆ సినిమా పేర్లుగాని రాయలేని పిరికితనం మీది! ఒక్కటి గుర్తుంచుకోండి — నిజం మీకు తెలిసినది. ఒకళ్ళు చెప్పేదికాదు. ఎవరేం చెప్తే అది నిజం అనుకుంటే ఎలా ?! మీ ఉద్దేశ్యాల మీద మీకంత నమ్మకంలేదా ?

**ఎ. ఆర్. ఆర్. — హైదరాబాదు**

పెళ్ళి అనే మనోవ్యాధితో రోజుకు రోజు కృశించిపోతున్నాను. దీని నుంచి విముక్తి మార్గం తెలుప ప్రార్థన.

దేనినుంచయ్యా బాబూ పెళ్ళినుంచా ? పెళ్ళి కోసమా ? దేనితోనీ మనో వ్యధ ?!

**శంకర్ — బొంబాయి**

ఏదైనా పని పట్టుదలతో అవుతుందా ?ఇనప్పు ఎన్సుతో అవుతుందా ?

ప్రస్తుతంలో రెండోదే నయం.

**వి. ఆర్ ఎమ్ — సిద్దిపేట**

అభివృద్ధి చెందుతున్న వాళ్ళను సహించలేని ప్రజలున్న మనదేశం బాగుపడదని నా అనుమానం.

ఆ అభివృద్ధి ప్రజలని నెత్తిన కాలేసి అణిచి—సాధిస్తున్నదైతే— మీ అనుమానం నిజం !

**ఎమ్. ఎస్. ఎన్. — హైదరాబాదు**

చేసే పనిలో కిటుకులు తెలుసుకోవడం ముఖ్యం కాదా?

చేసే పనిలో ట్రిక్కులు నేర్చుకునేకంటే పని నేర్చుకోవడం ముఖ్యం కదా మూర్తిగారూ!

**జి. ఎమ్ ఆర్. — హైదరాబాదు**

మనిషి కోరికలలో సగమైనా తీరితే ఎంత బాగుండను కె.రా. గారు.

ఆ చాలా బాగుంటుందయ్యా అతగాడి అవస్థలు రెట్టింపవుతాయి !!

అబద్ధాల కోరులెవరు ?

తనని గురించే చెప్పుకునే వాళ్ళు !

**పి. సి. హెచ్ — పొన్నూరు**

అసలు మనిషి పుట్టి ఏమి చెయ్యాలి ?

ఎలాగా పుట్టాడు కనుక జన్మకి సార్థకత చేకూరేలా, పెరిగి పెద్దవాడై జీవితం గడపాలి.

**వి. ఎమ్ — పిండిప్రోలు**

నలుపైతే చీకటి. ఎరుపైతే వెలుతురు అన్నారొక కవిగారు.

అది కవిగారి ఉత్ప్రేక్ష సోదరీ, అంచేత నల్లగా ఉన్నవాళ్ళంతా బెంగెట్టుకో నక్కరలేదు !

**కె జి. ఎస్ కె. — కుప్పం**

మీకు అదృష్టంపై నమ్మకం వుందా ?

ఆ పైవాళ్ళ అదృష్టంపైన ! అదేమిటో ఎప్పుడూ పక్క పెరడు పచ్చగా కన్పిస్తుంది !

కాఫీ రుచిని అధికంచేసే క్రొత్త తయారీ విధానము
కాఫీ తాజాతనాన్ని అధికంగా సంరక్షించే క్రొత్త పాకెట్

# క్రొత్త బ్రూక్ బాండ్ గ్రీన్ లేబిల్




ఇప్పుడు బ్రూక్‌బాండ్ వారు ఉపయోగిస్తున్న క్రొత్తతయారీ విధానంవల్ల క్రొత్త గ్రీన్‌లేబిల్ కాఫీ రుచి ఇదివరకు కంటే చాలా అమోఘంగా వుంటుంది.

అంతేకాదు ..బ్రూక్‌బాండ్ వారిచే ప్రథమంగా ప్రవేశపెట్టబడిన క్రొత్త 'కీప్-ఫ్రెష్' ప్యాకెట్ కాఫీపొడి అప్పుడే వేయించిన కాఫీపొడిలాగ చెమ్మ ఎక్కకుండా వారాలకొద్దీ ఎప్పటికప్పుడే తాజాగా వుంటుంది.

## క్రొత్త గ్రీన్ లేబిల్

అమోఘమైన రుచి విశిష్టమైన తాజాతనము
(ఇది బ్రూక్‌బాండ్ వారు మాత్రమే చేయగలరు)

OBM 7148 TG

ఎన్నిక చేసిన కొన్ని పట్టణములలో మాత్రం లభించును.

# అన్వేషణ

కప్పగంతుల మల్లికార్జునరావు

లోకం చీకటి ముసుగును కొంచెం కొంచెంగా తొలగించుకొనే ప్రయత్నంలో వుంది. నెలల ప్రాయంలో బిడ్డలా సుకుమారంగా వున్న వెలుగు రేఖలను పొగమంచు మింగేయాలని ప్రయత్నిస్తోంది.

ధనవంతులు, బద్ధకస్తులు తప్ప మిగతా వారు నిద్రలేచి దినకృత్యాలలోకి దిగబడటానికి సన్నాహాలు చేసుకొంటున్నారు. పక్షులు కిలకిలా రావాలు చేస్తున్నాయి.

ఆ మంచును, చీకటిని లెక్కచేయకుండా రంగనాథరావు క్రమబద్ధంగా అడుగులు వేస్తూ పరుగెడుతున్నాడు. అలా ఆయన ఎండనక, వాననక, మంచు అనక సూర్యోదయానికి పూర్వమే అరవై సంవత్సరాలుగా పరుగెడుతూనే వున్నాడు ఆ వ్యాయామంలో ఆయన ఆరోగ్య రహస్యమేకాదు— జీవ రహస్యమూ దాగి వుంది.

పరుగెత్తుట ఆరంభించిన కొత్తల్లో— అంటే పదిహేనేళ్ల వయస్సులో— కాళ్లు రెండూ వుత్సాహంగా, వాడుపుగా, శక్తిమంతంగా పరుగెత్తేవి. వయసుతో పాటు శక్తి, వాడుపు క్షీణించి వుండవచ్చు. కాని వుత్సాహం మాత్రం తగ్గలేదు.

పరుగెడుతూ, రోజూ ఆయన, తన కెదురయ్యే కూరగాయల్ని టౌన్‌కు తీసుకు వెళ్లే కావళ్లవాళ్లను, సైకిళ్లవాళ్లను పలకరిస్తాడు. ప్రకృతి సౌందర్యాన్ని కనులారా చూచి ఆనందిస్తాడు. పక్షులకూతల్ని చెవులారా విని తన్మయత్వం చెందుతాడు

కానీ యివాళ ఆయన మనసు వాటిమీద లగ్నం కాలేదు. కాళ్లల్లో ఆ వుత్సాహంలేదు. మనవరాలు రాత్రి చెప్పిన తన కథ, ఆమె అభ్యర్థన ఆయన చెవుల్లో మారుమోగుతున్నాయి.

'తాతయ్యా. నేనెప్పుడూ ఏమీ అడగలేదు నిన్ను యింకా అడగను కూడా. కానీ యీ వొక్క సహాయం చెయ్యి తాతయ్యా నా సంసారాన్ని నిలుపు ప్లీజ్. తాతయ్యా. ప్లీజ్'

ఏటు చూచినా మనవరాలి దీన వదనమే. ప్రకృతిలోని అన్ని చప్పుళ్లూ ఆమె మాటల్లో కల్సిపోతున్నట్లుంది.

రంగనాథరావు మనసు వికలమయింది. కాళ్లు తోటకూర కాడల్లాగయ్యాయి. పరుగు నాపి వొకచోట కూలబడ్డాడు!

*   *   *



రంగనాథరావు ఒకప్పుడు జిల్లా విద్యా శాఖాధికారిగా పనిచేసేడు. వేళకు ఆహారం, నిద్ర, వ్యాయామం, భగవత్ధ్యానం ... వైయ్యక్తికజీవితం ఎంత క్రమబద్ధమో, ఉద్యోగ జీవితంలోనూ ఆయన పాలన అంత క్రమ బద్ధంగానూ సాగింది. మహోన్నత ఆదర్శాలు గల ఉపాధ్యాయుడుగా, సేవాతత్పరత గల పాలకుడుగా గొప్పపేరు తెచ్చుకొన్నాడు. రిటైర్ అయ్యేనాటికి ఆయనకి మిగిలిన ఆస్తి అదే.

యిద్దరు కొడుకులు చదువులో పైకొచ్చారు. ఎక్కడో మంచి వుద్యోగాలే చేస్తున్నారు. తండ్రిని గౌరవిస్తారు. తను దగ్గరికొచ్చి వుండమని ప్రేమతో ఆహ్వానిస్తుంటారు. కొన్నాళ్లు వాళ్లవద్ద వున్నాడు

## అన్వేషణ

కూడా.

కానీ జీవిత విలువలు, జీవిత విధానంలో ఎన్ని మార్పులు? ఎంత వ్యత్యాసం? కొడుకుల యాంత్రిక జీవన సరళిలో యిమడ లేక పోయాడు. వారు ఎన్నుకొన్న విధానం అలాంటిది. దానితో ఘర్షణ పడి ఏంలాభం?

ఊళ్లోనే కూతురు, అల్లుడు వున్నారు. పెద్దదైన ఒక్కగా నొక్కకూతురిని ఆయన వుద్యోగంలో నుంచి రిటైర్ కాక ముందే ఓ లాయర్‌కిచ్చి పెళ్లి చేసేడు.

అల్లుడు భాస్కరరావు స్థితిపరుడే. కానీ చేతికి ఎముకలేని మనిషి. ఆస్తినంతా ధార్మిక కార్యక్రమాలకే ఖర్చించాడు. సంపాదిద్దామన్న ధ్యాస పెద్దగా లేని మనిషి కావటం చేత లాయర్ వృత్తిలో అంతగా ఎక్కిరాలేదు.

రాబడికన్నా ఖర్చు జాస్తి అయి ఆర్థిక విషవలయంలో చిక్కుకొనే తరుణంలో భాస్కరరావు కళ్లు మూసేడు - హఠాత్తుగా.

'రామా కృష్ణా' అనుకొంటూ శేష జీవితాన్ని ఎక్కడో ప్రశాంతంగా గడిపేయాలనుకొన్న రంగనాథరావు, కూతురు కుటుంబ బాధ్యతలను తీసుకోక తప్పలేదు.

కూతురు శారద చేత మిగిలిన ఆస్తినంతా అమ్మించేసేడు. తీర్చాల్సిన అప్పులు పోగా ఆమెకు మిగిలింది పెద్దగా చెప్పుకోదగ్గ ఆస్తేంకాదు. దాంతో ఆమె పిల్లల్తో తండ్రి పంచ చేరింది.

శారదకు ముగ్గురు పిల్లలు. పెద్దపిల్ల

శాంతి. రెండోవాడు రవి. కడగొట్టు పిల్ల పుష్యమి.

చూస్తుండగానే శాంతి పెళ్ళికి ఎదిగింది.

మనవరాలు పెళ్ళి రంగనాథరావుకు మహా సమస్యే అయింది. కాలభ్రమణంలో వచ్చిన మరికొన్ని విపర్యాలను ఆయన తెల్సుకొన్నాడు.

శాంతి అందగత్తె. చదువుకొంది. అయినా కట్న కానుకలనేం తక్కువడగ లేదెవ్వరూ. పైగా వుద్యోగం లేదన్న వంకలు పెట్టేరు.

పూర్వం రామాయణ భారత భాగవతాలు చదవగలిగిన స్త్రీలంతా విద్యావంతుల క్రిందే లెక్క. వాళ్ళకి ఏదో తగు మాత్రం కట్నాలు ముట్ట చెప్పి పెళ్ళిళ్ళు చేసే వారు. ఆ తర్వాత డిగ్రీల విద్యకు కొలమానాలయ్యాయి బోలెడు డబ్బు ఖర్చు పెట్టి డిగ్రీ చదువు, ఆ తర్వాత కట్నాల సంచులు కుమ్మరించి పెళ్ళిళ్ళు చేసేరు. ఇప్పుడు కాబోయే భార్య ఉద్యోగస్తురాలై వుండాలి— కట్నమూ తేవాలి అంటున్నారు

పెళ్ళయ్యాక వుద్యోగం చేసే కండిషన్ మీద సురేంద్ర శాంతిని పెళ్ళి చేసుకొన్నాడు.

సురేంద్ర వుద్యోగం తప్ప ఆస్తిపాస్తులేం లేని మనిషి. శాంతితో పోలిస్తే అందచందాల్లోనూ పెద్దగా మార్కులు సంపాదించుకోలేదు. అయినా కట్నాలకైతేనేం, లాంఛనాల పేరిటైతేనేం, వాళ్ళు రంగనాథం దగ్గర రాబట్ట గలిగినంత రాబట్టేరు — నిర్మొహమాటంగా, అదిరించి బెదిరించి!

'అయ్యో! జీవితం మరీ యింత వ్యాపార సరళి అయిపోయిందే!' అనుకొని విచారించటం కన్నా రంగనాథరావు చేయగలిగిందేముంది?

అత్తగారింటికి వెళ్ళిన దగ్గర నుంచి శాంతికి కష్టాలే. అత్త మామ, భర్త 'అది తేలేదు యిది తేలేదు' అని దెప్పి పొడిచేవారు.

అన్ని బాధల్నీ ఆ పిల్ల కడుపులోనే దాచుకొంది.

కానీ తమ అసంతృప్తిని అవతల వాళ్ళు కూడా భరించ గలగాలిగా? ఆ శక్తి, ఆ సంస్కారం వాళ్ళకు లేదు.

ఫలితంగా శాంతి నిన్నటిరోజు హఠాత్తుగా ఒంటరిగా పుట్టింటి కొచ్చింది.

హఠాత్తుగా ఆమె రాకకు కారణాన్ని ఏ పట్టాన చెప్పలేదు. తల్లి ఎన్నో విధాల అసలు విషయం రాబట్టాలని ప్రయత్నం చేసి విఫలమయింది. ఊహూ... అన్ని ప్రశ్నలకీ కన్నీరే సమాధానం!

ఎవరిదోవన వాళ్ళు పడుకొన్నారన్న మాటే కాని నిద్ర ఎలా పడుతుంది?

రంగనాథం గది తలుపు తట్టిన సవ్వడి. తలుపుతీస్తే కన్నీటితో శాంతి.

'ఏమ్మా శాంతీ? నీ తాతయ్యకు, నీ తల్లికి చెప్పుకోని రహస్యాలేమిటమ్మా? నీ బాధలో మేము బాధ పంచుకోలేమా?'

'రహస్యం ఏమీ లేదు తాతయ్యా. అత్తింటి గొడవలు పుట్టింట చెప్పరాదని, పుట్టింటి గొప్పతనాన్ని అత్తవారింట పొగుడుకోరాదని మీరేకదా చెప్పేరు? అందుకే అత్తింటి వారి విపరీత ధోరణిని మీకు చెప్పటానికి సందేహిస్తున్నాను.'

'చెప్పమ్మా. ఫర్వాలేదు. ఏం చేస్తాం? కాలం అలా వచ్చింది. ఎంత చదువులు చదివినా, ఉద్యోగాల పేరిట ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సాధించిన స్త్రీ పైన బరువులు పెరుగుతున్నాయే కాని తరగటం లేదు. చదవాలి— కట్నం యివ్వాలి. ఉద్యోగం చెయ్యాలి— పిల్లల్ని కనాలి పెంచాలి, భర్తకు వంటలుచేసి పెట్టాలి. స్త్రీకి ఇలాంటి స్వాతంత్ర్యం ఏంతవరకు లాభమో నేను వూహించ లేక పోతున్నానమ్మా'.

అలా కొంత మాట్లాడుకొని మనసుని స్వాంతన పర్చుకుని, శాంతి తాతయ్యతో అసలు విషయం చెప్పింది—

'తాతయ్యా. వారికి మన మిచ్చిన కట్నం చాలలేదు. నేను పెళ్ళయ్యాక వుద్యోగం చేసి సంపాదిస్తానన్న ఆశతో వారు నన్ను చేసుకొన్నారట! కానీ నేనేం చెయ్యను తాతయ్యా? నాకు వుద్యోగం వస్తే నేను చెయ్యనన్నానా? ఉద్యోగం నేనే సంపాదించుకోవాలిట ఉద్యోగం సంపాదించి పెడ్తామని పెళ్ళికి ముందు వాళ్ళనలేదట. అలా ఉద్యోగం సంపాదించి పెట్టే లెక్కనయితే కట్నం డబ్బు మూడింతలు అడిగే వాళ్ళట. ఉద్యోగం కోసం నేను నాకు చాతనయిన ప్రయత్నాలు చాలా చేసేను తాతయ్యా. లాభం లేక పోయింది. ఆఖరికి మొన్ని మధ్య మా అత్త గారికి వో గొప్ప ఆలోచన వచ్చింది. అన్ని బిజినెస్సులలోకి యిప్పుడు స్కూళ్ళ బిజినెస్సు ఖాయంగా లాభాలు తెచ్చిపెడుతుందిట. అంచేత ఆ బిజినెస్సును నన్ను స్వయంగా చేయమంది. 'ఎలాగైన డియావో మనవరాలువిగా?' అందామె ఎగతాళిగా'

'అంటే? నువ్వు స్కూలు స్థాపించి నడుపుతావా?'

'అవును తాతయ్యా. స్కూలు నా పేరిట స్థాపించబడాలిట. కాని మీరు డియావోగా పనిచేసి రిటైరయ్యారు కదా? అంచేత దాని మేనేజ్‌మెంట్ అంతా మీరు చెయ్యాలిట! మీకు అధికారుల్లో పలుకుబడి వుంటుంది కనుక దాన్ని వుపయోగించి స్కూలు రికగ్నిషన్, గ్రాంటులు సంపాదించాలిట.






'ఈ వయసులో మిమ్మల్ని మళ్లీ ఆ ఉద్యోగం జంఝాటంలోకి దించటం నాకు ఇష్టం లేదు తాతయ్యా. మీరు ఉద్యోగం చేసే నాటికి నేను పుట్టకపోయినా, ఉద్యోగం చేసే రోజుల్లో మీరెంత నిజాయతీపరులో, నిక్కచ్చి మనిషియో నేను అమ్మ ద్వారా, నాన్న ద్వారా విన్నాను తాతయ్యా. అందుకే వారి ప్రతిపాదనను నేను ఆమోదించలేదు. కానీ వారు నన్ను శారీరకంగానే కాక మానసికంగా కూడా చిత్రహింసలు పెడ్తున్నారు తాతయ్యా వారిని సంతృప్తి పరచటానికి నేను స్కూలు పెట్టక తప్పదు తాతయ్యా. ఇప్పుడో మీరు సంపాదించుకొన్న మంచి పేరును ఇప్పుడు నా కోసం దుర్వినియోగం చెయ్యక తప్పదు. విద్య బిజినెస్సు చేసి నేను ధనాన్ని సంపాదించక తప్పదు. లేని పక్షంలో నా సంసారం బజారు పాలవుతుంది. అదీ తెలుగు మీడియం స్కూలుకాదు. ఇంగ్లీషు మీడియం కాన్వెంటు స్కూలు తాతయ్యా

తాతయ్యా, నేను ఇప్పుడూ ఏమీ అడగలేదు నిన్ను. ఇంక అడగను కూడా. కానీ ఈ ఒక్క సహాయం చెయ్యి తాతయ్యా. నా సంసారాన్ని నిలుపు, ప్లీజ్. తాతయ్యా ప్లీజ్'

* * *

రంగనాథం చాలా సేపు ఆలోచించాడు.

తాను జిల్లా విద్యాశాఖాధికారిగా పనిచేసే రోజుల్లో అర్హులైనవారికి సహాయం చేసేడు కానీ, ఎవరి నుంచి చిన్న మెత్తు సహాయాన్ని అర్థించలేదు. అందుకే తనకు ఈ నాటికీ ఈ విద్యాశాఖలో ఓ గౌరవం, గుర్తింపు వున్నాయి.

ఈనాడు అధికారులుగా వున్న వాళ్లంతా ఒకప్పుడు తన వద్ద పని చేసిన వాళ్లో, లేక తను ఉద్యోగాలు ఇచ్చిన వారే

తను కోరితే ఏ పనినీ కాదనరు. కానీ అలా తన వ్యక్తిగత లాభం కొరకు కోరటం ఎంత వరకు సమంజసం? అందులో శాంతికి టీచరుకు కావటానికి కావల్సిన అర్హతే లేదు. పైగా వారు స్కూలు పెట్టాలను కొంటున్నది దేని కోసం? విద్యాదానం చెయ్యటానికా? ఊహు. వ్యాపారం కొరకు! విద్యతో వ్యాపారం? ఎంతటి హైన్య స్థితి!

ఆయన మనసు, జన్మ జన్మల సంస్కారం, అందుకు అంగీకరించలేదు. కానీ అంగీకరించకపోతే ఓ ఆడపిల్ల సంసారం అన్యాయమవుతుందే?

# అన్వేషణ

"అమ్మా శాంతి. స్కూల్లో టీచరుగా పని చెయ్యటానికి తగు అర్హతలేని నువ్వు స్కూలు స్థాపిస్తాననటం సమంజసం కాదు. అంచేత నేను నువ్వు కోరినట్టు 'ఇంగ్లీషు మీడియం స్కూలు, స్థాపిస్తాను. అలాంటి బిజినెస్ పద్ధతులకు, షో బిజినెస్సులకు నేను వ్యతిరేకం అని నీకు తెల్సు. కాని నీ భవిష్యత్తు కోసం నేను చేయక తప్పేలా లేదు. నువ్వు ఈలోగా టయినింగ్‌కా. అప్పుడు స్కూలు మేనేజ్‌మెంట్ నీకు బదిలీ చేయిస్తాను."

'అలాగే తాతయ్యా. ఎలాగోలాగు ఆ స్కూలుకు రికగ్నిషన్ సంపాదించి పెడ్తే చాలు మిగతా విషయాలు మా మామ గారు అత్తగారు, మావారు చూచుకొంటారు.'

* * *

తగు డాక్యుమెంట్లు అన్నీ తయారు చేసుకొని ఎండలో నడిచి జిల్లా విద్యాశాఖాధికారి ఆఫీసు చేరుకొన్నాడు రంగనాథరావు. ఎప్పటివో గుర్తులు. ఆ ఆఫీసులో ఆయన జిల్లా విద్యాశాఖాధికారిగా పనిచేసేడు

'లచ్చారావు, జిల్లా విద్యాశాఖాధికారి'

పేరు మార్పు అదే గది- అదేబోర్డు!

కొండయ్య ఎవరితోనో మాట్లాడుతున్నాడు కొంచెం వొళ్లు చేసేడు టెర్లిన్ బట్టలు వేసుకొని, గోల్డ్ చైన్ గడియారంతో ట్రిమ్‌గా వున్నాడు.

కొండయ్యకు తను ఉద్యోగం ఇచ్చిన రోజు గుర్తుకొచ్చింది. అప్పట్లో సన్నగా, పీలగా, బీదబట్టలతో వుండేవాడు తను వాడికి శుభ్రంగా వుండమని డబ్బులిచ్చేవాడు. ఆనాడు వాడి మెళ్లో దవాలా బంట్రోతు బిళ్ల పట్టాకు బిగించినది వేలాడుతుండేది. ఈ నాడు మెడలో బరువైన బంగారు చైను వేలాడుతుంది.

'కొండయ్యా'

'ఎవరయ్యా? అయ్యగారు లేరు. నాలుగు రోజుల దాకా రారు.' వచ్చిన మనిషిని వెనక్కి తిరిగి చూడకైనా చూడకుండా అనేసి తన మాటల్లో మునిగిపోయాడు.

'బాగున్నావా కొండయ్యా?'

ఆ కుశల ప్రశ్నకు వెనక్కి తిరిగి చూచి 'మీరా అండి బాబూ. చూడలేదు చూచాక్కూడా వెంటనే గుర్తు పట్టలేకపోయాను'

కొండయ్య ద్వారా ఆ ఆఫీసులో పనిచేసే వాళ్ల వివరాలు తెల్సుకొన్నాడు. ఒక్క హెడ్ క్లర్క్, లచ్చారావు తప్ప ఆ ఆఫీసులో ఆయనకు తెల్సిన వాళ్లెవరూ లేరు.

హెడ్‌క్లర్క్ ఫస్టు అపాయింట్‌మెంట్ రంగనాథం దగ్గరే. ఇక ఇప్పటి డియీవో లచ్చారావు అప్పట్లో డిప్యూటీ ఇన్‌స్పెక్టరు. ఎలిమెంటరీస్కూలు టీచరను పదిపరక్కు వేధించుకు తినేవాడు. ఆడ టీచర్లు కాస్త ఎర్రగా బుర్రగా కన్పిస్తే చాలు తిక్కరేగేది. తనకతని ప్రవర్తన మీద కంప్లయింట్స్ వస్తే ఆ రోజుల్లో విచారణ చేసి అవి నిజమని నిరూపితమయ్యాక స్వయంగా పిల్చి చీవాట్లు వేసి పొట్టమీద కొట్టటం ఇష్టంలేక వార్నింగ్‌తో వదిలేసేడు.

లచ్చారావుకు ఓ ఉత్తరం వ్రాసి అప్లికేషన్‌తో పాటు దాన్ని కూడా కొండయ్య కిచ్చాడు— లచ్చారావు వచ్చాక ఇమ్మని.

'అలాగేనయ్యా. మీ పని అవుతుందండయ్యా' అంటూ నసిగేడు

## కంప్యూటర్లతో కార్టూన్ చిత్రాలు

జపానులో, కంప్యూటర్లతో కార్టూన్ చిత్రాలను తయారుచేసే కొత్త పద్ధతిని రూపొందించారు. దీనివలన నిర్మాణంలో ఖర్చులు బాగా తగ్గగలవు. చిత్రాల నాణ్యత కూడా గణనీయంగా పెరుగుతుంది. ప్రస్తుతం దీనిని విదేశాలకు ఎగుమతి చేయాలని ఆలోచిస్తున్నారు. జపాను వాణిజ్య మంత్రిత్వశాఖ కూడా దీనిని ఆమోదించింది. జపానులో చలనచిత్రోత్సవాలను నిర్వహించాలని యోచిస్తున్నారు. కొంతకాలం క్రితం జపాను దేశం "ఆస్ట్రోబాయ్" అనే చిత్రాన్ని ఎగుమతి చేసింది. అప్పటి నుండి ఇటువంటి చిత్రాలకు మంచి గిరాకీ ఏర్పడింది. జపానులోని కంప్యూటరు గ్రాఫిక్స్ లిమిటెడ్ కంపెనీవారు, టోక్యో విశ్వవిద్యాలయం, న్యూయార్కు ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ వారి సహకారంతో ఈ పద్ధతిని రూపొందించారు.

కొండయ్య. ఆ నసుగుడు అర్థం తెల్సుకొనే శక్తి రంగనాథరావు కెక్కడిది ?

* * *

నెలైనా రికగ్నిషన్ విషయంలో ఏ వర్తమానం రాలేదు యీలోగా శాంతి తన అత్తగారు యింటి ముందు 'శారదా విద్యా కేంద్రం' అన్న బోరు కట్టించేసి పిల్లల్ని అడ్మిట్ కూడా చేసేసు కొంటున్నదని రాసింది. అది యిల్లీగల్ కానీ ఏంచెయ్యటం ?

లచ్చారావు రికగ్నిషన్ ఆర్డరు పంపటానికి యింత జాప్యం ఎందుకు చేస్తున్నట్టు ? డాక్యుమెంట్లన్నీ సక్రమంగానే వున్నాయే ?

రంగనాథంగారు ఆఫీసుకెళ్లేసరికి లచ్చారావు ఆఫీసురూమ్‌లోనే వున్నాడు.

'అయ్యగారితో చెప్తాస్తానయ్యా' కొండయ్య లోపలికెళ్లాడు.

'కూర్చోండయ్యా. పిలుస్తామన్నారు'

రూమ్ బయట బల్లమీద కూర్చున్నాడు రంగనాథరావు.

ఏమిటంత పని ? ఎంత పని అవుతే మాత్రం విజిటర్స్‌కి మర్యాద యివ్వవద్దా ?

మధ్యాహ్నం లంచికి ముందు పిలుపొచ్చింది లచ్చారావు నుండి రంగనాథరావు ఆశించి నట్లు లచ్చారావు ఆయన్ని రిసీవ్ చేసుకోలేదు

'యీ విజిటర్స్‌తో చచ్చి పోతున్నామండీ. ప్రతి పనికీ కాగితం పెట్టీ పెట్టగానే దాని వెంట పరుగెత్తుకొస్తుంటారు' అంటూ బెల్లు కొట్టేడు.

గుమస్తానో, హెడ్‌క్లర్కునో పిల్చి ఫైలు తీసుకురమ్మంటాడని ఆశించాడు రంగనాథరావు.

''చూడు కొండయ్యా వీరెప్పుడో మన ఆఫీసులో పని చేసేమంటున్నారు నాకు గుర్తు లేదనుకో. అయినా మనం సహాయం చెయ్యాలి కదా ? వీరిని 'ఏటూ' గుమాస్తా దగ్గరికి తీసుకెళ్లు'

రంగనాథరావుకు బాధవేసింది. ఏడుపొచ్చినట్లయింది కోపం వచ్చింది. పళ్లు బిగుసుకొన్నాయి.

తన దగ్గర పనిచేసిన వ్యక్తి ఆ కుర్చీలో కూర్చోగానే ఎంత అహంకరించి మాట్లాడుతున్నాడు ? వొకప్పటి డియీవోతోనే అలా మాట్లాడే వ్యక్తి యిక సామాన్య మానవుల పట్ల ఎలా ప్రవర్తిస్తాడు ?

విజిటర్స్ వస్తే తాను ఎంత మర్యాదగా

రూలు పోజిషన్ వివరించి చెప్పటం పోనిచ్చి గుమాస్తా వద్దకు పంపుతాడా ? గుమాస్తా మీద ప్రతిదానికీ డిపెండ్ అయ్యే ఆఫీసరూ వో ఆఫీసరేనా ?

'రండయ్యా'

ఏటూ క్లర్క్ పాతికేళ్లన్నాలేని యువకుడు. సిగరెట్టు తాగుతూ వారపత్రిక చదువుతున్నాడు— కుర్చీలో ఓంగిలపడి కూర్చొని పైన సీలింగ్‌ఫేను గిర్రున తిరుగుతోంది రెండు ట్యూబ్‌లైట్లు ఆ గదిలో వెలుగుతున్నాయి.

ఎంత ఇన్‌డిసిప్లెన్ ? ఎంత పరువు తక్కువపని ?

తన రోజుల్లో అలా ఎవరైనా ప్రవర్తిస్తే ముందు సస్పెండ్ చేసి ఆ తర్వాత డిస్మిస్ చేసే వాడు

'ఏంటిసార్ ? ఏం కావాలి ? భారత భాగవత రామాయణాలు చెప్పవద్దు. రికగ్నిషనా ? గ్రాంటా ? '

'రికగ్నిషన్'

'బిల్డింగ్, మేస్టర్లు వున్న స్కూలా ? లేక పేపరు స్కూలా ? దేని పద్ధతి దానికుంది. తెల్సిగా మీకు ? రాతి వెంకటేశ్వరా బార్‌కు రండి మాట్లాడుకుందాం సరిగ్గా ఏడుగంటలకి. నౌ. యూకెన్‌గో. సీరియల్ మంచి రసపట్టులో వుంది.'

రంగనాథరావుకి కోపం కట్టలు తెంచుకొంది. అయినా నిగ్రహించుకున్నాడు.

'బాబూ. నువ్వింకా పాతికేళ్లన్నా నిండని కుర్రాడివి. నేను యీ ఆఫీసులో డియీవోగా పనిచేసి రిటైరయిన వాడిని. నీధోరణి నాకేం నచ్చలేదు. అది నీకూ మంచిది కాదు. దేశానికీ మంచిదికాదు.'

'ఆగండాగండి మాస్టరుగారూ. అందుకే భారత భాగవత రామాయణాలు మాటాడవద్దాన్నాను. ముందు మీకు రికగ్నిషన్ కావాలో అక్కర్లేదో తేల్చుకొని ఆ తర్వాత పురాణ పఠనం చేయండి. ఆఫ్టరల్ రిటైర్డ్ డియీవోనా మీరు ? అంత మాత్రానికే వణికిపోవాలను కొంటున్నారా ? నేను ఎవరో, ఎంత డబ్బిచ్చి యీ గుమస్తా పోస్ట్‌ను కొనుక్కొన్నానో మీకు చెప్పేద్దామనే వుంది. కానీ ముసలోడివి కదా ? గుండాగి చస్తావని జాలేసి చెప్పటం లేదు. సో—మైడియర వోల్డ్‌మేన్. రికగ్నిషన్ కావాలను కొంటే బార్‌లో కలవ్వండి. లేదనుకోండీ, రికగ్నిషన్ విషయం మర్చిపోండి యిది మన ఫైనల్ జెడ్జ్‌మెంట్. దీనికి ఏ కోర్టుకు పోయినా అప్పీల్ వుండదు. కొండయ్య— ముసలాడిని బయటికి పంపెయ్యి. అప్పట్లు వోల్డ్‌మేన్— నువ్వా సరే వొట్టి వెర్రి బాగులవాడిలా వున్నావు పార్టీ యివ్వటానికి నిన్ను బార్‌కు రమ్మని పిలవటం లేదు; కమ్ ప్రిపేర్డ్. కొండయ్య- వివరాలు చెప్పి పంపు'

కొండయ్య వెంట ఎలా బయటికొచ్చాడో రంగనాథరావుకు తెలియదు. బయట ఎండ మండి పోతోంది.

'బాబూ. ఏటూ క్లర్క్ బాబూగారంటే ఏవరనుకొన్నారు ? డియీవో లచ్చారావు గార్ని సస్పెండ్ చేస్తే తిరిగి వారంలోగా






లంచం కేసు మాఫీ చేయించి వుద్యోగం వేయించిన పవర్‌ఫుల్ మేన్. జిల్లా పరిషత్ ఛైర్మెన్ బావమర్దిగారికి స్వయానా మేనల్లుడు. అరితో గొడవలెందుగ్గాని యివ్వండి, మీరు బ్రాందీషాపుల కెళ్ళకుండా పనయ్యేలా నేను చూస్తాగా? కాని రేటుల్లో మాత్రం మార్పుండదు. ముందే చెప్తున్నాను సార్'

కొండయ్య యింకా ఏమో చెప్తున్నాడు. రంగనాధరావు చెవిలోకి అవేమీ దూరలేదు. వేరుగా డిపూవో లచ్చారావు గదిలోకి వెళ్ళేడు.

'మిస్టర్ లచ్చారావ్. యిది ఆఫీసా? బందిలి దొడ్డా? అవినీతి కేంద్రమా? మీ ఏటూ క్లర్క్‌కు వ్యతిరేకంగా నేను కంప్లయింట్ యివ్వాలనుకొంటున్నాను.'

'ఏటూ క్లర్క్ మీద కంప్లయింటా? అతనంతటి హానెస్ట్ వుద్యోగి, సిన్సియర్ క్లర్క్, సౌండ్ ప్రిన్సిపుల్స్ వున్న వ్యక్తులు యీ ప్రపంచంలో నాకు తెల్సి ఎవరూ లేరండి. హీ యీజ్ ది ప్రౌడ్ ఆఫ్ మై ఆఫీస్. నో నో. హి యీజ్ ది ప్రౌడ్ ఆఫ్ ది నేషన్. మీరేదో పొరపాటు పడివుంటారు.'

## అన్వేషణ

'నేను కాదు. మీరు పొరపాటు పడుతున్నారు. ముందునాకో కాగితం యివ్వండి'

'కాగితమా? అంటే కాగితాల్ని అమ్ముతామను కొంటున్నారా యిక్కడ? అసలు మా ఆఫీసులో కాగితాలు వున్నయ్యా? కాగితాల మీద పనులు చేయమండీ మేము. మ్యూచ్యువల్ అండర్‌స్టేడింగ్. అయి నామీరు అడిగేరు కనుక తెప్పిస్తానుండండి' అంటూ కొండయ్యను పిల్చి ఏదో చెప్పి పంపేడు.

కొండయ్య రంగనాధరావు పెట్టిన రికగ్నేషన్ కాగితాలతో వచ్చాడు

'యివి మీరిచ్చిన కాగితాలే. మీ ఫైలే యిది. ఆ కాగితాలు మీకే యిస్తాం. కానీ అలా కాదు కంప్లయింట్ యిస్తావన్నారుగా?'

కొండయ్య అగ్గిపుల్ల వెలిగించాడు ఫైలుకు.

'మిస్సింగ్ ఫైల్'. అయినా ఫర్వాలేదు. మీ ఫైలు బూడిదను హాయిగా జేబులో వేసుకు పోండి'

రంగనాధరావుగారికి హఠాత్తుగా వృద్ధాప్యం వచ్చినట్లయింది. యిదంతా కలా? మాయా? భ్రమా? లేక దుష్టసత్యమా?

బయటికొచ్చాడు.

'బాబూ. మీ కోసం చాలా శ్రైవ్‌వేస్ట్ చేశాను. ఎర్నింగ్స్‌లాస్. నా మామూలు యివ్వండి సార్. ఎంత? జస్ట్ ఎ హండ్రెడ్ రూపీస్ సార్!'

కొండయ్య చెయ్యి చాచేడు. ఆ చెయ్యి వెయ్యి— లక్ష— కోటి చేతులై అతనిని చుట్టుముట్టింది.

భూతాల చేతులవి. భస్మాసురహస్తాలు! నారాయణుడేడీ? సాంబశివుడిలా భయంతో రంగనాధరావు పరుగెత్తసాగాడు. కానీ వుదయంపూట వ్యాయామం కోసం చేసే పరుగు కాదది. అన్వేషణ! దుష్ట శిక్షకుల కోసం శిష్ట రక్షకుల కోసం చేసే అన్వేషణ!

మిట్ట మధ్యాహ్నం, మండుటెండలో ఆరంభమయిన ఆ పరుగు ఆగేదెన్నడో? భస్మాసురహస్తాలు అంతర్ధానమయ్యేదెన్నాడో? ఆ అన్వేషకుడికి విశ్రాంతి ఎన్నడో?

# ఫాలాక్షుని ప్రేలి



## కట్నంకోసం!

మద్రాసుకు చెందిన దుర్గేష్‌నందిని అనే 14 సంవత్సరాలమ్మాయికి తన మేనమామతో 1974లో వివాహం జరిగిందట. వివాహపు తొలి రోజులు బాగానే జరిగినా, పోను పోనూ కట్నం తేలేదని భర్త, భర్త చెల్లెలూ, ఆయన తల్లీ సాధింపు ఆరంభించారట. పెళ్ళయి ఎనిమిదేళ్ళయి, ముగ్గురు పిల్లలు పుట్టినా యీ పాట తగ్గుముఖం పట్టక, ఆగో హాణగతిని ప్రిస్థాయి చేరుకున్నదట ఆమె భర్త పక్కింటావెతో సంబంధం పెట్టుకుని, ఆమెను తన పడక గదికి తెచ్చుకుని ఆదేమంటే చితకబాదే సరికామె తన తల్లిదండ్రులకు తెలియజేసిందట వాళ్ళొస్తే అతను కట్నం యాభైవేలు యివ్వందే కాపురం లేదన్నాడట. పొమ్మని నెట్టేస్తే, ఏణ్ణర్ధం పిల్లాడిని మాత్రం బతిమాలితే యిచ్చి, మిగిలిన ఇద్దరాడ పిల్లల్నీ యివ్వను పొమ్మన్నాడటా మహానీయుడు. విశాఖపట్నంలోని పెద్దలూ, పోలీసులూ జోక్యం కలుగజేసుకున్నా ప్రయోజనం లేకపోయిందట. భర్తా, కాపురం లేకపోయినా, నా గర్భవాసాన్ని చీల్చుకుని పుట్టిన ఆ యిద్దరి పిల్లల్నీ అయినా నా కొదిలితే చాలునని ఆ 22 ఏళ్ళ నిండనసంపూర్ణ స్త్రీ ఘోషించిందట — వినేదెవరు ?

## ప్రజాసేవా దీక్ష!

రావూరు (ఆంధ్రా)లో ప్రజాసేవకుడైన వో ఇందిరా కాంగ్రెసు యమ్మెల్యే యం. వెంకటరత్నం నాయుడుగారు తన పార్టీకి చెందిన వోఇద్దరిని ఏదో వో కేసు సందర్భంగా పోలీసులరెస్టు చేశారని తెలిసి రయమున ఆ పోలీసు స్టేషనుకు వెళ్ళి అక్కడి సబిన్‌స్పెక్టరును అష్టోత్తర సహస్ర తిట్లతో ఆతనిమీద విరుచుకుపడి, నే హైద్రాబాదెళ్ళి నీ కథ తిరగేస్తానన్నాడని బెదిరించి చిందులు చిందుకుంటూ వెళ్ళిపోయారట—ఆహా!

## వింత దావా!

ఒహ కాథొలిక్ ప్రీస్టు తనని ప్రేమించి, కామించి, అనుభవించి, ఆనక తనను వివాహం చేసుకుంటా నని మాట యిచ్చి, వో యిల్లు కట్టిచ్చి, పెళ్ళి బట్టలు కొనిచ్చి, పెళ్ళికి వో చర్చిలో డేటుయిచ్చి, సర్టిఫికెట్టూ యిచ్చి, ఆనక చెప్పా, చేయకుండా అంతర్ధానమై పోయాడని, ఫ్లారిడాలో వో 56 ఏళ్ళ వనిత ఆ ప్రీస్టుమీద, ఆయనమీది అధికారి బిషప్ మీద, పోప్‌పాల్ సెకండ్ కుర్రిప్రజంటేటివ్ మీదా కలిపి యాభైవేల డాలర్లకు దావా వేసిందట. ఆహా! దావాలు వేయడం అమెరికాలోనేనేర్చుకోవాలి.




## సినీ రాజకీయాలు!

దేశపాలన దక్షిణాది నటుల పాలయ్యేలావున్నది. కేంద్ర వైఖరి ఏమీ బాగుగా లేదని, కావేరి జలాలను తమిళనాడుకి తరలించాలని ఒకనాటి నటుడు యీనాటి ముఖ్యమంత్రి యం. జి. ఆర్. అన్నారట. నదులను జాతీయం చేయాలి అని యిటీవల యం. జి. ఆర్. అన్నా డి.యం.కె లో చేరిన నటి జయలలిత అన్నారట. "ఆంధ్రాకు కాంగ్రెసు ఏమి వొరగ బెట్టింది బ్రదర్! యీ ప్రభుత్వాన్ని మనం తిరిగి రానివ్వరాదు" అని తెలుగుదేశం పార్టీని స్థాపించిన "యన్టీఆర్" అన్నారట. కన్నడరాజకుమారు, మళయాళ ప్రేమనజీరూ తాము ఏవేవో అనాలని అనుకుంటున్నారట రాజకీయ పరంగా —

## దీర్ఘాయిష్షుకి చిట్కా!

కూర్చున్నవారి ఒళ్ళు గుల్ల బారిందనీ, చేసిన వారి ఒళ్ళు చేవ తేలిందనీ మనవారు మన భాషలో అంటే యిదేమాట రష్యను శాస్త్రజ్ఞులు వాళ్ళ భాషలో అన్నారు. చిరకాలం జీవించాలంటే శనగపప్పు నమిలినట్టు మాత్రలు, విటమిను మాత్రలూ నమలక్కర్లేదనీ, శరీరానికి మితాహారం, చక్కని వ్యాయామమే గాక, సోమరితనంగా వుండకుండా వుండడం కూడా అత్యవసరమని వారన్నారట. ఉరాల్ పర్వతాలకు చెందిన వోరెన్‌బర్గ్ ప్రాంతంలో వున్న వృద్ధులలో చాల మంది నూరు సంవత్సరాలకు పైబడ్డవారేనట. నిజ్నియో జెర్నియో అనే ఆమెకు 116ఏళ్ళునిండాయట. అయినా ఆమె ఆ ఇంట్లోని వారికి వంట తానే చేయడంగాక, తోటపనీ, కుట్టుపనీ కూడా చేస్తూంటుందట రోజూ. డాక్టరుతో నా కేమీ పనిలేకపోయినా, అయన పని వాయన అప్పుడప్పుడు వచ్చి నన్ను చూసి పోతూంటాడు. నేను ఎన్నడూ మందులు వాడనే లేదు అన్నదట—

## పశువుల దాణాగా ప్లేబాయ్ పత్రిక!

పాత పుస్తకాలు పశు ఆహారంగా ఉపయోగించి, యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన ఎగ్రికల్చరల్ డిపార్ట్‌మెంటు తలపంకించో నిర్ణయం తీసుకున్నదట. ఈ పాత న్యూసు పేపర్లలోనూ, పుస్తకాలలోనూ పశువులకు కావాల్సిన కార్బోహైడ్రేట్స్ దొరుకుతున్నాయని ఆ శాఖ అనుమానించిందట. తమాషా ఏమిటీ అంటే స్త్రీలబొమ్మలు నగ్నంగా వివిధ భంగిమలలో అచ్చువేసే ప్లేబోయ్ అనే మ్యాగజైనును పశువులు చాలాయిష్టంగా తింటున్నాయట. ఈ డిపార్టుమెంటుకు చెందిన డాక్టరు పాల్ యోగా అనే ఆయన యీ విషయాలుబయట పెట్టారట. శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి స్త్రీ సౌందర్యం ఫణిః అనందామా యిహ!

## అభినవ కర్ణుడు!

అజ్ఞాత అభినవ కర్ణుడొకనాడు తిరుమలేశునికి పదిన్నరలక్షలు సమర్పించాడట. ఈడబ్బు ముప్పయి చెక్కులుగా విరాళం క్రింద ఆ వ్యక్తి పంపినట్టు దేవస్థానం ప్రకటించిందట. బ్యాంకులో అడిగితే ఆతగాని పేరు వగైరా తెల్తుంది కదా! ☆



Hyderabad Asbestos brings to you Season's Greetings
on this festive occasion.
Leading architects and engineers recommend
CHARMINAR AC products for industry & agriculture for their
quality, durability and dependability.
Hyderabad Asbestos — in the nation's progress.




ASP/HACP/8118

**HYDERABAD ASBESTOS**

---

# Soneeka KONARK

## WASHING MACHINE MIXER/GRINDER




The only maintenance-free washing machine, in the market today.

"5 year's guarantee"

A tireless kitchen companion with proven capability. It's no exaggeration.

"Life time free service"




Marketed by :
**Arar Associates,**
5-4-187/6, Karbala Maidan Secunderabad 500 003.
Phone : 820411




**వి. ఆర్. ఎస్. ఆర్. — నెల్లూరు**

నాకు దగ్గర వస్తువులు బాగా కనిపిస్తాయి దూరంవస్తువులు అంటే ఒక పర్లాంగు దూరంలో. నిల్చున్న మనిషి ముఖం స్పష్టంగా కనిపించదు. నాకు ఎడమకన్ను మెల్లవున్నది. దూరం కన్పించాలంటే కళ్ళద్దాలు పెట్టకుండా నివారించటానికి ఏమైనా మార్గముందా? ఈ దృష్టిలోపం కారణంగా నాకు ఉద్యోగం ఇవ్వరు. దీనికి ఏమి చెయ్యాలి?

మీకు ఉన్నది 'మయోపియా'అనే కళ్ళజబ్బు. దీని నివారణకిగాను కళ్ళజోడు వాడటం అవసరం. కళ్ళజోడు పెట్టుకోవటం ఇష్టంలేనివారు కాన్‌టాక్టు లెన్సులు వాడవచ్చును.

దృష్టిలోపాన్ని సరిదిద్దుకొన్న వారికి ఉద్యోగం ఈ కారణంగా మాత్రమే ఇవ్వక పోవటం జరుగదు.

**ఆర్. వి. ఆర్. — మంచేరియాల్**

నావయస్సు 17 సంవత్సరములు. నేను వంగి ముఖము కడుక్కునేటప్పుడు, మెడను చేతితోకదుగుకొనునప్పుడు, కొద్దిగా నమిలి నప్పుడు నోటినుండి రక్తము కారుతున్నది. అదేమామూలుగా ఖాండ్రించి ఉమ్మివేసినప్పుడు ఉమ్మి తెల్లగానే వచ్చుచున్నది. దీనికి నివారణ ఏమిటి?

మీరు వెంటనే ఇ. ఎన్. టి. వైద్యులను సంప్రదించి గొంతులోని రక్తనాళాలలో ఏమైనా తేడా లున్నదీ లేనిదీ నిర్ధారించుకోవలసి వుంటుంది.

ప్రతినిత్యం విటమిన్ 'సి' 500 మి. గ్రా. ల మాత్రలు తీసుకోవడం అవసరం.

**జి. ఆర్. టి. — శ్రీహరికోట**

నాభార్యకు ప్రెగ్నెన్సీ అని తెలియక మొదట రెండు నెలలో జ్వరంవస్తే, నివాక్విన్, టెర్రామైసిన్, ఆంపిసిలిన్ కాల్‌పాల్ మొదలయిన మందులను డాక్టరుగారు వాడటం జరిగింది. ఇది మొదటి గర్భము. ఈ మందులు వాడటం వల్ల శిశువుకి హాని కలుగుతుందని భావిస్తున్నాము. గర్భం తీసివేయటం వల్ల తల్లికి హాని కలుగుతుందా? ఏదిచేస్తే మంచిది?

గర్భాన్ని తీసివేయటం కన్నా, పెరగనివ్వటమే మంచిదని నా అభిప్రాయం. గర్భంబాగా పెరిగిన తర్వాత తీసివేయటం వల్ల తల్లికి హాని కలిగే అవకాశం ఉంటుంది. ఈ సమాధానం అచ్చయ్యే సమయానికి డెలివరీ అయ్యే ఉంటుందేమో!




**బి. ఆర్. జి. — అన్నవరం**

నాకు సుమారు 4, 5 నెలల నుండి బొడ్డుల నుండి రసి వస్తోంది. విపరీతమైన వాసన వస్తోంది. నెప్పి ఏమీలేదు. దీనికి ఏమి చెయ్యమంటారు?

ఆ రసివంటి పదార్థాన్ని లేబరేటరీలో కల్చర్ - సెన్సిటివిటీ పరీక్ష చేయించి రిజల్టులో సూచింపబడిన ప్రకారం మందులు వాడాలి. అప్పటికీ తగ్గనప్పుడు సర్జన్లని సంప్రతించి అవసరం అంటే చిన్న శస్త్ర చికిత్స చేయించుకోవాలి.

**ఎం. ఎ. కె — భీమవరం**

నావయస్సు 20 సం.లు నాకు మూడు నెలల నుండి రోజు తెలుపు అవుతున్నది. ఇది వివాహ జీవితానికి నష్టం కలుగజేయునా? దీని వలన ప్రమాదముున్నదా? ఏమందులు వాడాలి?

తెలుపు అవటంవల్ల వివాహ జీవితానికి నష్టం లేదనే చెప్పాలి. కొంత వరకు తెలుపు అవటం ప్రతి స్త్రీకి సహజమనే చెప్పవలసి ఉంది. ఎక్కువగా వైట్ డిశ్చార్జి అవటానికి చాలా కారణాలున్నాయి. మొనిలియాసిస్ అనేది వీటిలో ముఖ్యమైనది. ఒక సూక్ష్మ క్రిమివల్ల ఈ రోగం ఏర్పడుతుంది. ఈ రోగం ఉన్నప్పుడు స్త్రీ—పురుషు లిరువురూ మైక్రో నిడజాల్ మాత్రలు వాడవలసి ఉంటుంది. అరుదుగా గొనోరియా రోగంవల్ల, మరీఅరుదుగా గర్భాశయపు గోడలలో ఫైబ్రాయిడ్ అనే కరువులు ఉన్నా తెలుపు అయ్యే అవకాశం ఉంటుంది. రోగాన్ని బట్టి చికిత్స చేయవలసి ఉంటుంది.

**కె ఎ ఆర్. — ఆకివీడు**

నావయస్సు 25 సం లు. ముగ్గురుపిల్లల తర్వాత (5 సం. ల క్రితం) ఆపరేషన్ చేయించుకున్నాను. నడుము నెప్పులు తరచు వస్తూఉంటాయి. ఇలా రావటానికి కారణం ఏమిటి? 2 సం లుగా "తెలుపు" అవుతున్నది. ఆపరేషన్ కీ దీనికీ సంబంధం ఉన్నదా?

ఆపరేషన్ చేయటానికీ నడుమునెప్పికీ సంబంధం లేదు. నడుమునెప్పి వెన్నెముక లోని కీళ్ళలో రాగల మార్పుల వల్ల గాని, నరాల బలహీనత వల్లగాని ఏర్పడే అవకాశం ఉంటుంది.

సెర్విక్స్ నుంచి వచ్చేవైట్ డిస్చార్జిని మైక్రోస్కోప్‌లో పరీక్ష చేయటం ద్వారా రోగనిర్ధారణ అవుతుంది. దానిని బట్టి మాత్రలు గాని మందులు గాని వాడవలసి ఉంటుంది. ఆపరేషన్‌కీ వైట్ డిస్చార్జికీ సంబంధం లేదనే చెప్పాలి

**ఎస్ . వి. ఆర్. — గన్నవరం**

నాకు 18 సంవత్సరములు. నాకు కుడివైపు టెస్టికల్స్ జారివది. ఎడమవైపుది జారలేదు. దీనికి మందులున్నాయా ? ఆపరేషన్ చేయించుకోవాలా ?

దీనిని అన్‌డిసెండెడ్ టెస్టిస్ అని అంటారు. అంటే ఎడమవైపు టెస్టిస్ కడుపులో ఏదో ఒక చోట ఉంటుందని అర్థం అవుతుంది. మందులతో దీనిని మామూలు స్థానానికి తీసుకు రావటం సాధ్యంకాదు. శస్త్రచికిత్స ద్వారా మాత్రమే సాధ్యం అవుతుంది. ★



# బాణాసంచా వయస్సెంత?

డా. బి.జి.వి. నరసింహారావు

విజ్ఞాన శాస్త్రరీత్యా, ఆరోగ్యదృష్ట్యా, సంస్కృతీ పరంగా ప్రతీ పండుగకు ఏదో పరమార్థం ఉంటుంది. పండుగలకు సంబంధించిన పురాణ గాథలు, సాంప్రదాయాలు ఎలా ఉన్నప్పటికి చూడ్డానికి, వినటానికి ఇంపుగా సొంపుగా ఉండి, అన్ని జాతులవారు ఆనందించే జాతీయ పండుగ దీపావళి అనటం అతిశయోక్తి కాదు. పూరి గుడిసె నుంచి పెద్ద బంగళా వరకూ ప్రతీది కోవెలలా, ప్రతీ వాకిలి కాంతి తోరణాలతో కళకళలాడుతు వయసుతో సంబంధం లేకుండా అందరిని ఆనంద పరచే సాంఘిక, వైజ్ఞానిక ప్రయోజనాలున్న పండుగ దీపావళి.

ఆశ్వయుజ, కార్తీక మాసాల జంటను మృత్యుదంష్ట్రలు అంటారు. ఆశ్వయుజ మాసాంతంలో వర్షాల జోరు తగ్గి చలికాలం ప్రారంభ



'కాంతి జల్లులు'

(ఫొటో: ఎ. వి. వి. నరసింగరావు.)

మవటంవలన వర్షాలవలన నిల్వ ఉన్న నీరు, మూలాన పనికిరాని పిచ్చిమొక్కలు విపరీతంగా పుట్టటం—అనేక క్రిమికీటకాలకు స్థావరాలవుతాయి. వీటివలన అంటువ్యాధులు సులువుగా వ్యాప్తి చెందటం, కొత్త రోగాలు సంక్రమించటం జరుగుతుంది. పండుగ పేరుతో ఇంటికి సున్నాల్లు వేయటం, బాణాసంచా కాల్చటంవలన వాటిలోనున్న ఎన్నో రకాల రసాయనాలు నుండి క్రిమికీటకాల సంహారిణులుగా పనిచేసే ఎన్నో విషవాయువులు వెలువడతాయి. ఈ పొగలవలన చాలా రకాల రోగకారక క్రిములు నశిస్తాయి. దీపావళి తరువాత నెలవరకు వెలిగించే కార్తీక దీపాలు కూడా క్రిమి సంహారిణులుగా పనిచేస్తాయి.

అతి ప్రాచీన ప్రేలుడు మిశ్రమమైన తుపాకి మందును చైనీయులు తయారుచేసినట్లు ఆధారాలున్నవి. బొగ్గు, గంధకం మరియు పొటాషియం నైట్రేటుల మిశ్రమమిది. మధ్యయుగం వరకు గవ్వలను, తారును, నూనెలను, గంధకాన్ని ప్రేలుడు మిశ్రమంగా వాడేవారని తెలుస్తుంది. క్రీ. శ. 13 శతాబ్దంలో మార్కస్ గ్రేసికస్ వ్రాసిన లైబర్ ఇగ్నియం (బుక్ ఆఫ్ ఫైర్స్ ఫర్ బర్నింగ్ ఎనిమీస్)ను బట్టి బాణాసంచా గూర్చిన విషయాలు

తయారుచేసింది 'రోగర్ బేకన్' అని 1242 లో వివరించబడింది. క్రీ. శ. 10 శతాబ్దంలో 'సంగ్' వంశీయుల సమయానికి చైనీయుల దగ్గర తుపాకి మందు ఫార్ములా ఉంది. ఈ ఫార్ములా మంగోలియనుల ద్వారా లేక అరబ్బుల ద్వారా యూరపునకు వెళ్లి ఉండవచ్చని భావిస్తున్నారు. కారణం సాల్ట్‌పీటర్‌కి వారుపయోగించిన పేరు "చైనా దేశపు మంచు" అని.

## బాణాసంచా ఎక్కడ పుట్టింది?

బాణాసంచాను తుపాకీ మందు ఫార్ములతో తయారు చేశారనటానికి సరైన ఆధారాలు లేవు 'వాంగ్ లింగ్'ను బట్టి చైనాలో క్రీ. శ. 10 శతాబ్దం నాటికి బాణాసంచా తయారు చేయబడిందని తెలుస్తుంది. క్రీ. శ. 969 లో తుపాకీ మందును విరివిగా యుద్ధంలో వాడినట్లు, క్రీ. శ 1103 లో ప్రజలను ఆనందపరచే బాణాసంచా తయారీలో వాడినట్లు ఆధారాలున్నవి. అయితే యూరపులో క్రీ. శ. 13 వ శతాబ్దంలో తుపాకి మందును వినియోగించినట్లు, క్రీ. శ. 16 శతాబ్దంలో బాణాసంచా తయారీలో వాడినట్లు లిఖితపూర్వకాధారాలున్నవి. ఫ్లోరెన్‌టైన్‌లు మరియు చైనీయులు బాణాసంచా పరిజ్ఞానాన్ని కొంతవరకు ఇటాలియన్‌ల నుంచి నేర్చుకొన్నారని కొంతమంది వాదన. చరిత్రకారుల కథనం ప్రకారం బాణాసంచా పుట్టుక భారతదేశంలోనేనని, ఇక్కడనుంచే తూర్పు దేశాలకు వ్యాపించిందని. అయితే సరైన సాక్ష్యాధారాలు లేవు. మొదటిసారిగా అధిక ఉత్పత్తి ఇటలీవారిదే. 17 వ శతాబ్దం నాటికి జర్మనీ, ఫ్రాన్సు, స్పెయిలు ఉత్పత్తిని ప్రారంభించాయి. 18 శతాబ్దం వరకు ఇటలీ తన ప్రత్యేకతను, ఆదిక్యతను నిలుపుకుంది. వారినుంచి ఆ స్థానం ఫ్రెంచివారు సంపాదించారు.

మన దేశంలో తమిళనాడులోని రామనాథపురం జిల్లా 'శివకాశి' మొత్తం దేశ ఉత్పత్తిలో 65 శాతం వరకు ఉత్పత్తి చేస్తుంది. మిగిలిన భాగంలో అధికంగా పశ్చిమ బెంగాలు తయారుచేస్తుంది 'బాణాసంచా'ను. అమెరికా దేశ ద్విశత వార్షికోత్సవ సందర్భంలో ఉత్సవానికి కావలసిన మందుగుండు

'అంధకారంలో కాంతి పుంజాలు'

(ఫొటో: ఎస్. తిరుమలరావు)





'బాణసంచా వెలుగులో పాప పరవశం'

(ఫొటో శ్రీ నగేష్)

సామానును సుమారు 5 మిలయన్ డాలర్ల విలువ చేసే బాణాసంచాను శివకాశి నుంచి దిగుమతి చేసుకొంది. దీనినిబట్టి బాణాసంచా నైపుణ్యంలో భారతదేశపు స్థానం వ్యక్తమవుతుంది

## దీపావళి దినాన ఏడుపులా?

బాణాసంచా అందరి పండుగగా పేరు పొందింది. సెయింట్ హెచ్. బ్రాక్స్ రచన అయిన 'బాణాసంచా చరిత్ర'లో బాణాసంచాను 'మేడే', మే సైకిల్, ఏప్రెల్ 23 న సెయింట్ జార్జి దినమున, నవంబరు 1న ఆల్ సెయింట్స్ డే; నవంబరు 2న ఆల్ సోల్స్ డే; నవంబరు 5న గైఫాక్స్ వార్షికోత్సవాలలోను; అక్టోబరు 31 వ తేదీన హాలోవీన్‌న ఎంతో ఆనందంతో బాణాసంచాను కాలుస్తారు. క్రిస్మస్ సందర్భంలో కూడా మందుగుండు కాల్చటం కొంతమంది ఆచారమయింది.

దీపావళికి ప్రత్యేకంగా ఆహ్వానింపబడిన అల్లుళ్ళతో, బావగారి ఆటపట్టించే చిలిపి మరదళ్ల కొంటె చేష్టలతో, తాతగారిని భయపెట్టే బుడుగు లాంటి పిల్లలతో కలకలలాడుతూ ఉండే దీపావళి పండుగ రోజున ధారూ జాతివారు ఇంటిల్లపాదీ భోరున ఏడుస్తారట రోజంతా. బర్టన్ స్మిత్ రచనను బట్టి ఈ తెగవారు ఆ సంవత్సరంలో చనిపోయిన బంధువు ఇంటిలో సమావేశమై వారి కులదేవతైన 'వృద్ధచోబ'ను అమావాస్యనాడు పూజించి సూర్యుడు అస్తమించే సమయానికి నది దగ్గరకు వెళ్లి చనిపోయినవారికి తర్పనాలు వొదిలి రావిచెట్టు క్రింద కూర్చొని అందరూ బిగ్గరగా ఏడుస్తారు. దీపావళినాటి రాత్రి ఇంట్లో దీపాలను వెలిగించక శోక నృత్యాన్ని చేస్తూ గడుపుతారు. కార్తీక శుద్ధ చవితినాడు తిరిగి వారంతా సమావేశమై సంతోషంతో ఉత్సవం చేసుకొంటారు. మరుచటి దీపావళి వరకు సంతోషంగానే కాలం గడుపుతారు ▲

(గత సంచిక తరువాయి)

పగటి ఎండకు అలసిపోయిన ప్రకృతి రాత్రి నిశ్శబ్దంగా విశ్రాంతి తీసుకుంటున్నది. విశాలంగ వున్న పడకగదిలో పెద్ద టేకు మంచంపై డన్‌లప్ పరుపుపై తనకు అటు ఇటుగా పడుకున్న భర్త రవిచంద్ర, కొడుకు ధీరజ్ తనను కావలించుకుని పడుకున్న విధం చూచి నవ్వుకుంది. ఆ చిరు దరహాసంలో ఆనందం, తృప్తి వున్నాయి.

ఆ తండ్రి, కొడుకుల అనుబంధం తమాషాగా వుంటుంది. తను దరిదాపుల్లో లేకున్నా, ఇద్దరు కలిసి బయటికి వెళ్ళినా ఒకరిపై ఒకరు ఎంతో ప్రేమను కురిపించుకుంటూ ఎంతో అభిమానంగా వుంటారు. ఒకే మాటమీద నిలబడతారు. కాని తను వారి మధ్య వుంటే మాత్రం— విరోధులై పోతారు. తగవులు పడుతారు. రవిచంద్ర చిన్న పిల్లాడిలా— ధీరజ్‌తో పోటీ పడుతాడు. కోపం చేసు కుంటాడు.

''చిన్నవాడితో మీకేమిటండీ'' అని లక్ష్మి అంటే ''ఆ పక్షపాతమే వద్దంటాను— కొడుకుమీద వున్న ప్రేమ భర్తమీద వుండదు మీ ఆడవాళ్ళకి— వాడికి రేపు పెళ్ళాం వస్తే— అమ్మ అల్లం అయి పోతుందని గుర్తు పెట్టుకో...''

''ఏరా నాన్నీ'' అన్నట్లుగా లక్ష్మి చూస్తే ధీరజ్ లక్ష్మి వీపు మీదుగా వాలి— మెడకు కౌగ లించుకుని ఆమె చెవిలో—

''డాడీనే అల్లం అంటాను'' లక్ష్మి కిలకిలా నవ్వింది.

''ఏమిటో నామీద చెప్పుకుంటున్నారు'' రవిచంద్ర వుడుకుమోతుతనానికి నవ్వుతూనే ఇద్దర్నీ ఫ్రెండ్స్‌గా సర్దుతుంది.

ధీరజ్ తప్పటడుగులు వేసేటప్పుడు ఫారెన్‌కి వెళ్ళిన రవిచంద్ర వాడు చిలకలా పలుకుతున్నప్పుడు వచ్చాడు.

అంతవరకు ప్రతి నిముషం తన దగ్గరే తనపని చేస్తూవున్న అమ్మ కొత్తగా వచ్చిన డాడీ దగ్గర వుంటూ అతని పని చేస్తూ అతని దగ్గర పడుకుంటూ — తనను వేరే గదిలో పడుకోబెట్టుతుంటేనే వాడి చిన్న హృదయం భగ్గుమంది. ఈర్ష్యతో మూలిగేవాడు. రవిచంద్ర వచ్చిన కొత్తలో అమ్మని తాకనిచ్చేవాడు కాదు. ''నాన్న — డాడీ !'' అని తనకు చెప్పతూ డాడీతో ఆప్యాయంగ కళ్ళల్లో ప్రేమను నింపుకుని మాట్లాడుతుంటే వాడి తెల్లని ముఖం కోపంతో కందిపోయేది.

తను బయటికి వెళ్ళితే డాడీ అమ్మ దగ్గిర పడుకుంటాడు. అమ్మతో నవ్వుతూంటాడని — అమ్మని వదలక అంటిపెట్టుకుని తిరిగేవాడు. ధీరజ్ బాగా నిద్ర పోయేటప్పుడే వారికి ఏకాంతం. అంత వరకు లక్ష్మిని ముద్దుకూడ పెట్టుకోడానికి లేదు. కోరిక కలిగినా — పెద్ద చుక్క పడమటి కొండ మీదకు వెళ్ళేదాక ఆగవలసిందే. మరో అవకాశం లేక రవిచంద్ర ఆరాటపడిపోయేవాడు. బాధగా భార్యవైపు చూసేవాడు. అందంగా వుంది.






పూరిస్తున్న లక్ష్మిని కొరకొర చూసేవాడు. అలిగి ఒక్కొక్కసారి భోజనం మానేసేవాడు.

మెల్లి మెల్లిగా ధీరజ్ నాన్న పరాయివాడు కాదు — వారిలో ఒకడు. అమ్మకు ఇష్టమైనవాడు. అని డాడీ ప్రేమను చవిచూస్తూ వచ్చాడు. వారిలో ఒక భాగం డాడీ అని గ్రహించాడు.

ఏదైనా కొత్త బొమ్మను తెచ్చి — ''అరే రాజా ! ఈ బొమ్మను తీసుకుని మీ అమ్మని నా కివ్వురా'' అంటాడు.

ఆ బొమ్మను తీసుకుని వెళ్ళి బయట ఆడి, ఆడి తిరిగివచ్చి —

''నీ బొమ్మ నీవు తీసుకో. మా అమ్మని నా కిచ్చేయి'' అంటూ లక్ష్మిమీద పడిపోతాడు ధీరజ్.

లక్ష్మిని, లక్ష్మిని అంటుకువున్న ధీరజ్‌ను పొదివి పట్టుకుని గిరగిర తిప్పుతూ — ఇద్దర్నీ గట్టిగా ముద్దు పెట్టుకుంటూ —

**జరిగిన కథ — 4 :** రవిచంద్ర 'రచన' వార మాస పత్రికలో మేనేజింగ్ ఎడిటర్‌గా పనిచేస్తుంటాడు. అతను ప్రముఖ రచయిత కూడా. ఫారిన్‌లో ఎం. బి. ఎ. చేసివచ్చినా అతనికున్న సాహిత్యాభిమానంతో ఈ పని చేస్తుంటాడు. అతను సాహిత్య ఇచ్చిన కవరులోని సారాంశం చదివి ఆశ్చర్యపోతాడు. తనకు పి.ఎ. గా చేరిన సాహిత్య టెంప్టేషన్ నుండి తప్పించుకో డానికి, రచయితలను ఇంటర్వ్యూ చేయడానికి ఆమెను పంపాలనుకుంటాడు రవిచంద్ర. కమలను తోడుగా తీసుకొని రచయితలు ఎక్కడ వుంటే అక్కడికి వెళ్ళి ఇంటర్వ్యూ చేసి రమ్మంటాడు సాహిత్యను రవిచంద్ర. వీళ్ళిద్దరికీ తోడుగా గోపీ కూడా వెళ్తాడు. అనుకోకుండా కలిసిన చిట్టారెడ్డిని ఇంటర్వ్యూ చేసి తమకు కావల్సిన సమాచారం రాబట్టుకొంటారు. తన అభిమాన రచయిత రవిచంద్రను ఎంతగానో ప్రేమించి ఆరాధిస్తున్న సాహిత్య అతనికి పెళ్ళయిందనీ, ఓ కొడుక్కి తండ్రి అనీ అతని ద్వారానే తెలుసుకొని విలపించిపోతుంది. రవిచంద్ర భార్య లక్ష్మి, కొడుకు ధీరజ్‌లతో సంసారాన్ని ఆనందం గానే సాగిస్తుంటాడు.

''మీరిద్దరూ — నాకున్న ఆస్తిరా'' అంటాడు

ఆ సమయంలో తనకు కావలసింది — కోర దగినది — ఏది వుండదు లక్ష్మికి. జీవితం పున్నమి వెన్నెల్లా, హాయిగా వున్నట్లనిపించింది. ఆ రోజు తమ మధ్యలో చేరి అటు ఇటు కాలుచాపి, దర్జాగా పడుకున్న ధీరజ్‌తో —

''ఏమీ దర్జా నాయనా ! ఇంకా ఎంతకాలం అమ్మ ప్రక్కలో పడుకుంటావ్? మగవాడివి—నీ గదిలో నీవు పడుకోవాలి. లక్ష్మి ! నీవు ముద్దుచేసి వీడ్ని చెడగొడుతున్నావ్. ఫారిన్‌లో ఇలా పెంచరు — పుట్టి నప్పటి నుంచి వాళ్ళని వేరేగ పడుకోబెట్టేస్తారు. ఓ మంచిరోజు చూచి వాడి గదిలోకి పంపేయి'' అన్నాడు.

'డాడీ, ముందు నీకే సిగ్గులేదు అన్ని బాడ్ హాబిట్స్. ఇంత పెద్దవాడివై — నేను పుట్టాకకూడా నీవు అమ్మ పక్కలో పడుకుంటావు ! అమ్మా ఈ రోజు మంచి రోజట ఏకాదశి—డాడీని గెస్టురూంలో పడుకోమను— ముద్దుచేసి స్పాయిల్ చేస్తున్నావ్'' అన్నాడు.

రవిచంద్ర కళ్ళు తేలేశాడు. అసలుకే మోసం వచ్చేలా వుంది. భగవాన్ ! అంటూ మరో మాట అనక కళ్ళు మూసుకున్నాడు. తల్లీ కొడుకు లు కడుపుబ్బా నవ్వుకున్నారు.

లక్ష్మి నవ్వుతూ— తనపై వున్న వారి చేతులను మెల్లగా విడదీసి— నిద్రలో ఏదో అంటూ రవిచంద్ర అటువైపుకు తిరిగి పడుకున్నాడు. మధ్యస్థలం చేసుకుని— పడుకుంది.

తలలోవున్న మల్లెల మాలను తీసింది. అవి పూర్తిగా విచ్చుకుని— గుభాళిస్తున్నవి. ముఖం దగ్గరగా పెట్టుకుని ఆఘ్రాణించి దిండు క్రింద పెట్టేసి— మరోసారి భగవంతుని స్మరించి కళ్ళు మూసుకుంది. వెంటనే నిద్రలోకి జారిపోయింది లక్ష్మి.

* * *

సూర్యుని లేత కిరణాల స్పర్శకి చెంగల్వ మొగ్గలు మెల్ల మెల్లగ విచ్చుకుంటున్నాయి. చంద్రుడ్ని చూడలేక — తారలు వెలుగనే ముసుగులో మరుగుపడిపోయాయి.

రాత్రి సేదతీరిన పగలు మేల్కొంది. దినచర్య ప్రారంభమయింది.

దిక్పాలకులు తమ తమ ఆయుధాలు ధరించి వాహనాలు ఎక్కి కర్తవ్యపాలనకు బయలుదేరినట్లు పొద్దు పైకెక్కేకొలది ప్రజలు వారి వారి పనుల్లో నిమగ్నమైపోయారు. రవిచంద్ర ఆఫీసుకు వెళ్ళేటప్పటికి ఓ సినిమా మనిషి ఎదురుచూస్తూ వున్నాడు.

రవిచంద్రను చూస్తూనే అతను లేచి ఆనందంగా రెండు చేతులు భుజంచుట్టూ వేసి ఛాతి దగ్గరకు లాక్కున్నాడు. ''రవిచంద్రగారు మీకెంతో ఋణపడివున్నాను'' అన్నాడు. అతను చేస్తున్నహడావుడికి, ఆనందానికి అతను తనకేవిధంగా ఋణపడివున్నాడో అర్థంకాలేదు.

''కళ్యాణ్ గారు ! ఏమిటి విశేషం'' అంటూ ఆ బాహుబంధాలనుండి తప్పించుకుని తన కుర్చీలో



కూర్చుంటూ అతనిని కూర్చోమని కుర్చీ చూపించాడు.

డిప్యూటీ ఎడిటర్, అసిస్టెంట్ ఎడిటర్ ఆ గదిలో చేరుకున్నాక కళ్యాణ్ సినీ ప్రొడ్యూసర్ పూలమాలను రవిచంద్ర మెడలో వేశాడు.

"రవిచంద్రగారూ! ప్రజల కోసం నేను తీసిన సినిమా ప్రజలు చూడలేదు. ఖర్చు కూడా రాదేమోనన్న సమయంలో మీరు వ్రాసిన సినిమా సమీక్షతో హాలు నిండిపోయింది. వందరోజులు కాకపోయినా, యాభై రోజులు ఆడుతుందన్న నమ్మకం వుంది. మీకు, మీ పత్రికకు ఎంతో ఋణపడివున్నాను" అంటూ చేతులు జోడించి, అతనిచ్చే విందు భోజనానికి రమ్మని హృదయపూర్వకముగా ఆఫీసు స్టాఫ్‌నంతా ఆహ్వానించాడు కళ్యాణ్.

రచయితకు, సమాజానికి ఎంతో సంబంధం వుంది. ఆ సంబంధాన్ని, కర్తవ్యాన్ని రచయిత గుర్తించినప్పుడు, రచయిత సరయిన రచనలు చేయగలుగుతాడు. సంఘంలో మనిషి పడే కష్టాలు, ఒక మనిషి వలన మరో మనిషికి కలిగే నష్టాలు, ప్రతి దానిలో మనిషిపడే ఘర్షణ – రచయిత గ్రహించినట్లు ఏ రాజకీయవేత్త, ఏ పరిపాలకుడు గ్రహించలేడు. ఆ సంఘర్షణ హృదయాలను చలింపజేసే విధంగా చిత్రించి తెలియచెప్పి లోపం ఎక్కడ అని ఆలోచింప చేయగలిగేది రచయితే! ప్రజల్లో చైతన్యం కలిగించకపోయినా, వారి ఆలోచనలోనయినా మార్పు తీసుకురాగలిగితే చాలు– అని అనుకున్న రవిచంద్రకి ఒక ఆలోచన తట్టింది. పాఠకులకు ఎలాంటి కథలు కావాలి! ఇంతవరకు వారికి నచ్చిన కథలు ఎన్నుకొని పాఠకుల ముందు వుంచారు. పాఠకుల అభిరుచి కనుక్కొని ఆ విధంగా కథలు తయారుచేస్తే బాగుంటుంది. ఆయా సబ్జెక్టును ఎన్నుకొని రచయితకు యిస్తే, ఆ సబ్జెక్టుమీద అతను కథను మలుచుతాడు అని ఆలోచించి డిప్యూటీ ఎడిటర్ కొరకు ఇంటర్‌కమ్ ఎత్తాడు.

"ఎస్ సార్!" అని సాహిత్య స్వరం కమ్మగా వినిపించింది.

తను వింటున్నది సాహిత్య స్వరమేనా అని అనుమానం వచ్చినట్లు –

"సాహిత్యా!" అన్నాడు.

"ఎస్!" అంది.

అప్రయత్నంగా రవిచంద్ర కన్నులు మూసుకున్నాడు. సాహిత్య రూపాన్ని కళ్లముందు వుంచుకుంటూ ఆ రాత్రి ఆబిడ్‌లో కారు ఆగగానే చప్పన దిగి, ఓ సందులోకి చెప్పకనే పరుగెత్తిపోయింది కారు ప్రక్కకి తీసి ఆపి, సాహిత్య వెళ్లినవైపు నడిచి వెళ్లాడు. మాయమైపోయినట్లు మరి కనిపించలేదు. ఇక కనుపించదనే అనుకున్నాడు. క్షేమంగా యింటికి చేరుతుందనే నమ్మకంతోనే వచ్చేసాడు.

"సార్!" ఆ పిలుపుకు తెప్పరిల్లి

"రాజారాంగారిని పంపించు. ఆ తర్వాత నీవు ఒకసారి రా" అని చెప్పాడు.

రాజారాంగారి సీటు వైపు చూచింది. సీటు ఖాళీ. సుదీర్ఘమైన నిట్టూర్పు వదిలి, రవిచంద్ర గదిలోకి అల్లన మెల్లన ప్రవేశించింది. సాహిత్యను చూడగానే హృదయం సందడిచేసింది. శరీరంలో ఎక్కడో చురుక్కుమన్న భావన సాహిత్య దర్శనంతో తనలో. తనకు తెలియకుండా కలిగే ఈ మార్పులే తనకు అప్రియంగ, భయంగా వుంటున్నాయి. సాహిత్య ఇక కనపడదు, తనపై కోపించి ఆఫీసుకు రాదు. అభిమానం వున్న ఏ ఆడపిల్ల తన ప్రేమ ఫలించకపోతే అసహ్యించుకుంటుంది. ఏవో వూహించుకుని అయిష్టాన్ని పెంచుకుంటుంది. కాని సాహిత్య ఎప్పటిలా, ఆఫీసుకు వస్తే సంతోషంగా వుంది. తన మూలంగా ఒక అమ్మాయి వుద్యోగం పోగొట్టుకోడం

సహించలేదు అందుకే సాహిత్య కనపడగానే తేలిక మనస్సుతో స్నేహపూర్వకంగా చూస్తూ సాహిత్య వచ్చి కూర్చున్నాక "ఐయాం సారీ. వెరీ సారీ." రాత్రి జరిగిన దానికి బాధ వ్యక్తం చేశాడు. దుఃఖాన్ని మింగుతున్నట్లు, గుటక వేస్తూ రవి చంద్రను చూసింది.

ఆఫీసుకు, రవిచంద్రకు శాశ్వతంగా గుడ్‌బై చెప్పేయాలనుకుంది. ఉద్యోగానికి రాజీనామా కూడా రాసింది. పంపాలనుకుంది. కాని రవిచంద్రను మరోసారి చూడాలనిపించింది. మనకేదయితే దక్కదో అదే కావాలనిపిస్తుంది. 'ఫర్‌బిడన్ ఫ్రూట్' అని తెలిసినా హవ్వ (ఈవ్) తినకుండా మానలేదు. రవి చంద్ర వివాహితుడు ప్రేమించినా, సొంతం చేసుకోలేడు అని తెలిసినా, రాకుండా వుండలేక పోయింది. తన మానసిక బలహీనతకు లోలోన ఏడుస్తూనే— ఫర్ బిడన్ ఫ్రూట్ తింటే చావు తప్పదని తెలిసినా రవిచంద్ర దగ్గరికి వచ్చింది.

"ఐ కాంట్ హెల్ప్ యిట్. ఐ లవ్ యూ. ఐ లవ్ యూ రవి" ఉద్వేగాన్ని అణుచుకుంటూ గుండె ఎగసెగసి పడుతుండగా, చిన్న చేతులు గుండెపై వుంచుకొని రహస్యం చెపుతున్నట్లు నేరుగా రవిచంద్ర కళ్లల్లోకి చూస్తూ అంది. సాహిత్య అందానికి, ఆ తీయని మాటలకు, ప్రేమకు కట్టుబడిపోయిన ట్లు సాహిత్యను కన్నులలో నింపుకున్నట్లు కళ్లార్పకు చూశాడు.

పూర్వ దిశాభాగంలో నిండు చంద్రుడిలా రవిచంద్ర— పశ్చిమాన పెద్ద చుక్కలా సాహిత్య ఒకరినొకరు వొళ్లంతాకళ్లు చేసుకొని చూసుకుంటూ వుండిపోయారు!

* * *

చంద్రుని కప్పిన తెల్లని మబ్బు తెరలా, తొలకరి జల్లులా, సాహిత్య సున్నితమైన ప్రేమ పాల ముంతలా, శరీరాన్ని ఆక్రమించింది. ఒకరి రహస్యం మరొకరికి తెలిసినట్లు, వారిద్దరిమధ్య నలిగిపోతున్న నీలిరాగంలో సన్నిహితమైన స్నేహం లాంటి ప్రేమ, చూపుల్లో అనురాగం, అప్రయత్నంగా తగిలిన స్పర్శలో— థ్రిల్, రవిచంద్రకు ఉల్లాసంగా వుత్సాహంగా రోజులు గడిచి పోతున్నాయి.

రవిచంద్ర ఆఫీసులోకి అడుగు పెడుతూనే సాహిత్య వైపు చూస్తాడు. ముఖం ప్రసన్నభావంతో

## రాగాగ్ని

నిండుకుంటుంది. ఆనందంగ తన గదిలోకి పోలేడు. ఇప్పుడెంత పని వున్నా భారంగా అనిపించుటలేదు. మునుపటికన్నా వుత్సాహంగా చకచక పని జరిగి పోతుంది. సరికొత్త శీర్షికలతో పత్రికలు మార్కెట్‌కి వెళ్లిపోతున్నాయి. పాఠకుల అభిరుచుల కనుగుణంగా వీక్లీని సరిదిద్దుతున్నాడు ఫీల్డ్ వర్కర్లను నియమించి పాఠకుల అభిప్రాయాలను సేకరిస్తున్నాడు. ఆయా వూర్లనుండి వచ్చిన రిపోర్ట్లను ముందు వుంచుకున్నాడు. ఎప్పటిలా ముఖ్యులందరూ సభ తీర్చారు. తెలుగులో వెలువడుతున్న పత్రికలను, నవలలను ఎక్కువగా చదువుతున్నది స్త్రీలు. పని పాట చేసుకుంటూ చదువుతున్న కథలు వారికి తేలిగ్గా, అరటిపండు వలచి నోట్లో అందించే విధంగా, సులభంగా వుండాలి. ఎక్కువ సమస్యలు తికమకలు పెట్టేవి కాకుండా, సంసారపక్షంగా ప్రేమ కథలు వారి నెక్కువ ఆకర్షిస్తాయని, ఇష్టమని అలాంటి కథలకే ప్రాముఖ్యం యిస్తున్నారని ఒకరు లేఖలో వ్రాసాడు.

పన్నెండు సంవత్సరాల నుంచి, ఇరవై సంవత్సరాల పిల్లలకు మిల్స్ అండ్ బూన్ నవలలు అంటే ప్రేమకథలు తప్పనిసరిగా అవసరం. ఆ వయస్సులో వాళ్లకి అవే కావాలి తక్కిన వాళ్లు 'ట్రాష్ చెత్త' అంటూనే ప్రేమకథలు చదువుతున్నారని, గ్రహించాము— అని ఒక లేఖలోని సారాంశం చదివి, సాహిత్య రవిచంద్రవైపు చూచింది.

'సెక్స్ నవలలు అందించినా నిరభ్యంతరంగా చదువుతాము' అని కాలేజీ విద్యార్థులు అంటున్నారంట. గోపి తన ముందు వేసుకున్న వుత్తరాలలో కాస్త వైవిధ్యంగా వ్రాసిన లేఖలు వేరుపరుస్తూ ఆ లేఖపైకి చదివాడు.

ఫీల్డ్ వర్కర్స్ నుంచి వచ్చిన సమాచారాలు కాక వుత్తరాలు పోగుచేసిన రాజారాం, తను వేరు చేసిన వుత్తరాలలో మంచిగా అనిపించిన వుత్తరాలు రవిచంద్రకు అందించాడు. కొందరికి సస్పెన్స్ థ్రిల్లర్స్ కావాలంటే, మరో కొందరు హర్రర్ స్టోరీస్ కావాలన్నారు.

సమాజంలో జరుగుతున్న అన్యాయాలను, తప్పులను, వరకట్నం లాంటి సమస్యలను తీసుకొని వ్రాస్తూ, వూరికే కథ చెప్పేయడం కాదు సమస్యలకు పరిష్కారం చూపాలి అప్పుడే రచనకి సార్థకత చేకూరుతుంది. మనవాళ్లు పక్కవీధిలో వుండే డాక్టరు దగ్గిరికి పోలేని స్థితిలో వున్నట్లు, వారి ఆరోగ్యపరంగా కావలసిన సమస్యలనూ, పత్రికలకే వ్రాస్తున్నారు. అంటే పత్రికలతో ఎంత సన్నిహిత సంబంధం— వాటిపై ఎంతగా ఆధారపడి వున్నారో తెలుస్తూనే వుంది కనుక—కేవలం ప్రేమ కథలకే ప్రాముఖ్యత యివ్వక, పాఠకులను ఆలోచింప చేసి చైతన్యం కలిగించేలా వుండాలి రచనలు అలా అని బుర్ర వేడెక్కించే విధంగా కాక, కథలో జొప్పించి అందంగా చెప్పాలి

అన్యాయాలను ఎదుర్కొంటున్నట్లు ఎదుటి వాడిని పొడిచినట్లు చూపించినా పాఠకుడి ఆలోచనలు ఆ విధంగా నడుస్తాయి. పిచ్చి పరిష్కారాలతో పాఠకులను పెడత్రోవను నడిపించకూడదు. అవి భయంగొలిపే కథలు— ప్రేతాలు— భూతాలు గురించి వ్రాస్తే భయం భయంగ అదో భావనతో చదువుతున్నంతసేపు బాగానే వుంటుంది— కాని కాస్త పిరికి వాళ్ల తర్వాత తమ నీడను చూచుకుని భయపడగలరు. ఆ ఫీలింగ్ బాగోదు — కమ్మని నిద్రకు దూరమవుతారు నవల్లా వస్తే ఇష్టమున్నవాళ్లు ఇష్టమైన సాః చదువుకుంటారుగాని — పత్రికలలో వచ్చే సీరియల్స్ చిన్నా, పెద్దా అందరూ చదువుతారు. అందరికి అందుబాటులో వుంటుంది కనుక — విజ్ఞాన పరంగానూ వినోదంగానూ వ్యక్తిత్వం ఇచ్చేదిగానూ — సమస్యలకు సరైన పరిష్కారాలు చూపుతూ బోధనాత్మకంగాను, మనిషిలో బలహీనత పోగొట్టే — ధైర్యమూ, వ్యక్తిత్వం — అందించాలని ప్రార్థన అంటూ వాళ్ల వూరి వారి తరపున కొందరు విద్యార్థులు కలిసి సంతకంచేసి వ్రాశారు.

ఆ రోజు చర్చించిన సారాంశం మార్కెట్టులో ఏ రకం పుస్తకాలకి గిరాకి వుంది, మార్కెట్ పలుకుతుంది? లైబ్రరీకి వచ్చే జనం ఎలాటి నవలలు చదువుతున్నారు — అని చర్చించగా తేలిన విషయం, అందరూ లవ్ స్టోరీస్‌కే ఎక్కువ ఓట్లు వేసారు. కనుక పత్రిక కుంటుపడక నడవాలంటే తప్పక ఒక లవ్ స్టోరీ వుండాల్సిందేనని తేలింది. ఎన్నో రకాల పాఠకులు వున్నారు కనుక, వెరైటీగా






# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."

**నైసిల్**
**ఉపయోగించండి**
**అతి శీఘ్రంగా**
**ఉపశమనమునిచ్చే**
**చెమటకాయల పౌడర్.**






2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'

## నైసిల్ తెచ్చుకోండి
## చెమటకాయల బాధ మరిచిపోండి.



ప్రత్యేకమైన ఔషధ యుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి స్థితిలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మజీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

CASGLN-4-203 TEL

సబ్‌జెక్ట్సు వున్న నవలలు కూడా ప్రచురించాలని తీర్మానించుకున్నారు. సభ ముగిసింది. చిన్న టీపార్టీ అనంతరం ఆ రోజుకి చూపులతో వీడ్కోలు తీసుకున్నారు సాహిత్య— రవిచంద్రలు.

ఇంటికి వస్తూ దారిలో ఓ సినిమా హాలు జనంతో నిండిపోవడం చూశాడు. లోపల ఎంతమంది వున్నారో బయట అంతమంది వున్నారు. ఆ సినిమాలో ఏమిటి వారిని అంతగ ఆకర్షించినది? కొత్తగా— ఏదైనా చూపుతున్నారా అనుకుంటే అదీ లేదు. ఆ సినిమాలో హీరోయిన్‌ను నగ్నంగా చూపుతారు. అంతే! జనం విరగబడి చూస్తున్నారు. హీరోయిన్లో— కచకుచ కుటి సీమలు చూపించి జనాన్ని దోచేస్తున్నారు—మరి. చనుదోయి దర్శనానికే వెర్రెత్తిపోతున్నారు ప్రజలు. ప్రశ్నార్థకంగా రవిచంద్ర భృకుటి ముడి పడింది. సెక్స్ నవల— మరీ నగ్నంగా కాకుండా— పురిపార చీరకట్టి కనీ కనుపించనట్లు సున్నితంగ సెక్స్— మరో వైపు తాగుడు, వ్యభిచారం మనిషిని ఎలా పతనం చేస్తున్నాయో చెప్తితే, సాంఘిక ప్రయోజనంతో ఇదొక ప్రయోగం. సెక్స్ వుంది కనుక జనం విరగబడి చదువుతారు— అని తలుస్తూ నవలకు ప్లాటు దొరికినందుకు పులకిస్తూ జోరుగా కారును పోనిచ్చాడు.

సూర్యాస్తమయానికి ఇంటికి చేరుకోవడం అలవాటు. పనుల్లో అటు ఇటు అయినా—తొమ్మిది గంటలకంటే ఎక్కువసేపు ఎప్పుడూ బయట వుండలేడు

రవిచంద్రకు పగలు పనిలో శ్రమ తెలియకుండా సాహిత్య సమీపంలో ఆ దినం నిముషాల్లో గడిపేస్తాడు. తీయని తలపుల్లో తేలియాడుతూ, మనసంతా వుల్లాసం, వళ్లంతా శృంగారంతో నింపుకుని ఇంటికి చేరుకుంటాడు. ప్రియమైన భార్య సందిట్లో చేరి, అందమైన భార్యతో కోరిక తీర్చుకుంటాడు. మనస్సంతా సాహిత్య నింపేస్తే, శరీరాన్ని లక్ష్మి సుఖపెట్టేస్తే తృప్తిగా కంటి నిండుగా నిద్రపోతాడు రవిచంద్ర.

(ఇంకా వుంది)

# కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలాబిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనా కిరావారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

— సం॥

# వారఫలం

26–11–1982 శుక్రవారం ముదలు
2–12–1982 గురువారం వరకు

♈ **మేషం:** ధనలబ్ధికి లోటు రాకుండటం, వ్యాపారంలో అనుకూలత చేకూరుటకు, ముఖ్య మిత్రులనో, అధికారులనో కలిసికొనుటకు, నూతన వ్యవహారాలలో జోక్యం కలుగజేసికొనుటకు అవకాశంగల వారం. **స్త్రీలకు:** నూతనోద్యోగ ప్రాప్తి కొందరకు నగల సేకరణ కొందరకు చెప్పవచ్చు.

♉ **వృషభం** ధనం పరుల చేతికి పోయి చాలా కాలమైనది గదా! అది మరలా హస్తగతం చేసికోవటం కష్టమే. వెరసి నిండుగా అవసరాలకు తీరేమాత్రం ఆదాయ మున్నది. ఉద్యోగంలో 'ప్రమోషన్' ఆశించిన వారికి అనుకూలం **స్త్రీలకు:** సుఖశాంతులు, బంధువులతో గోష్ఠి, శుభ కార్య ప్రస్తావన లుండగలవు.

♊ **మిథునం** ఆదాయ మున్నది వ్యాపారంలో సర్వానుకూలత చేకూరగల సమయం. సటమందిలో పేరుప్రతిష్ఠలు రానున్నవి. నిజాయితీ రుజువు కాగలుగుట, ఉద్యోగంలో పై అంతస్థుకు చేరే విధానం కనిపించుట గమనించగలరు. **స్త్రీలకు:** వస్తువులు పోగొట్టుకొనుట, ఉద్యోగం చేసే వారైతే, కొంత ఇబ్బంది జరుగగలవారం.

♋ **కర్కాటకం** అయినవారి సంబంధం కోసమై ప్రాకులాట, మిత్ర సహాయం లభించక పోవటం, దాయాదుల మూలంగా ఇబ్బందులు కోర్టు కచేరీ. వ్యవహారాలలో అనానుకూలత చెప్పదగిన అంశాలు. వ్యాపారంలో మాత్రం ఇబ్బంది రాదని చెప్పదగిన వారం **స్త్రీలకు:** కళా రంగంలో సభా కార్యక్రమంలో మేలు సమకూడుతుంది.

♌ **సింహం** మిత్రుల వలన మేలు పొందగలరు. చాలకాలంగా రాని వర్తమానం అందటం వలన కొంత మనశ్శాంతి ఏర్పడే అవకాశమున్నది. బంధు వర్గీయులు సమయానికి ఏదో ఒకరీతి ఆదుకొననున్నారు. **స్త్రీలకు.** ఆనందానికి వినోదాలకు, నూతన వస్త్ర సేకరణకు అవకాశం ఉన్నది.

♍ **కన్య:** వస్తువులు ఏవో పోగొట్టు కొననున్నారు. ప్రయాణాల్లో ప్రమాదం సంభవించె మార్గమున్నది. అవసరాలకు సరిపోయేటంత డబ్బు అయినా చేతి కందుతుంది. కొందరకు దూర ప్రయాణమో ఒకవేళ విదేశ ప్రయాణమో చెప్పవచ్చు.

లభించగలవు. ఆర్థికంగా బాగుండే వారమే.

♎ **తుల** ప్రతిభ రాణించుటకు ఖర్చులకు తగినంత డబ్బు అందుటకు, నూతన వస్తు సేకరణకు, బంధువుల కొరకు వెచ్చించ తగిన ధనం చేతి కందటం, మీకు ఈ వారం ప్రత్యేక లక్షణం. **స్త్రీలకు:** ఉద్యోగంలో నూతన నావకాశాలు లభించటం వస్త్ర సేకరణకు లాభదాయకమైన వారం.

♏ **వృశ్చికం:** అదాయం గల సమయం అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలు సుకరంగా జరిగి పోతాయి నూతన మిత్రులు చేరుటకు, ఉద్యోగంలో మంచి అవకాశాలు లభించుటకు అనువైన వారం **స్త్రీలకు:** ఉద్యోగం చేసేవారైతే, అనుకొన్నంత కంటె ఎక్కువ మేలు జరుగనున్నది.

♐ **ధనుస్సు:** అయినవారి సంబంధం చేసికోవాలని, సంతానం కొరకు పాటు బడాలని మీరు చేసే ప్రయత్నాలు సఫలంతం కానున్నవి ఇతరుల వద్దనుండ రావలసిన ధనం సమయానికి చేతికి అందనున్నది. **స్త్రీలకు:** అధికంగా ఆదరణ. సభా మర్యాదలు అవకాశం గలవారం.

♑ **మకరం:** రాజకీయంగా మీకు మేలు చేకూరుతుంది. ప్రత్యర్థులతో విరోధాలు, ఇబ్బందులు రావటానికి, వ్యాపార నిమిత్తం దూర దేశాలకు ప్రయాణించుటకు అవకాశం గలవారం. **స్త్రీలకు:** అనుకొన్న దానికన్నా లబ్ధి, ఆరోగ్య భాగ్యం, సంతానం మూలంగా ఆనందం కలుగనున్న వారమే.

♒ **కుంభం** భారీ వ్యాపార మయితే హాయిగా సాగిపోతుంది. జాయింటు వ్యాపార మయితే, మీ యభిప్రాయానికి అనుగుణంగా సాగిపోతుంది. మీ ప్రతిభ రాణించే అవకాశం లేకపోలేదు. **స్త్రీలకు:** బంధువుల నుండి శుభ వర్తమానం అందటం, తెలివితేటలు రాణించటం, స్వల్పంగా ధనం లభించటం మొదలగు అంశాలు చెప్పదగిన అంశాలు

♓ **మీనం:** దూరదేశాలకు ప్రయాణించుట కొందరకు, నూతన విషయాలు గ్రహించుట కొందరకు, అమూల్య వస్తు సేకరణ కొందరకు చెప్పదగిన అంశాలు. ఆరోగ్య లోపం కనిపించదు. స్త్రీలకు ఉద్యోగం కొరకు గాని వస్తు సేకరణకు గాని ప్రయత్నించే




## ప్రొఫెసర్ ఆనందరావు నిద్రలేస్తూనే సిగరెట్ అంటించి మంచం మీదే ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు.

**ఇవేళ ఆదివారం.... పట్టాభిని కలవాలి.... ఏమైనా కలవాలి.**

**తను విశాఖ వచ్చి రెణ్ణెల్లయింది అసలు తనిక్కడికి వస్తూనే పట్టాభిని కలవాలనుకున్నాడు. అలాంటిది, రెణ్ణెల్లయినా కలవలేక పోయాడు.**

పట్టాభీ, తనూ కాలేజీలో చదువుకొనేటప్పుడు, ఒకే ఊళ్ళో ఉంటే, ఒకరినొకరు ఒక గంటన్నా విడిచి వుండేవారు కాదు.... ఇప్పుడు రెణ్ణెల్లు!

దూరాన్ని మైళ్ళతోనే కాదు కాలంతో కూడా కొలవచ్చన్న మాట!

నవ్వుకున్నాడు ఆనందరావు

లేచి పాత డైరీల కట్ట తిరగేసాడు. అయిదేళ్ళ క్రితం పట్టాభి బంధు వొకతను ఇచ్చిన ఎడ్రసు దొరికింది దానిని వేరే కాగితంమీద వ్రాసుకున్నాడు గబగబ స్నానం చేసి, బట్టలేసుకొని ఎవరో తరుముతున్నట్లు బైటపడ్డాడు.

'టిఫిన్ తయారయిపోయింది, తిని వెళ్ళండి' అంటున్న భార్య కేక వినిపించుకో లేదు ఆనందరావు.

పట్టాభిని చూడబోతున్నాడు తను ఆనందమో, బాధో తెలియని స్థితి ఆవహించిం దతన్ని

గతస్మృతులు నెమరువేస్తూ బస్ స్టేజి వైపు నడుస్తున్నాడు

పట్టాభి!. ఇరవై ఏళ్ళ క్రిందటి జ్ఞాపకాలను మోసుకొస్తుందా పేరు. ఆ జ్ఞాపకాలే చాలాకాలం వరకూ తనకు ఉత్తేజాన్నిచ్చేవి మైమరపించేవి. రాను రాను పాత సినిమాలా వెల వెల బోతున్నాయి ఎందుకనో జీవితంలో స్పందన లోపించింది అప్పట్లో ఏ చిన్న సంఘటనకైనా కదిలి పోయేది హృదయం. ఏ కొంచెం పరిచయ మైనా దానిచుట్టూ మమతల పందిళ్ళు అల్లేది.

ఉద్రేకమే ఊపిరిగా జీవించారు తనూ, పట్టాభీ తమిద్దరికీ సోషలిస్టు భావాలుండేవి. తమవద్ద నిషేధ సాహిత్యం కూడా ఉండేది తమకెంతో గర్వంగా ఉండేది పట్టాభి మాత్రం పూర్తిగా ఉద్యమాని కంకితమై పోయినట్లు ఉండేవాడు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ, గంభీరంగా మౌనిలా ఉండే వాడు. చదువు పట్టించుకొనేవాడు కాదు. తనకు చదువుమీద, భవిష్యత్తుమీద ఆశ ఉండేది. అప్పుడప్పుడు పట్టాభి ఏమైపోతాడో అనుకొని ఆందోళన పడేవాడు తను

# టాప్ స్టార్ ఉన్న కప్పు ఏది ?



## చూడండి, ఇక్కడ చిక్కని, కమ్మని టీ ఉన్నది

### చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం

చిక్కదనపు పరీక్ష...చేసి చూడండి...టాప్‌స్టార్ అన్నిటికన్నా మెరుగు...మరే ఇతర టీకన్నా చిక్కనిది — చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్.

ఎందుకంటే, ప్రత్యేకమైన భారతీయ తేయాకుల తాలూకు ఘాటైన (స్ట్రాంగ్) సమ్మేళనం నుంచి తయారైంది లిప్టన్ టాప్‌స్టార్... సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ కోరుకునే వారి కోసం!

500 గ్రా., 250 గ్రా., 100 గ్రా.లలో దొరుకుతుంది.

# లిప్టన్ టాప్ స్టార్ టీ




**చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్**

LINTAS-LTS. 8-2315 TL.

పట్టాభి డిగ్రీతో చదువు మానేసి వాళ్ల ఊరు వెళ్లిపోయాడు. తను యూనివర్సిటీకి అంకితమైపోయాడు. కొంతకాలం ఉత్తరాలు రాసుకున్నారు. క్రమక్రమంగా అవీ తగ్గిపోయాయి.

తను భయపడినట్లు పట్టాభి భవిష్యత్తు తల్లక్రిందులవలేదు. కాంట్రాక్టులు చేస్తూ బాగానే డబ్బు సంపాదిస్తున్నట్లు విన్నాడు.

చదువుకొనే రోజుల్లో తమ అనుబంధం ఈ జన్మకే కాదు... జన్మ జన్మలకూ కొనసాగుతుందని ఓ పిచ్చి నమ్మకం ఉండేది. అలాంటిది ఎంత సులువుగా మాయమైపోయింది!

మనిషి 'జీవితం' అన్న అదృశ్య శక్తి చేతిలో కీలుబొమ్మ!

వేదాంతిలా నవ్వుకున్నాడు ఆనందరావు, సిగరెట్ అంటిస్తూ.

బస్ ఖాళీగానేవుంది. ఎక్కి కూర్చున్నాడు.

తర్వాతి స్టేజిలో జనం బిలబిల్లాడుతూ త్రోసుకుంటూ ఎక్కేసారు. చూస్తుండగానే బస్ నిండిపోయింది.

'ఒరే... ఆనందూ!' ఆ గావుకేకకు ఆనందరావే కాదు, బస్సులో జనం అంతా ఉలిక్కిపడ్డారు.

విజేతలా జనాన్ని రెండు చేతులతో తలో వైపు నెట్టివేస్తూ కంగారు కంగారుగా ఒక భారీ ఆకారం ఆనందరావుని సమీపిస్తోంది. 'అతను గోపాలుడు, హైస్కూలులో తన క్లాస్‌మేటు' అన్న సంగతి స్ఫురించే లోపునే ఆ ఆకారం దగ్గరకొచ్చేసి అమాంతం చెయ్యి పట్టుకొని ఊపేస్తూ...

'ఏరా... గుర్తొచ్చానా?...గుర్తొచ్చానా?' అని గద్దించి అడుగుతూ, అతను సమాధానం చెప్పే లోపునే ప్రక్కకి త్రోసేసి చోటు చేసుకుంటూ... 'ఎందుకు గుర్తుంటాంలేరా? ఎందుకు గుర్తుంటాం?' అంటూ భయంకరంగా నవ్వేసింది.

ఆనందరావు తెప్పరిల్లి చిరునవ్వుతో, 'నువ్వు... గోపాలుడివి కదూ!...' అన్నాడు.

'ఒరేయ్... ఒరేయ్...' భుజం మీద బలంగా చరిచాడతను. 'నువ్వు ప్రొఫెసరువైనా బుర్ర బాగానే పనిచేస్తోంది.' మళ్లీ నవ్వందుకున్నాడు.

'ఆఁ. సరే... పిల్ల లెంత మందిరా? అన్నట్లు నా కయిదుగురు అమ్మాయిల్రోయ్. పెద్దదాని కీమధ్యే పెళ్లి చేసాను. పెళ్లంటే గుర్తొచ్చింది— బాబ్బాబు, నీ కబ్బాయి లెంత మందో చెప్పరా... ముందిది విను. అల్లుడు అంతగా చదువుకోకపోయినా అతని వాటాకి పదిహేనెకరాలుంది. ఏదో గడిచిపోతుందనుకో. రెండోది టెన్తు... మూడోది నైన్తు... మా నాలుగోదాన్ని మా ఊరిప్రక్క వూళ్లో హైస్కూలులో చేర్చాను. మనూళ్లో యూపీ స్కూలు కొత్తగా వచ్చిందిలే. చదువు బాగుండి చావదని... అన్నట్లొరే, మన రామంలేడూ... తాటిచెట్టులా ఎస్సెల్సీలో కూడా నిక్కర్లేసే వాడూ... అదేరా నీ సైకిలు తెగ వాడుకొనే వాడూ... వాడు మా ఊరు ప్రక్క ఊళ్లో హైస్కూలులో తెలుగు పండిట్‌గా చేస్తున్నాడు... నే చూస్తుంటానులే, నీ కూతుర్నిక్కడ చేర్చవోయ్, అన్నాడు... అయిందా— ఇక అయిదోది.. '

'నువ్వేం చేస్తున్నావో చెబుదూ...'చికాకు ధ్వనిస్తూ నవ్వుతూ అడిగాడు ఆనందరావు.

'మరిచా చెప్పడం...నేను మూడు మేనేజి చేస్తున్నాను. హోమియో, కరిణీకం, వ్యవసాయం. ఏదో గడుస్తుందనుకో... ఇంకా నలుగురికి పెళ్లి చేయ్యాలా బాబూ...' బస్సులోంచి అవతలికి తొంగిచూసి 'అప్పుడే జగదంబా వచ్చేసిందే! తరువాతి స్టేజి నేను దిగాల్సింది. అన్నట్లు నేనిక్కడికి ఎందుకొచ్చానో తెలుసా? ఇక్కడ మా తోడల్లుడున్నాడు. అతనికి ఏక్సిడెంటయితే హాస్పటల్లో చేర్చారు. చూడ్డానికొచ్చాను. ఫర్లేదులే ప్రాణభయం లేదు...' కాసేపు ఆగి, ఏదో గుర్తొచ్చినట్లు... 'ఇంత సేపూ నేనే వాగేసాను. ఒరే ఆనందూ... నీ గురించి చెప్పరా...' బతిమాలుతున్నట్లు అన్నాడు.

'ఏముంది చెప్పడానికి?' నవ్వుతూనే తేల్చేసాడు ఆనందరావు.

'అవున్లేరా... నా కెందుకు చెబుతావు? పెద్ద ప్రొఫెసర్‌వి. అదిగో నే దిగాల్సిన స్టేజి... మరచిపోకే... వస్తానే...' మరోసారి చేతులు పట్టుకొని కుదిపేస్తూ, పరుగెత్తుతున్నట్లు నడిచి దిగి పోయాడు గోపాలం.

ఆనందరావు నవ్వుకుంటూ సిగరెట్ అంటించాడు.

తను దిగవలసిన స్టేజి రాగానే బస్సు దిగి ఒకసారి చుట్టూ పరికించి చూశాడు ఆనందరావు. ఈ మధ్యనే డెవలెప్ అయిన కాలనీ కావడంతో రోడ్లు విశాలంగా, అందంగా ఉన్నాయి. మామూలు ఇల్లు మచ్చుకైనా కనబడ్డంలేదు. అన్నీ ఖరీదైన మేడలే.

పట్టాభి అంతస్థుని మనసులోనే ఊహించుకుంటూ అడ్రసు కాగితం ఓసారి చూచుకొని ముందుకి నడిచాడు.

నడుస్తున్నవాడు ఒకచోట ఆగిపోయాడు 'అవును... అదే నెంబరు...' ప్రక్కనే పి. పట్టాభిరామారావు అన్న నేమ్ బోర్డు తళతళ మెరుస్తోంది.

ఆనందరావుకి ఉన్నట్లుండి గుండె వేగంగా కొట్టుకోసాగింది. పట్టాభి జ్ఞాపకాలు హఠాత్తుగా మేలుకొని రణగొణ ధ్వనిలాంటి సంగీతాన్ని ఆలపించాయి మనస్సులో.

అది ఒక రెండంతస్థుల మేడ. చాలా ఆధునిక పద్ధతిలో కట్టబడింది. ఎదురుగా పెద్ద పూలతోట ఉంది. ఆ చుట్టుప్రక్కల మేడల్లో అదే ఆకర్షణీయంగా ఉంది.

'ఇంత అందమైన మేడకు పట్టాభి యజమాని!' అనుకున్నాడు. అది అభినందనో, గర్వమో, అసూయో అర్థం కాలేదు, తనకే.

నెమ్మదిగా గేటుతీసి లోపలికి నడిచాడు.

లోపల గవర్నమెంటు జీపు కనబడింది. ఆనందరావు కొంచెం సందేహిస్తూనే ముందుకు నడిచాడు. దగ్గరగా మాటలు వినబడుతున్నాయి. ధోరణిని బట్టి ఏదో చర్చించుకుంటున్నట్లు కనబడుతోంది. ఆనందరావు

## మళ్లీ దీపావళి

వచ్చింది దీపావళొచ్చింది మరల
తొలగించగా మదిని నెలవైన ఇరుల
తెచ్చింది వెలుతురే తోరణాలల్లి
తెచ్చింది నవకాంతి సిరులపై జల్లి
నవరాగ గీతాల గళము విరుపించ
సమభావ తేజాల జనము వినుతించ
చీకటింటికి ముందు చిరుదీపముంచి
చెలిమి వెలుగును కంటి విందుగా పంచి
ఎదఎదను మానవత ప్రమిదగా మలచి
మమతయే తొలి వెలుగు దీపమై నిలిచి
చిరువంత తొలగించి చిగురించ శాంతి
మనసులో మెదిలింది పాలపుంతల కాంతి
వచ్చింది దీపావళొచ్చింది మరల
తొలగించగా మదిని నెలవైన ఇరుల.

—"సౌంద్యశ్రీ"

# "కేర్‌ఫ్రీ రక్షణ —దానిలా మరొకటి లేదిక!"



మిమ్మల్ని దృష్టిలో పెట్టుకుని తయారుచేసారు కేర్‌ఫ్రీ. ఇబ్బందైన ఆ 5 రోజుల్లో ఆధునిక యువతికి కావలసిన శుభ్రతతో కూడిన ఆ సంరక్షణని యిస్తుంది.

మీకు అధిక రక్షణ యివ్వడానికి దీనిలో మరింతగా పీల్చుకునే గుణం.

కేర్‌ఫ్రీ శాస్త్రీయంగా రూపొందించబడినది. దీని లోపల భాగంలో గల మెత్తని పొరలు, ప్రత్యేకమైన రీతిలో పీల్చుకోగలిగే పదార్థంతో చేయబడ్డాయి. కేర్‌ఫ్రీ మీకు యిప్పటి దాకా వాడిన వాటి అన్నిటి కన్నా చెమ్మను నిలుపుకోగలుగుతూ, మీకు మరింతగా రక్షణని యిస్తుంది. అయినా యిది ఎంతో సన్నగా, సున్నితంగా, యిమడికగా ఉంటుంది.

అద్వితీయమైన దీనికిగల ప్లాస్టిక్ కవచం మరకలు పడటాన్ని నిరోధిస్తుంది.

కేవలం కేర్‌ఫ్రీలోనే, క్రింది భాగం చుట్టూరా, నేప్‌కిన్‌కి



రెండు వైపులా గల 3- వైపుల గల నీలి ప్లాస్టిక్ కవచం మధ్యన అడ్డుగా నిలవడం కోసం ఉంది. అందుకే యిది తడిసి పోతుందని గాని, మరకలు పడుతుందని గాని భయం లేదు.

ఎంతో సౌకర్యం. మరెంతో వీలు.

కేర్‌ఫ్రీ మీకు పూర్తిగా సౌకర్యాన్నిస్తుంది. దీన్ని వాడటం, పారెయ్యడం ఎంతో తేలిక...దీన్ని ఫ్లష్ చేసెయ్యండి, అంతే. మార్చుకోవడం కూడా వీలు. మీరెప్పుడు మార్చవలసివచ్చినా మీకెంతో సౌకర్యం.

అవును కేర్‌ఫ్రీతో మీరెంతో భద్రంగా, ఎంతో సౌకర్యంగా ఉంటారిక, అసలు నెలలో అది ఏ రోజూ అనే ధ్యాసే ఉండరు. మీరిక ఏం చెయ్యదలుచుకున్నా చేఫికరుగా చేయగలరు మరి...ఎందుకంటే మరేదీ యివ్వలేని రక్షణను యిస్తుంది కేర్‌ఫ్రీ!

ఇది 10 మరియు 20 నేప్‌కిన్స్ ప్యాక్‌లలో దొరుకుతుంది.




Johnson & Johnson*



## కేర్‌ఫ్రీ* — కాలం మారుతున్నయీ రోజుల్లో పూర్తి రక్షణ.

వెనుదిరగి వెళ్ళిపోదామనుకొనేలోపునే అతను హాలు గుమ్మం దగ్గరకు చేరాడు.

ఎదురుగా రివ్వాల్వింగ్ ఛైర్‌లో గెడ్డం క్రింద చెయ్యి ఆన్చుకొని కూర్చున్న ఒక భారీ ఆకారం ఆనందరావుని గుచ్చి గుచ్చి చూసింది. దాంతో మిగిలిన వాళ్ళు కూడా అటు చూసారు. వాళ్ళ సంభాషణకు పుల్‌స్టాపు పడి హఠాత్తుగా నిశ్శబ్దత ఆవరించింది.

ఆనందరావు దోషిలా నిలబడిపోయాడు.

కాస్సేపటికి ఎదురుగా కూర్చున్న భారీ ఆకారం ప్రశ్నించింది.

'ఆనంద్... ఆనందరావు కదూ...'

ఆనందరావు కాస్త తేలికపడి అవునన్నట్లు నవ్వాడు.

మిగిలినవాళ్ళు మొహాలు మాడ్చుకొని కూర్చున్నారు.

'రావోయ్... అక్కడే నిలబడిపోయావేం?'

పట్టాభి తనను చూడగానే అమాంతం కౌగలించుకుంటాడనీ, ఆనందంలో ఉక్కిరి బిక్కిరవుతాడనీ ఏవేవో ఊహించుకున్నాడు తను. కనీసం కుర్చీలోంచి లేవనుకూడా లేవలేదు.

ఆనందరావు మనసులోనే నవ్వుకుంటూ లోనికి నడిచాడు.

'ఇతను నా క్లాస్‌మేటు ఆనందరావు... డాక్టరేట్ సంపాదించి రీడర్‌గా పని చేస్తున్నాడు. ఇప్పుడు...' ప్రశ్నార్థకంగా ఆనందరావు వైపు చూసాడు.

# దూరం

'ఇక్కడే...' కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటూ అన్నాడు ఆనందరావు.

'ఐ. సీ. వెరీ గ్లాడ్. వీరు చీఫ్ ఇంజినీర్. వీళ్ళు జూనియర్ ఇంజినీర్స్...' అంటూ గబగబ పరిచయం చేసేసి తన పని అయిపోయినట్లు సిగరెట్ అంటించి ప్యాకెట్ ఆనందరావు వైపు త్రోసాడు.

'పట్టాభి చాలా మారిపోయాడు. మనిషి బాగా లావయ్యాడు. కుర్చీకి నిండుగా సరిపోయాడు. ఠీవిగా ఉన్నాడు' అనుకుంటూ ఆనందరావు సిగరెట్ అంటించాడు.

అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు. ఆ నిశ్శబ్దానికి కారణం తనేనన్న సంగతి హఠాత్తుగా గుర్తొచ్చింది ఆనందరావుకి. ఒక్క క్షణం అక్కడ కూర్చోలేకపోయాడు.

'పట్టాభీ... వస్తాను.' నవ్వుతూ అందరి వద్ద సెలవు తీసుకొన్నాడు.

అందుకోసమే ఎదురుచూస్తున్న పట్టాభి.. అంతలో ముఖం విచారంగా పెట్టి 'సారీ ఆనంద్... వచ్చే ఆదివారం రాకూడదూ... లీజర్లీగా మాట్లాడుకోవచ్చు.'

ఆనందరావు తలూపి ఇవతలికి వచ్చి రోడ్డెక్కాడు.

అతని చెవుల్లో పట్టాభి అన్న చివరి మాటలే గింగురుమంటున్నాయి. తనవే ఎందుకు రమ్మన్నాడు? 'నీ ఎడ్రసు ఇయ్యి. నేనే వచ్చి కలుస్తాను' అని ఎందు కనలేక పోయాడు పట్టాభి.

నవ్వుకున్నాడు ఆనందరావు.

ఈ పట్టాభి ఏమైపోతాడో అనుకొని జాలి పడేవాడు తను. ఇప్పుడు ఎవరిని చూసి ఎవరు జాలి పడాలి! తను డిగ్రీలు సాధించాడు. పట్టాభి అంతస్థు సాధించాడు. తనకో చిన్నపాటి స్వంత ఇల్లయినా లేదు. అతను రెండంతస్థుల భవనానికి యజమాని!...ఎంత ఆశ్చర్యం ?

ఎవరో సిగరెట్ పొగ ముఖం మీదికి వదులుతూ అతనిని రాసుకుంటూ వెళ్లిపోయారు. మరో ప్రక్క నుంచి దుమ్ము రేపుతూ కారు దూసుకుపోయింది.

ఆనందరావు ఎండలో బస్‌స్టేజి వైపు నడుస్తూ ఆలోచిస్తున్నాడు.

దూరాన్ని మైళ్లతోను, కాలంతోనే కాదు డబ్బుతో కూడా కొలవచ్చును.

అంతలో గోపాలం గుర్తొచ్చాడు. 'నాతో ఎందుకు చెబుతావులేరా ? పెద్ద ప్రొఫెసర్‌వి' అని వాడన్నప్పుడు నవ్వుకున్నాడు తను. ఇప్పుడర్థమౌతోంది తనకు. గోపాలానికే భాషొచ్చుంటే 'దూరాన్ని చదువుతో కూడా కొలవచ్చు' అనుకొనే వాడేమో !

రోడ్డుమీద... భర్త మీసం మెలేస్తూ ఠీవిగా ముందు నడుస్తున్నాడు. పైటకొంగు భుజం చుట్టూ కప్పుకొని తలవంచుకొని అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తోంది భార్య.






# భారతదేశమంతటా డీలర్ల విశ్వాసాన్ని పొందిన చిహ్నం



Neelam® STAINLESS STEEL TABLEWARE



ANJALI® Kitchenware



RAMA STAINLESS STEEL WARE



SWAN ELECTRICAL APPLIANCES



MAJESTIC® Kitchenware



Vaishali NOVELTIES & FEEDING BOTTLE WARMER



amar GASLITER AND MUSICAL TOY



MAJESTIC® Pressure Cooker



Hawkins® PRESSURE COOKER



Ajanta KWALITY KITCHENWARE



Supercook GAS TANDOOR



flora® KITCHEN AIDS



Bindal's THERMAL TEA JAR



NIRLEP NON-STICK COOKWARE



Priya ICE PAIL & HOT CASE



Kitchenmate COOK 'N' SERVE WARE



CRYSTAL® ELECTRONIC GAS LIGHTER



vinsan

MAJESTIC® WATER FILTER



ఆంధ్రప్రదేశ్‌లోనే 650 మందికి పైగా డీలర్లు విశేష లాభాలకు దానిని చిహ్నంగా కనుగొన్నారు ఎందుకంటే,
అతి ఎక్కువగా అమ్మకమయేవి * వంట పాత్రలు * స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలు * ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్
అప్లయన్సెస్ * బహుమతులివ్వడానికి పనికివచ్చే కొత్త కొత్త రకాలు దానికింద పంపిణీ అవుతున్నాయి.
అంటే భారీగా మరియు తేలికగా అమ్మకాలు-కాబట్టి లాభాలు ఎక్కువ
మంచి వ్యాపారం కోసం మీరు నిరీక్షిస్తున్నట్లయితే, డీలర్‌షిప్ కొరకు రాయండి. ఆంధ్రప్రదేశ్
అంతటినుండి డీలర్‌షిప్ కొరకు దరఖాస్తులు కోరబడుచున్నవి.

allied



ఆంధ్ర ప్రదేశ్‌కు డిస్ట్రిబ్యూటర్లు

PH : 221198/34819

**మహావీర్ ఎంటర్‌ప్రైజెస్, తిలక్ రోడ్, హైదరాబాద్-1**



కెళ్లాడు. మళ్ళీ నేను అక్కడున్న పుస్తకాలు చూడడం మొదలెట్టాను. అక్కడ అట్లాసు తెరచి వుండడం చూసాను. దగ్గరికెళ్ళి చూస్తే, అది ఇంగ్లాండు పటంవున్న పేజీ. ఆ మ్యాపులో కొన్నిచోట్ల సున్నా గుర్తులు పెట్టబడివున్నాయి. అది అతని ఎస్టేటును గుర్తించేది అని తెలుస్తోంది. తర్వాత రెండు ప్రదేశాలు గుర్తించబడి వున్నాయి. అవి 'ఎగ్జిటర్' రెండోది యార్కుషైర్ కోస్తా ప్రాంతంలోని 'విట్‌బి.'

కాసేపటికి డ్రాకులా లోపలికొచ్చాడు. 'అరే! ఇంకా పుస్తకాలు చూస్తూనేవున్నారా? మంచిదేగానీ, మరీ అలా శ్రమపడిపోకూడదు. రండి. భోజనం సిద్ధంగావుంది' అన్నాడు. నా చెయ్యి పట్టుకున్నాడు. ఇద్దరం గదిదాటి వెళ్లాం. భోజనం చూడగానే నోరూరింది. క్షమించండి! నేను బయటకు వెళ్లేముందు' భోజనం చేసేసాను. మీరు కానివ్వండి' అన్నాడు. నేను భోజనం చేస్తుండగా కబుర్లు చెపుతూ కూర్చున్నాడు. తర్వాత సిగారు ముట్టించాను. డ్రాకులా నాతో కబుర్లు చెపుతూ, ప్రశ్నలు వేస్తూ గడిపాడు. నాకు అలా చాలాసేపు కూర్చోడం ఇబ్బందిగానే వుంది. కానీ మొహమాటం వల్ల వూరుకున్నాను. అంతకుముందు బాగా నిద్రపోయానేమో, ఇప్పుడు నిద్ర రావడంలేదు. బయటనుంచి బాగా చల్లగాలి వస్తోంది. కాలం గడుస్తోంది. మాటల్లో వుండగా కాకి అరుపు వినిపించింది. అంటే తెల్లవారబోతోందన్నమాట. వెంటనే డ్రాకులా లేచి నిలబడి 'తెల్లారిపోయింది! మిమ్మల్ని చాలాసేపు మాటల్లో పెట్టేసాను. మీరు మీ ఇంగ్లాండు గురించి ఎక్కువగా చెప్పడం మానేయాలి. అప్పుడు నేను మాటల్లో పడి టైము వృథా చెయ్యనవసరం వుండదు' అని గబగబా వెళ్లిపోయాడు.

నేను పడక గదిలోకెళ్ళి తెరలు వేసాను. చీకటి అయింది. గదిలో ఏమీ కనిపించలేదు. మళ్ళీ తెరలు పైకి ఎత్తాను. వెలుతురు వచ్చింది. కూర్చుని ఈ రోజు జరిగింది అంతా రాసేసాను.

మే 8 : ఈ ప్రదేశం గురించి నా భయాలు వదల్లేదు. ఒక్కసారి జరిగినదంతా మననం చేసుకున్నాను. జరిగినవి ఆలోచించుకుంటే, ఏవిటో దిగులుగావుంది. ఇప్పటి వరకు నేను క్షేమంగానే వున్నాను. ఆ కోటలో మరో మనిషి లేడు మాట్లాడుకోడానికి. డ్రాకులా వున్నాడు. కానీ అతనితోనా మాటలు? ఒక్కసారి జరిగింది తలుచుకుంటే నాకు కాస్త ధైర్యం వచ్చింది. మరీ అతిగా వూహించుకుంటే భయమేస్తుందిగానీ, ఇప్పటివరకు బాగానే తట్టుకోగలిగానని పించింది.

కాసేపు నిద్రపోయాను. మెలకువ వచ్చిన తర్వాత ఇక నిద్రపట్టలేదు. లేచికూర్చున్నాను. గడ్డం చేసుకోవాలనిపించి నా దగ్గరున్న అద్దం కిటికీ దగ్గర వుంచాను. గడ్డం మొదలెట్టబోయాను. అప్పుడే నా భుజంమీద ఒక చెయ్యి పడింది. 'గుడ్ మార్నింగ్' అన్న డ్రాకులా మాటలు వినపడ్డాయి. నేనూ చెప్పాను. అద్దంలో నేనూ, గది తప్ప, అతని ప్రతిబింబం కనిపించలేదు. బిత్తరపోయి, కంగారులో కొద్దిగా గడ్డం తెగకోసుకున్నాను. కానీ ఆశ్చర్యంలో వున్నా నేను, తెగిన గడ్డాన్ని గమనించలేదు. ఒకసారి అద్దం వంక చూసాను. భ్రమ అనిపించింది. కానీ వెనక్కి

తిరిగి చూసాను. అతను నాకు చాలా దగ్గరగా నిలబడి వున్నాడు. కానీ అతని ప్రతిబింబం అద్దంలో కనపడ్డంలేదు! గదిలో ప్రతి వస్తువు అద్దంలో చూడగలుగుతున్నానుగానీ, డ్రాకులా మాత్రం కనిపించడంలేదు. ఇదేదో మాయగా వుంది. డ్రాకులా దగ్గరుంటే ఏయే భయాలుండేవో అవి మళ్ళీ మొదలయ్యాయి. అద్దంలో చూసాను మళ్ళీ. నా గడ్డం దగ్గర రక్తం కారసాగింది. రేజర్‌ని పక్కనపెట్టి, దెబ్బలకు వేసేపట్టీ కోసం చూసాను. డ్రాకులా నా మొహం చూసాడు. అతని కళ్ళు ఎర్రగా అయ్యాయి. కోపంతో వున్నాడు. గభాల్న నా చొక్కా పట్టుకుని లాగాడు. అప్పుడు నా మెళ్లో వున్న శిలువ బొమ్మ అతని చేతికి తగిలింది. అంతే, అతనిలో వెంటనే మార్పు వచ్చేసింది. ముందర ఎంత నెమ్మదిగా వున్నాడో అట్లాగే వున్నాడు.

'జాగ్రత్తగా వుండండి! గడ్డం ఎట్లా తెగిందో చూసారా? ఈ దేశంలో ఇటువంటి విషయాలు చాలా ప్రమాదమైనవి!' అన్నాడు. వెంటనే నా చేతిలోని అద్దాన్ని లాక్కుని 'అసలిదంతా దీని మూలాన. మనిషిని మభ్య పెట్టేది ఇది. దీన్నివతల పారేయాలి. అంటూ తెరిచివున్న కిటికీలోంచి బయటకు విసిరేసాడు. అది కింద రాయిమీద పడి వెయ్యి ముక్కలయి చిందరవందరయింది. అతను గబగబా వెళ్ళిపోయాడు. వున్న అద్దం కాస్త పారేస్తే ఎట్లా గడ్డం చేసుకోవాలి? గడ్డం నీళ్ళు పెట్టుకునే గిన్నెను తిప్పి ప్రతిబింబాన్ని చూసుకోవాల్సిందే ఇక.

భోజనాల గదిలోకి వెళ్ళాను. అక్కడ భోజనం సిద్ధంగానే వుంది. డ్రాకులా మాత్రం అక్కడ కవిపించలేదు. అందువల్ల ఒక్కడ్నే భోజనం ముగించాను మామూలుగా. ఇంతవరకూ అతను నాతోపాటు కూర్చుని భోజనం చేయకపోవడం చాలా వింతగానే వుంది! భోజనం అయిన తర్వాత కోటలో కాస్త అటూ ఇటూ తిరగసాగాను. ఒకచోట మెట్లు కనపడితే అవి ఎక్కాను. దక్షిణానికి అభిముఖంగా వున్న గదిని ఒకటి చూశాను. అక్కడ్నించి చూస్తుంటే అద్భుతం అనిపించింది. ఆ కోట నిట్ట నిలువుగా వున్న కొండ అంచున వుంది. అక్కడి కిటికీ నుంచి ఏం పడేసినా వెయ్యి అడుగుల క్రిందకు పడుతుంది. అక్కడ్నించి దృష్టి సారిస్తే, చెట్ల అంచులు

# జీవన్ మృతులు

తప్ప మరేమీ కనిపించడంలేదు. అక్కడక్కడా అడవి మధ్య పారే నదులు వెండి తీగల్లా కనిపిస్తున్నాయి.

ఈ ప్రకృతిని చూస్తుంటే దాన్ని వర్ణించటానికి మనసురాలేదు. ఎందుకంటే ఎక్కడ చూసినా తలుపులు. ఎటువేపు వెళ్ళినా తలుపులు. పైగా అన్నీ తాళంవేసి! అక్కడి కిటికీలు తప్ప బయటపడటానికి మరో దారి లేదు. కిటికీలోంచి బయట పడితే ఇక చావే!

ఇది కోటలా తోచలేదు. ఇది బంధిఖానా! ఇందులో నేనొక బందీని!

నేనొక బందీని అన్న ఆలోచన బుర్రలోకి రాగానే ఇక భయం ఆవరించింది. గబగబా మెట్లు దిగాను. దిగుతూ ప్రతి కిటికీ తలుపు తెరిచి చూసాను. ఉపయోగం కనపడలేదు. నేను నిస్సహాయస్థితిలో వున్నానని గ్రహించాను. బోనులోపడ్డ ఎలుకలాగ ఎంతోసేపూ అటూ ఇటూ పరుగులెత్తాను. కానీ నాది ఎటువంటి ఉపయోగం లేని ప్రయత్నం అని తెలిసి, నీరసంగా ఒకచోట కూర్చుండి పోయాను. అంత నీరసంగా జీవితంలో ఎప్పుడూ లేను. ఇప్పుడు ఏం చెయ్యాలి అని నెమ్మదిగా ఆలోచించడం ప్రారంభించాను. అట్లా ఆలోచిస్తూనే వున్నాను. మార్గం కనిపించలేదు. ఒకటి మాత్రంనిజం.నేను పారిపోవడానికిప్రయత్నిస్తున్నట్టు డ్రాకులా తెలుసుకోకూడదు! అతడు నన్ను బందీని చేసాడు. ఎందుకో అతనికే తెలియాలి. అతన్ని ఇక నమ్మకూడదు. నమ్మానంటే చచ్చానే! నాలోనిభయాలు,ఆందోళనలు, పైకి కనిపించకుండా నాలోనే దాచుకోవాలి. కళ్ళు మాత్రం బాగా తెరుచుకుని అన్నీ గమనిస్తూ వుండాలి. చిన్నపిల్లాడిలా అతని మాటలు నమ్ముతూ వుండకూడదు. నా బుర్రనుపయోగించాలి బయటపడటానికి.

ఇట్లా అనుకుంటూ వుండగా, కోట క్రింది తలుపు మూసిన చప్పుడయింది. అంటే, డ్రాకులా వస్తున్నాడన్నమాట. అతను వెంటనే పుస్తకాల గదికి రాలేదు. నేను మెల్లగా నా గదిలోకి వెళ్ళాను. అతను నా పక్క సరిచేస్తూ కనిపించాడు. అతను అలా చేయడం ఎబ్బెట్టు అనిపించింది. కానీ, నాకు తెలిసినంతవరకూ, పనివాళ్ళు అక్కడ ఎవరూ లేకపోవడంవల్ల పనులు అతనే చేస్తున్నాడనిపించింది. తర్వాత తలుపు సందులోంచి గమనించాను. అతను భోజనాల బల్ల ఏర్పాటు చేస్తున్నాడు. అంటే, కోటలో నౌకరు ఎవరూ లేనట్టే. ఆ ఆలోచన రాగానే మళ్ళీ భయం పట్టుకుంది. నన్ను ఈ కోటలోకి తీసుకువచ్చిన బండి అతనుకూడా ఇతనేనేమో? ఇది చాలా భయంకరమైన ఆలోచన. దారిలో వస్తూ, తోడేళ్ళను అదుపులో పెట్టగిలిగినవాడు ఇతనేనా? అందుకేనా బిస్ట్రిట్జ్‌లో జనం నాగురించి భయపడింది! ఆ ముసలావిడ నాకు శిలువ ఇవ్వడానికి కూడా అదే కారణమా? నిజంగా ఆ ముసలావిడ నా మెళ్లో గొలుసు వేసి మంచిపని చేసింది. లేకపోతే నా పని ఏమయ్యేదో కదా! దాన్ని నేను ముట్టుకున్నప్పుడల్లా, హాయిగా వుండి, ఎంతో ధైర్యం చేకూరుతోంది. ఇటువంటి మూఢనమ్మకాలు, విగ్రహారాధనలు కూడవని నేర్చుకున్నాను. అట్లాంటిది, ఈ భయంకర ఒంటరితనానికి ఇదే అండగా నిలుస్తోంది. చాలా తమాషాగా వుంది. ఈ గొలుసుకు అంత మహిమ వుందా? ఎప్పుడైనా తీరికగా దీన్ని గురించి ఆలోచించాలి. ముందసలు డ్రాకులా గురించి అన్ని విషయాలు తెలుసుకోవాలి. అతన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి. ఇవాళ అతన్ని మాటల్లో పెట్టి అతని గురించి చెప్పించాలి ఈ విషయంలో అతనికి ఎటువంటి అనుమానం కలగకుండా ప్రయత్నించాలి.

అర్ధరాత్రి: డ్రాకులాతో చాలాసేపు మాట్లాడాను. ఈ ట్రాన్‌సిల్వేనియా చరిత్ర గురించి కొన్ని ప్రశ్నలు అడిగాను. చాలా చక్కగా జవాబులు చెప్పాడు. ప్రజల గురించి, యుద్ధాల గురించి, మరికొన్ని విషయాల గురించిన చరిత్ర అది జరిగిన కాలంలో తాను స్వయంగా వుండి చూసినంత గొప్పగా చెప్పాడు. ఈ కోట తమ పూర్వీకులదనీ, వారి గొప్పతనమే తనకు ప్రేరణ అని చెప్పాడు. కోట గురించి చెప్పేటప్పుడు 'మా' 'మేము' 'మాది' అని బహువచనంలో చెప్పసాగాడు, ఒక మహారాజు పలికినట్టుగా. అతను చెప్పిందంతా మంత్రముగ్ధుడిలా విన్నాను. అతను వాళ్ల చరిత్ర చెపుతున్నంతసేపూ చాలా ఉద్రేకంగా కనిపించాడు. గదిలో అటూ ఇటూ తిరిగాడు. అప్పుడప్పుడు తెల్లటి మీసాలు మెలేసాడు. ఒక్కోసారి ఏదో ఒక దానిమీద చేతులు వేసి మాట్లాడాడు. అలాంటప్పుడు అతను చేతులు వేసిన వస్తువు

చిరకాలంగా ఎదురుచూస్తున్న ఆ గ్యాస్ కనెక్షన్ లభించింది
ఇక గ్యాస్ స్టౌవ్‌ని ఎంచుకోవడమే అయితే, నిస్సందేహంగా
అది సూపర్ (అత్యున్నత) నిర్ణయమే
సూపర్‌ని ఎంచుకోవడం తప్ప మరో మార్గం లేదు. ఇంధనం
తెలివిగా వాడుకోడంలోను, పొదుపులోను కూడా సూపర్
నాణ్యతలో, రూపంలో సూపర్ అత్యున్నత భద్రతా ప్రమాణాలకు
అనుగుణ్యంగా రూపకల్పన చేయబడింది సూపర్ ప్రత్యేకతలు
ఒక్క మాటలో చెప్పాలంటే 'సూపర్' ఖ్యాతి' **సూపర్‌ఫ్లేమ్**

సూపర్ ప్రత్యేకతలు

- నాజూకుగా కనబడే సిల్వర్-క్రోమ్ లేదా స్టెయిన్‌లెస్ స్టీల్ బాడీ.
- తుప్పు పట్టని, వేడి ఎక్కని ప్యాన్ సపోర్టర్‌లు.
- నిప్పు అంటుకోనని (FIRE PROOF) నాబ్‌లు.
- లోపలే నిర్మాణమైన దృఢమైన స్టాండ్.

అనేక రకాల మోడల్స్ !

సింగిల్ బర్నర్, డబుల్ బర్నర్ 'ప్రీమియం' డబుల్ బర్నర్ డీలక్స్, కేంటీన్ బర్నర్ ఆకర్షణీయమైన రంగులలో లభిస్తాయి.




# నం.1 సూపర్‌ఫ్లేమ్

భారత దేశపు అత్యధికంగా విక్రయమయ్యే గ్యాస్ స్టౌవ్

***గ్లోబ్ సూపర్ పార్ట్స్***

నుగ్గు నుగ్గు అయిపోతుందేమో ననిపించింది. అతని పూర్వీకుల గురించి ఒక విషయం చెప్పాడు. అది నాకు బాగా జ్ఞాపకం వుంది. అదేమిటంటే :

''మా 'జెక్లిన్' తెగవారు గర్వించదగ్గ వీరులు. రాజ్యం కోసం సింహంలా పోరాడిన వీరుల రక్తం మా నరాల్లో ప్రవహిస్తోంది. ఈ డ్రాకులా, వారియొక్క హృదయంనుంచి వెలువడ్డ రక్తం, వారియొక్క మెదడు, వారియొక్క ఖడ్గం. ఈ జాతిని చేరుకునే ధైర్యం మరొకరికి లేదు. అయినా అటువంటి యుద్ధపు రోజులు అయిపోయాయి. శాంతికి విలువలేని ఈ రోజుల్లో రక్తం చాలా విలువైన వస్తువు. ఆనాటి వీరుల గాథలు, గాథలుగానే మిగిలిపోయాయి.''

ఇదంతా అతను చెప్పేసరికి తెల్లారి పోయింది. నేను నిద్రకుపక్రమించాను. అతను వెళ్లిపోయాడు.

మే 12 : ఇక్కడకొచ్చినతర్వాత నా బుర్ర కాస్త చెదిరింది. ఏదైనా ఎస్టేట్ విషయం గురించి మాట్లాడవలసి వచ్చినపుడు, పుస్తకాలు, కాగితాలు తిరగేసి చెబుతున్నాను. క్రితం రాత్రి డ్రాకులా నా దగ్గర కూర్చుని కొన్ని వ్యాపార విషయాల గురించి, న్యాయ చట్టానికి సంబంధించినవాటిని గురించి అడిగాడు. వాటికోసం ఒక రోజంతా, పుస్తకాలు తిరగేస్తూ వుండిపోయాను. అతని ప్రశ్నలు అడిగిన క్రమంలోనే జవాబులు తయారుచెయ్యడం మొదలుపెట్టాను. అట్లా చెయ్యడంవల్ల నాకు కొంత గుర్తు వుంటుంది.

అతని మొదటి ప్రశ్న ఏమిటంటే, ఒక వ్యక్తి ఇద్దరుగానీ అంతకంటే ఎక్కువ వకీళ్లనుగానీ పెట్టుకోవచ్చా? కావాలంటే డజనుమందిని పెట్టుకోవచ్చని చెప్పాను. కానీ దానివల్ల చాలా ఇబ్బంది వుందని చెప్పాను. ఒకళ్ళకంటే ఎక్కువమందిని పెట్టుకుంటే, వ్యవహారం తిన్నగా సాగక బెడిసికొడుతుందని చెప్పాను. అది అతనికి అర్థమయిందనుకుంటా. అయినా మళ్ళీ అడిగాడు. ''ఒకే మనిషి అన్ని విషయాలు ఒక్కసారే, చూసుకోలేడు కదా. బ్యాంకు విషయాలు చూడడానికి, షిప్పింగ్ వ్యవహారాలు చూడడానికి, ఎక్కడో దూరంగా వున్న మరో వూళ్ళో వ్యవహారాలు చూడడానికి, ఒక్కడే సరిపోతాడా?'' అన్నాడు. నాకు అర్థంకాలేదు. కాస్త వివరంగా చెబితే,

# జీవన్ మృతులు

సరైన సలహా ఇవ్వగలనని చెప్పాను.

'చెప్తాను! ఉదాహరణకు. పీటర్ హాకిన్స్ మీకు, నాకు మిత్రుడు. అతను ఎగ్జిటర్‌లో వున్నాడు. అదేమో లండన్‌కి దూరంగా వుంది. అతను మీ ద్వారా నాకో ఇల్లు కొన్నాడనుకుందాం. మంచిదే కదా. అదే లండన్‌లోవున్న మనిషిని పెట్టాననుకో. అతను అక్కడివాడవడంచేత, అతనికిగానీ, అతని మిత్రుడికిగానీ లాభం చేకూరేట్టు ప్రవర్తించవచ్చు. నాకు ఉపయోగంలేకుండా చేయవచ్చు. నాకు ఉపయోగకరంగా వుండేందుకు లండన్‌కి దూరంగావున్న మనిషిని పెట్టుకున్నాను, నా వ్యవహారాలు చూడడానికి. ఇప్పుడు నేను నా సామానంతా కొత్త ఇంటికి తరలించాలి. నాకు వేరే పనులున్నాయి. ఈ సామాను అక్కడికి చేరాలి. అక్కడ మనిషికి ఈ సామాను పంపితే పని సులువుగా వుంటుంది కదా' అన్నాడు.

'మీరు చెప్పింది బాగానేవుంది. కానీ దాని కోసం ప్రత్యేకంగా లండన్ మనిషిని పెట్టుకో నక్కర్లేదు. మాలాంటి వకీళ్లకు ఇతర ప్రదేశాలల్లో వున్న వకీళ్లతో సంబంధాలుంటాయి. ఏదైనా వూళ్ళో వ్యవహారం చూడాలనుకుంటే, అక్కడి మనిషికి కబురు చేస్తేచాలు, పని జరిగిపోతుంది, క్లయింటుకి ఎటువంటి ఇబ్బంది లేకుండా' అన్నాను.

'కానీ, నేను అనుకున్న ప్రకారం పనులు జరుగుతాయా?' అడిగాడు.

'అయ్యో! ఎందుకు జరగవు? మీ విషయాలు మరో మనిషికి తెలియకుండా మీరే చెప్పవచ్చు. అట్లాగే జరిగిపోతాయి పనులు' అన్నాను.

'బాగుంది!' అన్నాడు. ఇక్కడ్నించి సామాను తరలించడానికి, కావలసిన ఏర్పాట్లు చెయ్యడానికి అవసరమైన కాగితాలు అవీ చూసాడు. ఇంకా ఏవో ప్రశ్నలు వేస్తే జవాబులు చెప్పాను. అతను వాలకం చూస్తే మా వకీళ్లకన్నా తెలివిగలవాడుగా అనిపించాడు. అతనెప్పుడు వూరిదాటి వెళ్లిన వాడులాలేడు. వ్యాపార వ్యవహారాలు చేసినవాడు కాదు. కానీ విషయాలన్నీ బాగా తెలిసినట్లు మాట్లాడ్డం నాకు ఆశ్చర్యమేసింది. నేను పుస్తకాలు అవీ చూసి చెప్పిన జవాబులకు తృప్తిపొందినట్టు కనిపించాడు.

'ఇక్కడికొచ్చాక మీ మిత్రుడు 'పీటర్ హాకిన్స్'కు గానీ మరొకరికిగాని ఉత్తరం వ్రాసారా?' అడిగాడు. ఇక్కడ్నించి ఉత్తరాలు వెళ్లే అవకాశం లేనట్టు కనిపించి రాయలేదు అని చెప్పాను. దానికతను 'అయితే ఇప్పుడు రాయండి, మీ మిత్రుడికి' అన్నాడు నా భుజం మీద చెయ్యి వేసి. 'మీ మిత్రుడికిగానీ, మీ రెవరికైనాగానీ ఇక్కడ మీరు నాతో నెల రోజులు వుండబోతున్నట్టు వ్రాయండి' అన్నాడు.

''ఇంకా నేను నెల రోజులుండాలా ఇక్కడ?'' అడిగాను. నా గుండె చల్లబడింది నెల రోజు లనేసరికి.

'అవును వుండాల్సిందే! మీరు కాదంటే వినేది లేదు. మిత్రుడనండి, యజమాని అనండి, అతని తరఫున మీరు నా పనులు చూడడానికి వచ్చారు. కాబట్టి నా పనులు అయ్యేవరకు వుండాల్సిందే!'' అన్నాడు.

ఒప్పుకోక చేసేదేముంది? పీటర్ హాకిన్స్ చెప్పినపని ఇది. అతని గురించి ఆలోచించాలి. నా గురించి మరచిపోవాలి. పైగా డ్రాకులా మాట్లాడుతున్నప్పుడు అతడి కళ్ళు నేను ఇక్కడ బందీని అని హెచ్చరిస్తున్నట్లున్నాయి. నాకు వేరే మార్గం లేదు. ఒప్పుకున్నట్టు చెప్పాను. అతను నన్ను గెలిచినట్టు కనిపించాడు.

'మిత్రమా నీకో విషయం చెప్తున్నాను. నువ్వు నాకు చెయ్యడానికి వచ్చిన పనుల గురించి తప్ప ఇతర విషయాలు నీ ఉత్తరాల్లో దొర్లకూడదు. ఇక్కడ నువు చాలా హాయిగానే వున్నట్టు కనిపించాలి. తెలిసిందా?' అన్నాడు. అట్లా అంటూ మూడు తెల్లకాగితాలు, మూడు కవర్లు ఇచ్చాడు. కాగితాలు, కవర్లు చాలా పల్చగా వున్నాయి. అతనివంక చూసాను. అతను చిన్నగా నవ్వుతున్నాడు. అతని పళ్ళు క్రింది ఎర్రటి పెదవిమీద వున్నాయి. నేను రాసేది అతను చదివే ప్రమాదం వుందని గ్రహించాను. ఉత్తరాలు సామాన్యంగానే రాయడానికి నిశ్చయించుకున్నాను. ఇతర వివరాలతో హాకిన్స్‌ను, మీనాకు ఉత్తరాలు రాద్దామనుకున్నాను. మీనాకు షార్టుహాండులో రాస్తే సరి. ఒకవేళ చూసినా ఇతనికి అర్థం కాదు. నేను ఇద్దరికి ఉత్తరాలు రాసి కూర్చు న్నాను. ఓ పుస్తకాన్ని చదవడం మొదలు పెట్టాను. డ్రాకులా కూడా ఏమిటో చాలా రాయడం మొదలుపెట్టాడు, అక్కడ బల్లమీద

పుస్తకాలు చూస్తూ. రాయడం ముగించాడు. నేను రాసిన ఉత్తరాలు తీసుకుని తనవాటితో కలిపాడు. వాటిని అక్కడ వదిలేసి తలుపు తీసుకొని వెళ్ళాడు. నేను అతను వ్రాసిన ఉత్తరాలు చూడడంకోసం ముందుకు వంగాను. అట్లా చూడకూడదుగానీ, నా రక్షణ కోసం అట్లా చెయ్యాలనిపించింది.

ఒక ఉత్తరం చిరునామా : సామ్యూల్ ఎఫ్. బిల్లింగ్‌టన్. నెం. 7, ది క్రిసెంట్, విట్ బి; రెండోదాని చిరునామా : హెర్‌లాట్నర్, వార్నా; మూడో చిరునామా : కౌట్స్ అండ్ కంపెనీ, లండన్. నాలుగో ఉత్తరం చిరునామా : హారెన్ క్లాప్‌స్టాక్ అండ్ బిల్‌రూత్, బాంకర్స్, బుడాపెస్ట్. రెండో ఉత్తరం, నాలుగో ఉత్తరం, కవర్లో మూయలేదు. వాటిని చూద్దామనుకుంటూ వుండగా, తలుపు గడియ తీస్తున్న శబ్దం అయింది. నేను గభాల్న నా చోటులో కూర్చుని, మళ్ళా పుస్తకంలో మునిగిపోయాను. డ్రాకులా లోపలికొచ్చాడు. అతని చేతిలో మరో ఉత్తరం వుంది. టేబుల్‌మీద వున్న ఉత్తరాలన్నీ తీసుకుని కవర్లలో పెట్టి స్టాంపులు అతికించాడు.

'క్షమించండి. ఇవాళ సాయంత్రం నాకు చాలా పనులున్నాయి. అవి చూసుకోవాలి.' అంటూ తలుపు దగ్గరికి వెళ్ళి ఆగాడు. 'మరో విషయం మిత్రమా! మీకొక హెచ్చరిక చేయదల్చుకున్నాను. ఇక్కడ కాకుండా మరో గదుల్లోకి వెళ్ళొద్దు. మీకు నిద్ర పట్టదు. ఈ కోట చాలా పాతదని తెలుసుకదా. ఎన్నో జ్ఞాపకాల పుట్ట. సరిగా నిద్రపోనట్టయితే, పీడకలలొస్తాయి. అందువల్ల జాగ్రత్తగా వుండండి! మీకు నిద్ర వచ్చినట్టు అనిపించినా, నిద్రపోవాలనుకున్నా, వెంటనే మీకు ఏర్పాటు చేసిన గదిలోకి వెళ్ళండి. లేదా ఈ గది అయినా ఫర్వాలేదు. మీకు ఎటువంటి హాని జరగదు. హాయిగా నిద్రపడుతుంది. నేను చెప్పినట్టు మీరు జాగ్రత్తగా వుండనట్టయితే...' అని చెప్పడం ఆపి, చేతులు కడుక్కున్నట్టుగా చేసి చూపించాడు. అర్థమయింది. అయినా నాకు రాబోయే పీడకలలు, ఇప్పుడు నేను వున్న పరిస్థితికన్నా భయంకరంగా వుంటాయా అన్న సందేహం వచ్చింది.

తర్వాత జరిగింది : అతను వెళ్ళిపోయాడు. అతను లేని గదిలో ఎక్కడ పడుకున్నా హాయిగానే వుంటుందనిపించింది. నా మెళ్ళో శిలువను తీసి నా పరుపు తల భాగంలో పెట్టాను. అట్లా చేయడంవల్ల నా కెటువంటి పీడకలలు రావని వూహిస్తూ.

ఎక్కడా అలికిడి లేదు. నేను గదిబయటకు వచ్చాను. మళ్ళా మెట్లు ఎక్కి ద్వారం దగ్గరకు వెళ్ళాను. గదిలోవుండి దక్షిణం వైపు బయటకు చూసాను. అక్కడ కాస్త స్వేచ్ఛ అనిపించింది. అప్పటివరకు బందీగానే అనిపించింది. ఒక్కసారి ఊపిరి గట్టిగా పీల్చుకోవాలనిపించింది, అది రాత్రి సమయమైనా. అట్లా వూపిరి పీలుస్తుంటే, నావునికి తెలిసివస్తోంది. నా నరాలెందుకో బిగుసుకుంటున్నాయి. నా నీడ చూసి ఏవేవో వూహించడం మొదలు పెట్టాను. నా భయానికి కారణం దేవుడికి తెలియాలి. బయటకు చూసాను. ఆ ప్రాంతం అంతా వెన్నెల కురుస్తోంది. వెన్నెల వెలుతురులో, దూరంగా వున్న కొండలు కలిసిపోయి కనిపించాయి. లోయలు నల్లగా కనిపించినయి. ప్రకృతి ప్రశాంతంగా వున్నట్టు అనిపించింది. నా మనసూ ప్రశాంతంగా వుంది. కాస్త ముందుకెళ్ళి కిటికీలోంచి వంగి బయటకు చూసాను. కింద అంతస్తులో ఏదో కదులుతున్నట్టు గమనించాను. అది డ్రాకులా గది అనుకుంటాను. నేను నిలబడి వున్న కిటికీ చాలా పొడుగ్గా వుంది. గట్టి రాతి కట్టడంతో వుంది, అక్కడక్కడా కాస్త పాడయిపోయినా. నేను కాస్త వెనక్కి వచ్చి గమనించడం మొదలుపెట్టాను.

క్రింది అంతస్తు కిటికీలోంచి డ్రాకులా తల బయటకుపెట్టాడు. అతని మొహం కనిపించలేదుకానీ అతని చేతులు, వెనుక భాగం చూసి, అతడే అయివుంటాడనిపించింది. ఆశ్చర్యం! అతడు కిటికీలోంచి బయటకు వచ్చి, దానికంటే క్రింది అంతస్తులోకి పాకడం మొదలుపెట్టాడు. అతని భుజాన మూటవుంది. ఆ దృశ్యం చాలా భయంకరంగా వుంది. అతను అక్కడ్నించి పడితే ? వెన్నెల్లో ఏవో నీడలు చూసి అట్లా భ్రమ పడుతున్నానేమోననిపించింది. అట్లాగే చూడసాగాను. డ్రాకులా కాళ్ళవేళ్ళు, చేతివేళ్ళు రాళ్ళ గోడమీద పట్టుకోసం పాకులాడుతున్నాయి. అతను గోడమీది బల్లిలాగ క్రిందికి దిగుతున్నాడు.

ఇతను మనిషేనా ? లేక మనిషి రూపంలో వున్న మరొక ప్రాణియా ? ఆలోచిస్తుంటే భయంకరంగావుంది. ఈ ప్రదేశం మొత్తం నన్ను దిగులుతో ముంచేస్తోంది. భయం — భయం ... పారిపోవడానికి మార్గంలేదు. ఇట్లాంటి భయంకరమైన ఆలోచనలతో గడపాల్సిందే ?

**(ఇంకా వుంది)**









"చూడు తల్లీ! సినిమా అంతా నీ అందం మీద ఆధారపడి ఉంది! మా సినిమా షూటింగ్ పూర్తి అయ్యేవరకూ ఏవిధమైన టపాకాయలూ కాల్చకు!"

# సినిమా

—జి.వి.జి.

## భక్త జ్ఞానదేవలో జ్ఞానబోధ

జ్ఞానదేవుడు ఒక పూరింటి ముందొచ్చి నిలుచొని, "అమ్మా, తల్లీ!" అని పిలిచాడు.

ఆ ఇంట్లోంచి బయటకు వచ్చిన శారద ఆశ్చర్యంతో "నీవు నన్ను తల్లీ — అని పిలిచావా? నువ్వే జాతి?" అంది.

"మానవజాతి."

"ఉన్నతజాతా లేక హీనజాతా? నేను హీన జాతిదాన్ని. ఉన్నత జాతివారు మమ్మల్ని కుక్కల్లా పిలుస్తారు. అందుకే అడిగాను. అది పోనీ — నువ్వెందుకు నన్ను తల్లీ అని పిలిచావు?"

"నా అన్న, తమ్ముడు, చెల్లెలూ — అంతా దప్పికతో నీరు నీరు అని కలవరిస్తున్నారు. వాళ్ళకి నీళ్ళిచ్చి ప్రాణం నిలబెట్టాలి. నా దగ్గర పాత్ర ఏదీ లేదు. కాస్త నీ కుండ ఇస్తావామ్మా? వాళ్ళకి నీళ్ళిచ్చి తిరిగి తెచ్చిచ్చేస్తాను."

"నేను అస్పృశ్యురాలిని. నా కుండలో నీళ్ళు తీసుకెళ్లి తాకితే, వాళ్ళ జాతి చెడిపోదా?"

"గుర్రం గుడ్డిదైతే, మనిషి కుక్కయితే జాతి చెడిందని అనవచ్చు. మనిషి మనిషిని ముట్టుకుంటే — జాతి చెడదమ్మా!"

"మరెందుకు మమ్మల్నంతా గజ్జిపట్టిన కుక్కలా ఛీఛీ అని దూరంగా నెట్టేస్తారు?"

# బేరన్
# ఇతర ఎనామిల్స్ కంటే ఒక మెట్టు ఎక్కువ.




**సరిసమానమైన ఆక్రమణ శక్తిని కలిగి వాటికంటే 40% ఎక్కువ స్థలమునకు వ్యాపించును.**

డెక్కన్ పెయింట్స్ తయారుచేసే 'బేరన్' సింథెటిక్ ఎనామిల్స్ ఒకప్రత్యేకమైన జాతి అని చెప్పవచ్చును. ఇతర బ్రాండ్‌లకంటే కూడా ప్రతి కోటింగుకు, ప్రతి లీటరుకు 40% ఎక్కువగా వ్యాపిస్తుంది. ఇంతవరకు అతిశ్రేష్టమైనదిగా పేరు తెచ్చుకున్న వాటిలో కూడా లేని ఇటువంటి ప్రయోజనం ఇందులోవుంది,

తళుకులోగాని, రంగులోగాని, కాంతిలోగాని, మృదుత్వంలోగాని, నిలిచిపోవడంలోగాని ఇతర అన్నిరకాల బ్రాండులతో బేరన్ ఇప్పుడు పోటీగా నిలబడుతుంది. అయితే 40% స్థలానికి వ్యాప్తి చెందేగుణం ఇందులోనేవుంది. అంటే సింథెటిక్ ఎనామిల్స్‌పై మీరు వెచ్చించేసొమ్ముకు పూర్తి లాభంచేకూరుతుందన్నమాట. మీరు చూసేది వాస్తవమని నమ్మగలిగితే మీరు ఎటువంటిది ఉపయోగించాలో నమ్మగలరు. అదే బేరన్.

**బేరన్ ఎనామిల్**
*విస్తృతంగా వ్యాపిస్తుంది*



**డెక్కన్ పెయింట్స్ ప్రైవేట్ లిమిటెడ్**
1-1-58, శ్రీనాథ్ కాంప్లెక్స్ సరోజినీదేవిరోడ్,
సికిందరాబాద్ -500 003. ఫోన్ 76118

associated/DP/226







—జీ.వి.జి

నిరుడు దీపావళి ముందు ఓ తమిళ చిత్రం ఔట్‌డోర్ షూటింగ్ కోసం బెంగుళూరులో ఉన్నాను. ఓ సాయంత్రం కాస్త తీరుబడి దొరికింది. పండక్కి బట్టలు కొనాలనిపించింది. నాతోపాటు ప్రముఖ తమిళ హాస్య నటీమణి మనోరమ షాపింగ్‌కి వస్తానంది. చీరల సెలక్షన్‌లో ఆమె ఎక్స్‌పర్ట్.

మద్రాసులోగాని, మరెక్కడైనాగాని— నేను ఏ సినిమా చూడ్డానికో, షాపింగ్‌కో ఇల్లువదిలి బయలుదేరేటప్పుడు— జనం నన్ను గుర్తుపట్టకుండా ఉండేలా ముస్లిమ్ వనితలా ఘోషా వేసుకుని వెళ్తుంటాను మామూలుగా. అంచేత, అప్పుడు బెంగుళూరులో కూడా అలాగే ముసుగు వేసుకొని వెళ్లాను. మనోరమ ఏ మాత్రం మేకప్ లేకుండా చాలా సింపుల్ బయలుదేరింది. ఓ హైందవ స్త్రీ పక్కన నేను ముస్లిమ్ వనితలా కనిపించడం కొందరికి సందేహం కలిగించినట్లుంది. తీరా మేం కారుదిగి, ఓ బట్టల కొట్లో అడుగుపెట్టబోతున్న సమయంలో పేవ్‌మెంటుమీదున్న కొందరు మనోరమను గుర్తుపట్టేశారు. ఇక చూడండి— ఒకటే ఈలలు, గోల... క్షణంలో మమ్మల్ని అందరూ చుట్టుముట్టేశారు. నేను కూడా తప్పకుండా ఓ స్టార్ అయి వుండాలన్న నమ్మకం వాళ్లలో బలపడింది. "ముసుగు తొలగించండి! మీరెవరో మేం చూడాలి," అంటూ కేకలెట్టసాగారు. ఇక నా అవస్థ ఏమని చెప్పను...! "నీ ముఖం చూపించకపోతే వాళ్లు వదిలేలా లేరు," అంది మనోరమ, గత్యంతరం లేనట్లు నేను మెల్లగా ముసుగు తొలగించానోగాని, మెల్లకన్ను పెట్టాను. నిజం చెప్పొద్దూ— వాళ్లు నన్ను పోల్చుకోలేక పోయారంటే నమ్మండి. "ఈమె సినిమా స్టార్ ఎందుకవుతుందీ?" అని వాళ్లల్లో వాళ్లు గుసగుసలతో నచ్చజెప్పుకున్నట్లుంది— ఒక్కొక్కరుగా చల్లగా జారుకున్నారు. బ్రతుకు జీవుడా— అంటూ మేం ఆ కొట్లోకి దూరి, చీరల సెలెక్షన్‌లో మునిగిపోయాం.

అభిమానులందరికీ నా దీపావళి శుభాకాంక్షలు!



"అది వారి అజ్ఞానం. అనాదిగా వచ్చిన మూఢ నమ్మకం. జాతి అంటే అర్థం తెలియని దురహంకారుల దురభిమానం. పుట్టుక చెడినట్లయితే జాతి చెడిందని చెప్పవచ్చు."

"నువ్వు తెలుసుకున్నంత పెద్దవాళ్ళు తెలుసుకోలేరు. తీసుకో...నేనే నీకు నీళ్ళు తీసుకొచ్చివ్వనా?"

"వద్దు, తల్లీ! ఇంకొకరికి శ్రమనిచ్చే బుద్ధి నాకు లేదు. వట్టి కుండనివ్వమ్మా. నేనే నీళ్ళు తీసుకువెళ్తాను. ఇవ్వమ్మా!"

"దేవుడు నీకు మేలు చేస్తాడు ... తీసుకో!" అంటూ శారద కుండనిచ్చింది.

"వెళ్లొస్తానమ్మా," అంటూ జ్ఞానదేవుడు నమస్కరించి బయలుదేరాడు.

లోగడ "భక్త శిరియాళ" చిత్రాన్ని డైరెక్ట్ చేసిన హూన్సూరు కృష్ణమూర్తి ప్రతిభావంతంగా దర్శకత్వం నెఱపిన ప్రవీణ్ ఆర్ట్ పిక్చర్స్ "భక్త జ్ఞానదేవ" చిత్రానికి రాజశ్రీ మాటలు, పాటలు రాశారు. జి. కె. వెంకటేశ్ సంగీత దర్శకుడు. ఎన్. ఆర్. కె. మూర్తి ఛాయాగ్రాహకుడు. చారుగుండ్ల వెంకటేశ్వరరావు సమర్పణలో సి. హెచ్. రాంబాబు నిర్మాత.

## వెలవంతలో తగని పందన

పడవ నది ఒడ్డున ఆగింది. ఒడ్డున పూజారి (శ్యాం), ఫకీరు (విజయరాం), మరికొందరు నిలబడి ఉన్నారు. పడవనుండి రహీం (జె. వి. సోమయాజులు) దిగబోయాడు.

పూజారి తీక్షణంగా "ఆగు, రహీం! తన ఆజ్ఞని ధిక్కరించి నది దాటి ఇవతలకి వచ్చిన ముస్లింలని పది కొరడా దెబ్బలు కొట్టమని రాజావారు శాసించారు," అన్నాడు.

రహీం ఒక్క క్షణం అందరికేసి చూసి, పడవ దిగాడు. కొరడాతో నిలబడి ఉన్న వీరిగాడ్ని






## సినిమా

(సి. హెచ్. కృష్ణమూర్తి) సమీపించి, "వీరయ్యా! నీ వృత్తి ధర్మం నీది. కానియ్, వీరయ్యా!" అన్నాడు.

వీరయ్య వచ్చి, రహీం కాళ్ళకు నమస్కరించి, "బాబుగారూ, సెమించండి," అంటూ కొరడా ఎత్తాడు.

మల్లయ్య (సాక్షి రంగారావు) ముందుకొచ్చి, "రేయ్, వీరిగా! ఆగు! రహీంబాబుని కొడ్తావంట్రా? కాళ్ళూ సేతులూ పడిపోతాయ్‌రా, దరిద్రపెదవా! ఇట్టా రహీంబాబు వచ్చాడని యెళ్ళి దొరవారికి సెప్పు. ఆయనే లోనికి రమ్మంటారు," అన్నాడు

పకీరు గొంతు సవరించుకొని, "వస్తున్న రహీంని చూసే రాజావారు అలా ఆజ్ఞాపించారని చెప్పండి, శాస్త్రిగారూ!" అన్నాడు

మల్లయ్య ఆవేశంతో "లేదు. నేన్నమ్మను మీరంతా రహీంబాబు మీద కత్తిగట్టి మాట్లాడుతున్నారు. దొరగారింతగా మారిపోయారంటే నేన్నమ్మను," అన్నాడు.

రహీం ప్రశాంత వదనంతో "మల్లయ్యా, తప్పుచేసే బిడ్డని తండ్రి కొడతాడు దానికి కారణం ద్వేషం కాదయ్యా! దొరవారి దృష్టిలో నేను తప్పు చేశాను. అందుకే దండిస్తున్నారు... వీరయ్యా!" అంటూ ఒంగాడు. వీరిగాడు పది దెబ్బలు కొట్టాడు. బాధను బిగబట్టుకుంటూ, "ఈ నేలమీద నేను అడుగుపెట్టినందుకే ఈ దండన అయితే — శిక్ష అనుభవించాను. గనుక, ఇక ఎన్ని అడుగులు నడిచినా పర్వాలేదనుకుంటాను. మీరనుమతిస్తే, ఒక్కసారి దొరవారి దర్శనం చేసుకుంటాను," అన్నాడు.

"కాని... ఇది..." అని అంటూన్న శాస్త్రిని ఓ వ్యక్తి దూరంగా తోసి, రహీంకి దారి ఇచ్చాడు. రహీం మెల్లగా దొరవారి బంగళాకు బయలుదేరాడు.

జంధ్యాల రచన, దర్శకత్వం వహించిన "నెలవంక" చిత్రం త్వరలో విడుదలవబోతోంది.












## మాలవ కళా చిత్ర

''మా పిక్చర్‌లో రోహిణి హీరోయిన్,'' అన్నారు కథకుడు, నిర్మాత ఖాసిం. పై సంస్థ తొలి చిత్రానికి లోగడ ''నోము, పుట్టినిల్లు—మెట్టినిల్లు'' చిత్రాలకు దర్శకత్వం నెఱపిన పట్టు డైరెక్టరు అక్టోబర్ 1న తొలి గీతం ధ్వనిముద్రితమైంది. వేటూరి, సి. నారాయరెడ్డి గీతాలకు సత్యం స్వరకర్త. ఎన్. ఆర్. నంది సంభాషణలు, రాజగోపాల్ ఛాయ, కందస్వామి కూర్పు, జి. రఘునాథరెడ్డి సహకార దర్శకత్వం నిర్వహిస్తారు..



'రాముడు కాదు కృష్ణుడు'లో అక్కినేని నాగేశ్వరరావు

---

## డాక్టరుగారి కోడలు

''శివాజీగణేశన్ కొడుకుగా శరత్‌బాబు, కోడలుగా సరిత, శరత్ ప్రేయసిగా మేనక ఈ చిత్రంలో పాత్రధారులు,'' అన్నారు కౌసల్య. ఈమె నిర్మించే కౌసల్యా పిక్చర్స్ పై చిత్రానికి మాటలు, పాటలు రాజశ్రీ రాశారు. ఎం. ఎస్. విశ్వనాథం, బి. గోపాలం సంగీత దర్శకులు. బి. అంజిరెడ్డి నిర్వహణలో వి. శ్రీనివాస్ దర్శకుడు.

## లంకెల బిందెలు

''ఫస్ట్ సాంగ్‌ను అక్టోబర్ 7న రికార్డు చేశాం,'' అన్నారు కామారి రంజిత్‌కుమార్. ఈయన రంజిత్ క్రియేషన్స్ పతాకంలో నిర్మించే పై చిత్రంలో కృష్ణ, జయసుధ, రావుగోపాలరావు, సత్యనారాయణ, గిరిబాబు, గుమ్మడి, అల్లు రామలింగయ్య, కవిత, శుభ, నూతనప్రసాద్, సారధి, సుత్తి వీరభద్రరావు, నిర్మల, ఝాన్సి, రావి కొండలరావు తెర ముందు— డి. వి నరసరాజు, వేటూరి, రాజన్—నాగేంద్ర, లక్ష్మణ్‌గోరే, తోట తరణి, ఆదుర్తి హరనాథ్ తెర వెనుక కృషి చేస్తున్నారు. విజయనిర్మల స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో బాలకృష్ణ





# ప్రగతికి సోపానం ప్రధానమంత్రి ఇరవై సూత్రాల నూతనపథకం

## కుటుంబ సంక్షేమానికి నిరంతరం కృషిచేస్తున్న అగ్రగణ్యరాష్ట్రం ఆంధ్రప్రదేశ్..

జాతి జనుల, కోట్లాది సామాన్య ప్రజల శ్రేయస్సును, అభ్యుదయాన్ని దృష్టిలో పెట్టుకొని ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ఇరవై సూత్రాల నూతన కార్యక్రమాన్ని ప్రకటించారు—

ఆర్థిక, సామాజిక రంగాలలో సర్వతోముఖ వికాస సాధనకు ఈ కార్యక్రమం శక్తివంతమైన ఆయుధం—

"ప్రజా ఉద్యమంగా స్వచ్ఛంద ప్రాతిపదిక మీద కుటుంబ నియంత్రణకు ప్రోత్సాహం" ప్రధాని కార్యక్రమంలోని 13వ సూత్రం

"ప్రాథమిక ఆరోగ్య సదుపాయాలు, కుష్టు, క్షయ, అంధత్వ నివారణ, చికిత్సా సదుపాయాలు గణనీయంగా పెంచడం" ప్రధాని కార్యక్రమంలోని 14వ సూత్రం.

"స్త్రీ, శిశుసంక్షేమ కార్యక్రమాలు, ముఖ్యంగా గిరిజన, వెనుకబడ్డ ప్రాంతాలలోని గర్భిణీ స్త్రీలకు, బాలింతలకు, పౌష్టికాహార కార్యక్రమాన్ని ఉధృత పరచడం" ప్రధాని కార్యక్రమంలోని 15వ సూత్రం

ఈ మూడు సూత్రాలు కుటుంబ సంక్షేమానికి, కుటుంబంలో ఆరోగ్యానికి, ఆనందానికి, సామాజిక సౌభాగ్యానికి మార్గదర్శకాలు.

కుటుంబ నియంత్రణ, కుటుంబ సంక్షేమ రంగాలలో కుష్టు, అంధత్వం, క్షయ వ్యాధుల నిరోధంలో ఆంధ్రప్రదేశ్ అగ్రగామిగా పురోగమిస్తున్నది.

ఈ కార్యక్రమ నిర్వహణకు, కుటుంబ నియంత్రణ కుటుంబ సంక్షేమ సౌకర్యాలను మారుమూల సామాన్యులకు సైతం వారి వాకిటి వద్ద అందు




బాటులోకి తీసుకురావడానికి మన రాష్ట్రంలోని గ్రామీణ ప్రాంతాలలో 421 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలున్నాయి; 4,472 ఉపకేంద్రా లున్నాయి. ప్రతి 5వేల జనాభాకు ఒక ఉపకేంద్రం స్థాపించడానికి చర్యలు తీసుకోబడుతున్నాయి.

తాలూకా ఆసుపత్రులే గాక, జిల్లా ఆసుపత్రులు, వైద్యశాలలు, పట్టణ కుటుంబ సంక్షేమ కేంద్రాలు, ప్రత్యేక శిబిరాలు గూడా ఈ సదుపాయాలను కల్పిస్తున్నాయి. ప్రసవానంతరం కుటుంబ సంక్షేమ కార్యక్రమం పెద్ద ఎత్తున అమలు జరుగుతున్నది.

1981-82వ సంవత్సరంలో మన రాష్ట్రంలో 2,89,120 కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సలు జరిగాయి. 1965లో ఈ కార్యక్రమం ప్రారంభమైనప్పటినుంచీ ఇప్పటి వరకూ మన రాష్ట్రంలో మొత్తం 37,95,095 కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సలు జరిగాయి. సంతానోత్పత్తి దశలో ఉన్న మొత్తం 92.33 లక్షల దంపతులలో 26.84 శాతం దంపతులకు సంతాన నిరోధానికి వివిధ పద్ధతుల ద్వారా రక్షణ కల్పించ బడింది. కుటుంబ నియంత్రణ కార్యక్రమం ఫలితంగా మన రాష్ట్రంలో 35.24 లక్షల జననాలు నిరోధించ బడ్డాయి. ఈ ఆర్థిక సంవత్సరంలో 4,09,800 శస్త్రచికిత్సలు జరపాలన్నది మన లక్ష్యం

కుటుంబ నియంత్రణ ప్రజాఉద్యమంగా రూపొందాలని ప్రధానమంత్రి పిలుపు ఇచ్చారు. ఈ పిలుపుకి అనుగుణంగా ఈ కార్యక్రమంలో ప్రజా ప్రతినిధుల స్వచ్ఛంద సేవా కార్యకర్తల భాగస్వామ్యం, సహకారంకోసం శిక్షణ శిబిరాలు నిర్వహించడం జరుగుతున్నది. ఈ శిబిరాలలో ప్రజా ప్రతినిధులు స్వచ్ఛంద కార్యకర్తలు ఉత్సాహంతో పాల్గొంటున్నారు.

క్షయ, పోలియో, ధనుర్వాతం, డిఫ్తీరియా, కోరింత దగ్గు, అంధత్వ వ్యాధుల నిరోధానికి, రక్తహీనత నివారణకి, పోషకాహార లోపాన్ని తీర్చడానికి లక్షలాది పసిపిల్లలకు సదుపాయాలు కల్పించబడుతున్నాయి. గర్భిణీ స్త్రీల, తల్లుల పోషకాహార లోపాన్ని తీర్చే సౌకర్యాలు కల్పించబడుతున్నాయి.

**ప్రధానమంత్రి సూత్రాల**
**పసిడి బాటలో పయనిస్తూ**
**కుటుంబ సంక్షేమానికి**
**నిరంతరం కృషిచేస్తున్న**
**అగ్రగణ్యరాష్ట్రం ఆంధ్రప్రదేశ్...**





**రాష్ట్ర కుటుంబ సంక్షేమ విభాగం సుల్తాన్ బజార్, హైదరాబాదు.**



# నీలాకాశం

సీరియల్ — శ్యామల



డెస్క్‌పైన కాగితాలు పెట్టుకొని, పని మొదలు పెట్టింది ఇందిర. తెలియనివి అడిగి తెలుసుకుంటూ, మైకేల్ ఇచ్చిన పని సక్రమంగా అర్థం చేసుకుంది. తక్కిన వాళ్ళు కొంతసేపు పనిచేస్తూ, మధ్యలో కబుర్లాడుతూ, ఒక్కోసారి వాళ్ళ బాస్‌ల వద్దకు వెళ్తూ, ఆ గదిలోని ఫోన్‌కి జవాబులిస్తూ ఉన్నారు. ఇందిరకు బెంకుపోయి, కాస్సేపటికే ఫ్రీగా అనిపించింది.

పదకొండు గంటలకు మైకేల్ వచ్చాడు ఇందిర వద్దకు. "మిస్ ఇందిరా, ఇది 'కాఫీ బ్రేక్ టైమ్.' మీరు వెళ్ళి కాఫీ త్రాగిరండి. 'కాఫీ షాప్' అని బోర్డు వుంది చూడండి, అక్కడ మీ ఐడెంటిటీ కార్డు చూపిస్తే ఫ్రీ సర్వీస్ లభిస్తుంది. ఇదిగో మీ అప్పాయింట్‌మెంట్ ఆర్డరు, ఐడెంటిటీ కార్డు" అన్నాడు.

"థాంక్స్" అంది ఇందిర.

తర్వాత ప్రక్క సీట్లో కూర్చున్న నీలిమను అడిగింది "మీరూ వస్తారా ?" అని.

టైపు చేస్తున్న కాగితాల పైనుంచి దృష్టి మరల్చకుండానే "నాకు పని చాలా వుంది ఇందిరా! ఇక్కడికే కాఫీ తెప్పించుకుంటాను. మీరు వెళ్ళిరండి. హోటల్ చూసినట్లు ఉంటుంది" అంది నీలిమ.

ఇందిర 'కాఫీ షాప్' అన్న బోర్డు ఉన్న హాల్లోకి ప్రవేశించింది. ఆ హాల్లో లైటింగ్ డిమ్‌గా ఉంది. బ్యాక్‌గ్రౌండ్‌లో సన్నగా వాద్య సంగీతం వినవస్తున్నది. నీలం రంగులో సోఫాలు, గుండ్రని బల్లలు వున్నాయి అక్కడక్కడా. కొద్దిగా జనం ఉన్నారు. ఇందిరకు బెరుగ్గా ఉంది. వెళ్ళి మూలమున్న సోఫాలో కూర్చుంది. తెల్లని యూనిఫారమ్ ధరించిన వెయిటర్ వచ్చాడు దగ్గరకు. చేతిలోని ఐడెంటిటీ కార్డు చూపించింది. "వెల్‌కమ్ టు అవర్ హోటల్. ఈ రోజేనా మీరు చేరింది ?" అని స్వచ్ఛమైన ఇంగ్లీషులో అన్నాడు.

ఇందిరకు ఆశ్చర్యం అనిపించింది. "అవును, ఈ రోజే చేరాను" అంది.

"ఏం తీసుకుంటారు? కాఫీ, టీ, చాకొలెట్?"

"టీ తీసుకుంటాను" అంది ఇందిర.

ఐదు నిమిషాల్లో ట్రేలో టీ పాట్‌లో డికాషన్, విడిగా కప్పులో చక్కెర, పాలు, ప్లేట్‌లో బిస్కట్స్ తీసుకొని వచ్చాడు.

"థాంక్స్" అంది ఇందిర. వెళ్ళిపోయాడు. ఇదెక్కడి హోటల్ ? టీ అంటే ఇంత హంగామా ఏమిటి ?

కప్‌లోకి డికాషన్ వంచి, పాలుపోసి, చక్కెర కలిపింది. కమ్మని టీ వాసనతో నిండింది గాలి. ఎవరు కనిపెట్టారో టీ ఆకులతో ఈ విధంగా డ్రింక్ చేయటం ?

## (గత సంచిక తరువాయి)

ఎవరో వచ్చారు లోపలికి. ఇందిర ఉరికే తలెత్తి చూసింది. కొన్ని సెకన్లు ఇందిర వైపే చూసి, తర్వాత గుర్తించినట్లు చిరునవ్వుతో ఆమె వద్దకు వచ్చాడు. నిన్న సాయంత్రం కార్లో తనకు లిఫ్టు ఇచ్చిన డాక్టర్ జాక్సన్ !

"హలో, లిటిల్ గర్ల్, హౌ డు యు డు ?" అని వచ్చి ఎదురుగా కూర్చున్నాడు. "ఈ రోజే చేరావామ్మా జాబ్‌లో ?"

"అవునండీ!"

వెయిటర్ ఆయనకు కాఫీ తీసుకువచ్చి యిచ్చాడు. ఇందిర బిస్కట్స్ ప్లేట్ ఆయనవైపు పెడుతూ "తీసుకోండి" అంది.

"వద్దమ్మా" అని "నీ పేరేమిటన్నావు, ఇందిర కదూ ? ఎలా ఉంది ఉద్యోగం ఇందిరా ?"

"బాగున్నదండీ! కాకపోతే నాకు ఇటువంటి పరిసరాలు అలవాటులేక కాస్త బెరుగ్గా ఉంది."

ఆయన నవ్వాడు. "జీవితంలో ఎన్నో రకాల పరిసరాలలో మసలవలసి వస్తుంది. ఎన్నో రకాల అనుభవాలు ఎదురవుతాయి. భయపడితే ఎలా ?" ఆదరంగా అన్నాడు.

కాఫీ కప్పు పట్టుకొని ఉన్న అతని చేతివేలికి బంగారు ఉంగరం — సాదా 'బాండ్' వంటిది ఉన్నది. ఇందిర దృష్టి అప్రయత్నంగా దానిపైన పడింది. విదేశీయులు వివాహ సమయంలో ఇటువంటి ఉంగరాలే మార్చుకుంటారుట. నాన్న వేలికి ఇటువంటిదే ఉండేది. ఓ మారు అమ్మ, నాన్న కలిసి మద్రాస్ వెళ్తే అక్కడ సరదాపడి అమ్మ కొని యిచ్చిందిట. వాళ్ళ జీవితాలలో అటువంటి సరదాలు ఎన్నెన్నో! జీవితం అంటే ఇలా ఉండాలి - అన్నట్లుగా గడిపేశారు. ఏ జబ్బుతోను తీసుకోకుండా, ఏ బాధలూ పడకుండా రాలిపోయారు కూడా — చెట్టునుండి పూలు రాలినట్లే. . ఇందిరకు మనసంతా భారమయింది.

**జరిగిన కథ — 4** ఆ రోజు రామారావ్ సుభద్రల సిల్వర్‌జూబిలీ సెలిబ్రేషన్స్‌కి అన్ని ఏర్పాట్లు చేస్తారు వారి సంతానం ఇందిర, రమేష్, సురేష్, ఉష. దానిలో భాగంగా రామారావ్, సుభద్రలను సినిమాకి పంపుతారు పిల్లలు. సినిమా చూసి స్కూటర్‌మీద వస్తూ యాక్సిడెంట్‌లో మరణిస్తారు ఆ దంపతులు. మధుతో ఇందిర పెళ్లి గతంలోనే ఖాయం చేయడం జరుగుతుంది. తన తమ్ముళ్ళ, చెల్లి భవిష్యత్తు తీర్చిదిద్దడానికి మధుకి యిష్టం లేకపోయినా ఉద్యోగంలో చేరాలనుకుంటుంది ఇందిర. తన స్నేహితురాలు నీల సహాయంతో ఓ ఫైవ్ స్టార్ హోటల్లో టెంపరరీ పోస్ట్‌లో ఇందిర టైపిస్ట్‌గా చేరుతుంది. తన కుటుంబాన్ని పైకి తీసుకువచ్చేవరకు ఆగమని ఇందిర ఎన్ని విధాల నచ్చజెప్పినా వినని మధు ఆమెతో తెగతెంపులు చేసుకోవడానికే నిశ్చయించుకొంటాడు.

మాట్లాడుతున్నట్లే ఉండి, సడెన్‌గా పరధ్యానంగా అయిపోయిన ఇందిరను విస్మయంగా చూశాడు జాక్సన్. ఆయనకు ఇందిరను చూడగానే మొదటిసారే స్నేహభావం, వాత్సల్యం కలిగాయి ఆ అమ్మాయి ముఖంలో ఏదో కార్యదీక్ష, మరేదో గూడు కట్టుకున్న బాధ కూడా చదివాడాయన. చనువుగా అడిగాడు "ఎందుకమ్మా బాధపడుతున్నావు? చెప్పకుంటే కొంత రిలీఫ్‌గా ఉంటుందేమో..."

ఆయన మృదువైన స్వరానికి కరిగిపోయినట్లే అయింది ఇందిర. నిబ్బరించుకొని "ఏమీ లేదండీ నాకు టైమయింది, వెళ్తాను" అని లేచి నిలుచుంది

లంచ్ టైము వరకు టైపు చేస్తూనే ఉంది ఇందిర. నీలిమ, మేరీ, రాణి — అక్కడ పనిచేసే ఇతర యువతులు — వాళ్ళతో కలిసి డైనింగ్‌హాల్‌కి వెళ్ళింది.

"ఎలా ఉంది మా హోటల్ ?" అడిగింది రాణి.

"హోటల్ కేం, చాలా బాగుంది !" అంది ఇందిర.

"వర్క్ ఎలా ఉంది ?" అడిగింది మేరీ గులాబీ రంగు స్కర్ట్, బ్లౌజు వేసుకొని స్టైలిష్‌గా, అందంగా ఉంది.

"పని క్రొత్త కదా! మైకేల్‌గారిని అడిగి తెలుసుకుంటూ చేస్తున్నాను."

"మైకేల్ చాలా మంచి వ్యక్తి. నేను కొన్నాళ్ళు అతని దగ్గర వర్క్ చేశాను" అంది రాణి.

"జీతం విషయం ఎలా ఉన్నా, ఇక్కడ సర్వ్ చేసే ఫుడ్ కోసమయినా ఈ హోటల్‌లోనే పని చేయాలి" అంది నీలిమ సూప్ చప్పరిస్తూ.

"వాచ్ యువర్ వెయిట్!" అంది రాణి. నీలిమ స్లీవ్‌లెస్ బ్లౌజు వేసుకొని ఉన్నది. చేతులు తెల్లగా, కాస్త లావుగా కనిపిస్తున్నాయి.

వాళ్ళందరిముందు తనేదో పాతకాలం అమ్మాయిలాగా ఉన్నట్టనిపించింది ఇందిరకి. ముందుకి పడివున్న జడను యథాలాపంగా వెనక్కు వేసుకుంది.

"నీ హెయిర్ చాలా అందంగా ఉంది" మెచ్చుకుంది మేరీ.

"ఏమంత పొడుగు కాదుగా!" అంది ఇందిర.

"పొడుగు కాకపోతే ఏం ? నల్లగా, ఒత్తుగా, నొక్కులుగా ఉంది ! ఎంత మృదువుగా ఉన్నదో" ముట్టుకొని చూస్తూ అంది మేరీ.

"మీ జుట్టు సహజంగానే నొక్కులుగా ఉందా ఇందిరా, లేకపోతే హెయిర్‌డ్రెస్సర్ వద్ద చేయించారా ?" అడిగింది నీలిమ.

ఇందిర నవ్వింది. "హెయిర్ డ్రస్సర్స్ లేడీస్‌కి ఉంటారని విన్నాను కాని ఎన్నడూ చూడలేదు సహజమైన నొక్కులే ఇవి!"

తర్వాత సంభాషణ షెషన్ల మీదికి మళ్ళింది.

లంచ్ తీసుకుని వచ్చాక పని నేర్చుకుంటూ, చేస్తూ గడిపింది సాయంత్రం వరకు. అయిదు గంటలకు నీలిమ "వెళ్దామా ఇంక?" అని అడిగింది.

ఇందిర వెళ్ళి మైకేల్‌కి చెప్పి వచ్చింది.

"హోటల్ వెనకాల చూశారా మీరు? గార్డెన్ చాలా బాగుంటుంది... చూడలేదా? రండి తీసుకు వెళ్తాను" అని తీసుకు వెళ్ళింది నీలిమ.

హోటల్ వెనుకనున్న పూలతోట నిజంగానే చాలా అందంగా ఉంది. రకరకాల పూల మొక్కలు, లాన్స్, లతలు అల్లుకొన్న ఆర్చీలు— చాలా బాగుంది అక్కడే స్విమ్మింగ్ పూల్ కూడా ఉంది. కొంత మంది స్విమ్ సూట్స్‌లో ఈతలు కొడుతున్నారు, మరి కొంతమంది పూల్ దగ్గర్లో నున్న కుర్చీలలో పడుకొని ఉన్నారు. అటుగా వస్తున్న డాక్టర్ జాక్సన్‌ని చూపించి అడిగింది ఇందిర, "నీలిమా, ఆయన మీకు తెలుసా?"

"డాక్టర్ జాక్సన్ తెలియకపోవటమేమిటి? ఈ హోటల్‌లో ప్రతి ఒక్కరికీ తెలుసు ఆయన. రెండు, మూడు నెలలకు ఒకసారయినా హైదరాబాదు వస్తారాయన. వచ్చినప్పుడల్లా ఇక్కడే దిగుతారు. మా హోటల్ మేనేజర్, ఆయన మంచి స్నేహితులు."

"ఆయన ఏ దేశస్థుడు? మన దేశంలో ఏమిటి చేస్తున్నారు?" అడగకుండా ఉండలేక పోయింది ఇందిర.

"ఆయన ఐర్లాండు నించి దాదాపు పాతికేళ్ళ క్రితం ఇండియా వచ్చారుట. ఆయన డాక్టరుగా అప్పటికే ఐర్లాండులో ప్రాక్టీస్ చేస్తున్నారు. క్లినిక్‌ని మరొక డాక్టరుకి అప్పగించి, పెళ్ళిచేసుకొని, హనీమూన్‌కి భార్యను తీసుకొని చాలా దేశాలు తిరుగుతూ ఇండియా వచ్చారుట. ఆయన ఇండియాలో ఉన్న కొద్ది రోజుల్లో ఏం జరిగిందో,



# శ్వాస - చిరునవ్వులా

డా॥ పి. నారాయణరెడ్డి

ప్రయత్నించాను
శ్వాసను పట్టుకోవాలని
బుజ్జగింపుల వలలు విసిరి.
చేపపిల్ల కాదు శ్వాస
ఎరలకు లొంగడానికి.
అది తిరుగుతూనే వుంటుంది
అనులా.

రెండు చేతుల్నీ ప్రయోగించాను
పిడికిళ్లతో పట్టుకోవాలని.
ఉరిమిందనలేనుగానీ
మెరిసింది శ్వాస
వలల్నీ చేతుల వలయాల్నీ
పరిహసిస్తూ —
పెదవి వేదికమీద ఎగరేసిన
ఉదయం చిరునవ్వులా.

## నీలాకాశం

ఏమిటి ఆయనను చలింపజేసిందో నాకు సరిగా తెలియదు కాని, ఆయన, భార్య ఇక్కడే స్థిరనివాసం ఏర్పరచుకోవటానికి నిశ్చయించుకున్నారు. కొంత కాలం మిషన్ హాస్పిటల్స్‌లో పని చేశారు. తర్వాత ఆంధ్రదేశంలోని ఒక చిన్న పల్లెటూరిలో హాస్పిటల్ పెట్టి, ఆ చుట్టుప్రక్కల ఉన్న పల్లెలన్నిటికి వైద్య సహాయం చేస్తున్నారు. పెద్దవాడయినా, ఎంతో హుషారుగా ఉంటారు! మందులకి, ఏవో సామాన్లకి ఈ సిటీకి అప్పుడప్పుడు వస్తూ ఉంటారు" చెప్పింది నీలిమ.

ఆశ్చర్యంగా విన్నది ఇందిర. "ఇక్కడినించి అందరూ విదేశాలకు వెళ్ళాలని ఉబలాట పడుతుంటే, ఈయన అక్కడినించి వచ్చేసి మన పల్లెటూరిలో ఉంటున్నారన్నమాట!"

"ఆ గ్రామంలో ప్రజలు ఈయనను దేవుడి లాగే చూస్తారుట! తెలుగు కూడా బాగానే మాట్లాడుతారు, కొంత ఇంగ్లీష్ యాస ఉన్నా!"

"ఆయన భార్య ఎలా ఉంటుందో ?"

"ఆవిడ ఇండియా వచ్చిన అయిదారేళ్ళకి చనిపోయిందిట."

స్విమ్మింగ్ పూల్‌లో ఈదుతున్న డాక్టర్ జాక్సన్‌ని చూసింది ఇందిర. వయస్సులో పెద్ద వాడైనా ధృఢంగా, ఆరోగ్యంగా ఉన్నాడాయన భార్య పోయాక కూడా, ఒంటరిగా ఈ పరాయి దేశంలో ఎందుకు ఉండిపోయాడో! ? ఏ బలమైన శక్తి ఆయనను ఇక్కడ ఉండిపోయేటట్లు చేసిందో ? ఒకరి బ్రతుకు ఎంత కష్టం! ఈ నిస్వార్థ జీవితంలో ఆయన ఎన్ని కష్టాలు, బాధలు, నిరాశలు ఎదుర్కొన్నాడో? ఎన్నిమార్లు వైద్య సహాయం ఇతరులకి అందించి తృప్తి, ఆనందం పొందాడో ? ఆసక్తితో ఆయననే చూస్తున్న ఇందిరతో "ఇంక వెళ్దాం" అంది నీలిమ.

సాయంత్రం గ్రాండ్‌గా ఉన్న ఆ హోటల్‌నించి ఇంటికి వచ్చేసరికి, ఏమిటో ఇల్లు మరీ చిన్నదిగా, సింపుల్‌గా కనిపించింది. ముందు గదిలో సామాన్యమైన పేము కుర్చీలు, మధ్యలో గుండ్రని బల్ల, కార్పెట్ లేని నేల — ఎంతో సాధారణంగా ఉంది. ఉత్సాహంగా ఎదురువచ్చిన ఉషను ముద్దుపెట్టుకొని లోపలికి వెళ్ళింది.

"పని ఎట్లా ఉందమ్మా ? అలసిపోయావా ? కాఫీ ఇస్తాను ఉండు" అంది అమ్మమ్మ ఆప్యాయంగా.

పెరట్లో చెట్లకు నీళ్ళు పోస్తున్న రమేష్ లోపలికి వచ్చి "హలో, సిస్" అంటూ చేతిలోని రెండు గులాబీ పూలను ఒకటి అక్కకి, ఒకటి ఉషకి యిచ్చాడు.

'ఈ అనురాగాలకి మించినది ఏముంది ?' అంది ఇందిర మనసు. ఇల్లు అతి సామాన్యమైనదయితేనేమి, ఇది హోమ్, స్వీట్ హోమ్!

# లక్షలకొద్దీ చిరునవ్వులు

ఈ ఉత్పత్తి శక్తిని రెండింతలు కావించేందుకై మద్రాసు రిఫైనరీని మరింత వైశాల్యం చేసే నిర్మాణం ఇప్పుడు కొనసాగుతూంది.

1984వ సంవత్సరం ఆఖరులోగా రిఫైనరీ వారు తమ వంట గ్యాసు ఉత్పత్తిని మూడింతలు చేసి లక్షలకొద్దీ గృహిణుల చిరునవ్వులకి దోహదం చేస్తారు.




**మద్రాసు రిఫైనరీ లిమిటెడ్**

జాతీయ లక్ష్య సాధనకై నడుంకట్టుకున్నది.

మొదటి సంపాదన అది. సంతోషంతోపాటు కాస్త గర్వమూ కలిగింది. ఇట్లాగే, ఇంకా... ఇంకా... డబ్బు సంపాదించి తమ్ముళ్ళని, చెల్లిని పెద్ద చేయాలి, అని మరోసారి అనుకుంది.

ఇంకొక పది రోజుల్లో ఈ ఉద్యోగం సమాప్తం అవుతుంది. తర్వాత ఏమిటి ? — అనే ప్రశ్న వచ్చి ఎదురుగా నిల్చొని భయపెడ్తున్నది. జీతం కవరు హాండ్‌బాగ్‌లో పెట్టుకొని, వచ్చి సీటులో కూర్చుంది. టైప్ చేస్తుంటే ఆ డబ్బుతో జరగవలసిన అవసరాలన్నీ గుర్తు రాసాగాయి. ఈ ఉద్యోగం అయిపోయాక ఏం చేయాలి ? కనీసం మరొక టెంపరరీ జాబ్ అయినా దొరికితే బాగుండును !

మైకేల్‌ని కలుసుకున్నపుడు అడిగింది, "ఈ నెల పదవ తేదీకి వీణ వచ్చేస్తుంది కదా, ఇక్కడ నా జాబ్ అయిపోతుంది. మరొక జాబ్ ఏదైనా సహాయం చేయగలరా ?"

"ఈ హోటల్‌లో ప్రస్తుతం ఖాళీలు ఏమీ లేవు మిస్ ఇందిరా ! ఉంటే మిమ్మల్ని తీసుకోమని తప్పకుండా రికమెండ్ చేసేవాడిని."

"మీకు తెలిసినవాళ్ళు ఎవరికయినా చెప్పి మరెక్కడయినా ఇప్పించగలరేమోనని —"

"ప్రయత్నిస్తాను" అన్నాడతను.

థాంక్స్ చెప్పి తిరిగి పనిలో పడింది ఇందిర.

*　　*　　*

ఆ సాయంత్రం ఇంటికి వచ్చేసరికి ఉష పడుకొని ఉంది. "దీనికి మళ్ళీ జ్వరం వచ్చింది. ఇందూ !" అంది అమ్మమ్మ.

ఉషకి ఈమధ్య తరచు జ్వరం వస్తున్నది. పగలు మామూలుగా బడికి వెళ్ళివస్తున్నా, సాయంత్రానికి నీరసంగా వాడిపోయి, ఇంటికి వస్తూనే పడుకుంటున్నది. రాత్రిళ్ళు ఒళ్ళు వెచ్చగా తోస్తున్నది అమ్మ, నాన్న పైన దిగులు- అని సరిపెట్టుకున్నారు అందరూ. అమ్మమ్మ చిట్కా వైద్యాలు ఏమీ పని చేయటం లేదు.

లోపల గదిలో మంచంమీద పడుకొని ఉంది ఉష. అమ్మ, నాన్నగార్ల బెడ్‌రూమ్. ఆ గదిలోకి వెళ్ళగానే ఎందుకో మనసంతా బరువయి పోతుంది ఇందిరకి. చిన్నగా వెళ్ళి ఉష ప్రక్కనే కూర్చుంది.

"ఉషా, ఏమిటమ్మా ? ఎలా ఉంది ?" అని అడిగింది. ఉష ముఖంలో వెనకటి నేవళం లేదు, కళ్ళు లోతుకు పోయాయి అనుకుంది.

ఉష కళ్ళు విప్పి చూసింది. "ఏమిటో బాగా లేదక్కా ! జ్వరం వచ్చినట్లుంది."

"లేమరి, డాక్టరు దగ్గరకు వెళ్దాం."

"డాక్టరు దగ్గరగా ? అమ్మమ్మ కషాయం కాచి యిచ్చింది."

"కషాయాలు పని చేయటం లేదు కదా ! ఒకసారి డాక్టరు చూస్తే మంచిది."

"డాక్టరు ఇంజక్షన్స్ ఇస్తారేమో !"

"ఇవ్వరేమోలే, చూద్దాం పద" బీరువాలో నించి వేరే గౌను తొడిగింది. తల దువ్వి. అమ్మమ్మకి చెప్పి రిక్షాలో ఉషని ఫామిలీ డాక్టరు వద్దకు తీసుకు వెళ్ళింది.

ఆ డాక్టరు, ఇందిర తండ్రి రామారావుకి స్నేహితుడు. తల్లితండ్రులను అకస్మాత్తుగా పోగొట్టుకున్న ఆ పిల్లలను చూస్తే ఆయనకి జాలి

"ఏమ్మా, ఇలా వచ్చారు ?" పలకరికంచాడు.

"ఉషకి జ్వరం వస్తున్నదండీ" అని చెప్పింది ఇందిర.

## నీ లా కా శ ం

ooooooooooooooooooooooooooooooo

## తాటాకు చప్పుళ్ళు !

దేశంనిండా 'నలుపు' తాండవిస్తోంది
తిమిర తిమింగిలం నోట కాపురముంటూ
వెలుగు పండుగెందుకు ? ఈ ధండుగెందుకు ?
నయనానందకరంగా నాయక సింహాల చిందులు
ఎన్నికల వాగ్దానాల షడ్రసోపేతమైన విందులు
ఇంకా ప్రత్యేకమైన తీపి వంటకాలెందుకు ?
కనీసావసరాలకు నూనె లభ్యం కావడంలేదు
'స్నేహ జ్యోతుల్ని' ఎలా వెలిగిస్తావు ?
మీసాలకు సంపెంగనూనె డాబులెందుకు ?
ధరలు ఆకసాన్నంటుతున్నాయి
పరువు బరువు 'ఆరువు'కి చాలడంలేదు
తారాజువ్వలు నింగికి విసిరే పరదాలెందుకు ?
నేలనిండా లక్షల నరకాసుర వారసులు
ప్రజానీకాన్ని అష్టకష్టాల పాల్జేస్తున్నారు
ఎప్పుడో చచ్చిన నరకుడి కోసం తాటాకు (టపాసుల)
చప్పుళ్ళెందుకు ?

— 'పైడిపాల'

ooooooooooooooooooooooooooooooo




టెంపరేచర్ చూసి, స్టెతస్కోపుతో పరీక్షించి, కొన్ని ప్రశ్నలు అడిగాడు ఆయన. తర్వాత "ఎక్స్—రే తీయించమ్మా. రేపు ప్రొద్దునే ఈ అడ్రస్‌కి తీసుకు వెళ్ళు" చీటీ రాసి యిచ్చాడు.

"ఎక్స్—రే ఎందుకండీ? ఏమి జ్వరం అనుకుంటున్నారు?" ఆత్రంగా అడిగింది ఇందిర.

"ఎక్స్—రే చూసి కాని నేనేం చెప్పలేనమ్మా! కంప్లెయింట్ ఏదయిన్నప్పటికీ, అన్నిటికీ మందులు ఉన్నాయి ఈ రోజుల్లో. ఏం భయం లేదు" అని చెప్పి పంపించాడు.

"ప్రతిదానికీ అన్ని పరీక్షలు చేయించటం

## నీలాకాశం

ఇప్పుడు మామూలు" అంది ఇందిర నవ్వుతూ చెల్లితో. మనసులో మాత్రం భయంగా, కంగారుగా ఉంది.

మర్నాడు ఆదివారం. అయినా ఎక్స్—రే క్లినిక్ తెరిచే ఉంటుంది. రమేష్, సురేష్ కలిసి ఉషని తీసుకువెళ్ళారు. ఆలోచనలతో వేడెక్కిపోతున్నది ఇందిర మనస్సు. ఏదయినా పనిచేస్తే కాని మనసుకు కుదురు ఉండదనిపించింది. బీరువా తీసి బట్టలు సర్దటం మొదలుపెట్టింది. తనివి, ఉషవి సర్ది పెట్టేశాక, అమ్మ చీరలు పెట్టుకొనే అర వైపు చూసింది. మెల్లిగా పైన ఉన్న చీర చేతిలోకి తీసుకుంది. మబ్బురంగు జరీచీర తన పెళ్ళిచూపుల రోజున, అంటే మధు, అతని తల్లితండ్రులు మొదటిసారిగా తమ యింటికి వచ్చిన రోజున, అమ్మ ఈ చీరే కట్టుకుంది. ఆవిడకి తనంత కూతురు ఉందా — అని చూసేవాళ్ళు ఆశ్చర్యపోయేటంత లేతగా కనిపించేది ఆ చీరలో. ఓ మారు అమ్మ, తను సినిమాకి వెళ్ళుతుంటే ఓ క్లాస్‌మేట్ కనిపించి "మీ అక్కయ్యా?" అని అడిగింది. ఈ చీరతో ఎన్ని స్మృతులు ముడిపడి ఉన్నాయి! 'కాలేజ్ డే'న తను డ్రామాలో నటిస్తే చూడటానికి ఈ చీరే కట్టుకొని వచ్చింది అమ్మ. తను స్టేజీ పైన అందుకున్న ప్రైజు అమ్మకి చూపిస్తుంటే, ఆవిడ కళ్ళలో ఎంత గర్వం! ఎంత సంతోషం!! అప్పట్లో తనకు కాలేజీ — చదువు — ఆటలు — పాటలు — పోటీలు — ప్రైజులు — ఇదే లోకం! మధు ప్రవేశించాక మరిన్ని రంగులతో వెలిగిపోయింది మానసవీధి. బ్రతుకే ఓ బంగారు కల అన్నట్లు గడిపింది కాలాన్ని. ఇప్పుడు... ఇప్పుడు... కళ్ళ వెంట కారుతున్న నీరు తుడుచుకోవాలని స్పృహ అయినా లేకుండా, అమ్మ చీర ఒళ్ళో పెట్టుకొని కూర్చున్న ఇందిర తలుపు చప్పుడవటంతో ఉలిక్కిపడింది. ఉష, రమేష్ వాళ్ళు వచ్చి ఉంటారు! తనే యిలా ఉంటే ఆ చిన్నవాళ్ళు ఏమయిపోతారు? చటుక్కున లేచి గది తలుపు లోపల గడియ పెట్టింది. చీర బీరువాలో పెట్టేసి, కళ్ళు తుడుచుకొని, కాస్త పౌడర్ అద్దుకొని, ఆపైన బయటకు వచ్చింది.

(ఇంకా వుంది)

స్కూలులో ఆరు గంటలు కష్టపడి చదవటం
తరువాత ఆటలు, ఆ తరువాత ఇంటికి వచ్చాకా
మళ్ళీ 2 గంటలు హోంవర్కు.



# ఈరోజుల్లో పిల్లల జీవితాలు కూడా కఠినంగా తయారయ్యాయి.

అందుచేత మీ పిల్లలకు ఉత్తమ మైనవి
లభించాలి.
దీనికోసమే వారికోసం తయారైంది బూస్ట్.
మీ పిల్లలకు ఉదయమే ఒక కప్పు
రుచికరమైన బూస్ట్ ఇవ్వండి. రోజంతా
అత్యంత ఉత్సాహంగా, చురుగ్గా పని
చేసేందుకు కావలసిన శక్తి ఇంధనం వారికి
లభిస్తుంది. ఎందుచేత నంటే, బూస్ట్ అతి
నాణ్యమైన పదార్థాల మేలిమితో నిండి ఉంది-
మీగడ పాలు, గోధుమ, బార్లీమాల్ట్,
కోకో.
ఉత్తమ మైనవి ఎన్నడూ చవకగా
దొరకవు. బూస్ట్ కూడా అంతే.
కాని మీరు ఖర్చు తక్కువని










**చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం**

HTD-HMM-7233AA






బులుసు వేంకటరమణయ్య

# శత్రువును జయించుట?

ఇరుగు పొరుగు దేశాలకు పరస్పరం విరోధం కలగడానికి ముఖ్య కారణం దురాక్రమణ. ఎవరు దురాక్రమణ జరిపినదీ నిర్ణయించడం చాలా విషయాల్లో సాధ్యం కాకపోవచ్చు. ఇరుపక్షాలవారూ, తమదే న్యాయమని వాదించడం సర్వ సాధారణం. పరస్పరం శత్రుత్వం ఏర్పడుతుంది. ఆ శత్రువును సాధించడానికి పెక్కు యుద్ధ సాధనాలు ఉపయోగించవలసి వస్తుంది. ఇక — జయాపజయాలు సులభంగా తేలవు. ఏళ్ల [illegible]బడి యీ మారణహోమం సాగుతునే ఉంటుంది.

అయితే — ఈ శత్రుత్వాన్ని నశింపజేసి, పరస్పరమైత్రి నెలకొల్పడానికి సులభమైన మార్గం ఉంది. అది అంతః శత్రువిజయం!

మనుష్యుణ్ణి బాధించే శత్రువులు రెండు విధాలు. (1) బాహ్య శత్రువులు. (2) అంతశ్శత్రువులు. అంతశ్శత్రువులు మానవుని హృదయంలోనే వుండేవి. వాటికి రూపంలేదు. అవి కామ — క్రోధ — లోభ — మోహ — మద — మాత్సర్యాలు ఆరు అని ప్రఖ్యాతి పొందాయి. బహిశ్శత్రువులు "ఇంట గెలిచి రచ్చ గెలవా"లని లోకంలో సామెత ప్రసిద్ధంగా ఉన్నది. మనలో ఉండే శత్రువులను మొదట జయించాలి — అంటే అరిషడ్వర్గమైన కామక్రోధాదులకు మనం లొంగిపోకూడదు. వాటికి మనం లొంగకుండా ఉంటే అవే మనకు లొంగిపోతాయి. వాటిని మనం జయించినట్లయితే, బహిశ్శత్రువులు ఎంత పగపూనినా ఏమీ చెయ్యలేరు. వారి శత్రుత్వం క్షీణిస్తుంది. ఎదుటివారు తనమీదికి విజృంభించినప్పుడు తాను ప్రతిక్రియకు పూనుకోకుండా తూష్ణీం భావం వహించి ఉంటే, ఎదుటివాడు శాంతి పొందుతాడు. "ఊరకుండువాని కూరెల్ల నోపదు" అనే లోకోక్తి ఉండనే ఉన్నది. చెత్త, చెదారం వుంటే దానిని నిప్పు మండింపజేస్తుంది. అంతేకాని బూడిద పోకను మండింప చేయలేదు. ఆ నిప్పు తనంతటనే ఆరిపోతుంది. శత్రువు పట్ల సహనం వహించినట్లయితే — శత్రుత్వం చల్లారిపోతుంది. వెంటనే కాకపోయినా క్రమంగానయినా మైత్రి ఏర్పడడానికి ఎంతో అవకాశం వుంది.

దీనినిబట్టి మనం మన విరోధిని సాధించాలంటే మొదట మనలో ఇమిడియున్న దుర్గుణాలనే శత్రువులను మొదట చంపుకోవాలి. అలా చేస్తే బయటి శత్రువులను జయించడం ఎంతో సులభమవుతుంది. ★

---




● దీపావళి కథల పోటీలో రు.600 బహుమతి పొందిన కథ ●

ఆ పిట్ట మళ్ళీ వచ్చింది!

"హయ్యో!" అంటూ విసుగ్గా ముఖం చిట్లించింది వసుంధరమ్మ. దీని పోరు పడలేను బాబూ అన్నట్లు మూతి విరిచింది.

అందమైన చిన్న పిట్ట! చిక్కిపోయిందేమో మరీ నాజూగ్గా కూడా ఉంది. నేల మీద చతికిలబడి చేటలోని బియ్యంలో రాళ్లు, వడ్లగింజలు ఏరుతున్న వసుంధరమ్మ ముందు వాలి, కిచకిచ లాడుతోంది. అందంగా, తీయగా కాదు.... జాలిగా, దయనీయంగా.

వసుంధరమ్మ ఏరి పారేసిన వడ్ల గింజల్ని అది తినటం లేదు. ఆ వడ్ల గింజల్ని తినటానికి దానికి అభ్యంతరాలేమీ లేవు. పూరి హక్కు వుంది.

వసుంధరమ్మ ఆ హక్కు ఎప్పుడో ఇచ్చి వుంది. హక్కు వుంది; ఎదుట వడ్లగింజలూ వున్నాయి; తినటానికి దానికి నోరూ, ఆకలీ కూడా వున్నాయి. అయినా అది తినటం లేదు! కిచికిచమంటూ అరుస్తోంది దీనంగా, జాలి జాలిగా.

వసుంధరమ్మ విసుగ్గా మరి గుప్పెడు బియ్యం గింజలు దాని ముందు వేయబోయి, మళ్ళీ ఆగి చేటలోనే పడేసుకుంది.

"ఎందుకూ దండగ! తింటుందా పెడుంగా"

పిట్ట అరుస్తూనే వుంది.

"దీని నోరు పడ, బాకాలాగా ఇంత లావు నోరు పెట్టుకుందిగానీ భాషేమిటో తెలిసి చావదు కదా! గింజలేస్తే తినదు. మళ్ళీ అరుస్తుంది. ఛీ ఛీ పాడు గోల" అని సణుక్కుంటూ చేటతో విసురుగా చెరగ సాగింది.

ఆ విసురుకు అది ఒక్క గెంతు దూరంగా గెంతి మళ్ళీ వసుంధరమ్మ చెరగటం ఆపే దాకా పిచ్చి గోల చేసింది. వసుంధరమ్మ చెవులు గంగిర్లెత్తిపోయి చెరగటం ఆపు జేసింది.

పిట్టగోల కొంత తగ్గింది

ఆమె కళ్ళలోకి చూస్తూ మళ్ళీ జాలిగా, జాలి జాలువారగా... కిచ కిచ... కిచ కిచ!



ఆ ఇంట్లో వసుంధరమ్మా, ఆమె భర్త రంగారావుగారూ మాత్రం వుంటారు. పెద్ద కొడుకు కృష్ణ మద్రాసులో ఇంజనీర్‌గా వుంటున్నాడు, తర్వాతది ఆడపిల్ల మాలతి. పెళ్ళయి అత్తవారింట్లో వుంది. చివరి సంతానం మళ్ళీ అబ్బాయి. హైదరాబాదులో 'లా' చదువుతున్నాడు మోహన్. పిల్లలు అడపా దడపా వచ్చి వెళ్ళినా ఇంట్లో వుండేది మాత్రం ఆ ఇద్దరే. రంగారావుగారు రిటైర్డ్ తాసీల్దారు సొంత ఇల్లు కట్టుకుని భార్యతో ప్రశాంతంగా కాలం గడుపుతున్నారు.

పిల్లల్లేని ఇల్లూ, వుండేది తామిద్దరే కాబట్టి వసుంధరమ్మకు పెద్దగా పనేమీ వుండదు. ఉన్న కొద్దిపాటి పనీ తొందరేమీ లేకుండా తీరిగ్గా, మామూలుగా చేసుకుంటూ వుంటుంది.

బియ్యం బస్తా తేగానే పని మనిషి చేసి పోసినా వసుంధరమ్మకు తృప్తిగా వుండదు. ప్రతిరోజూ రెండు గ్లాసుల బియ్యం చేటలో పోసుకుని, వసారాలో చతికిలబడి తీరుబాటుగా గింజ గింజా ఏరుకుని గానీ ఎసట్లో పోసుకోదు. అదిగో, ఆ అలవాటుతోనే మొదలయింది అసలు కథ!

ఒకరోజు అలాంటి సమయంలోనే ఎక్కడి నుండి వచ్చాయో రెండు పిట్టలు (పిచ్చుకలు) ఒకటి ఆడదీ, మరొకటి మగదీ వచ్చి చేట ముందు వారి అంతవరకూ ఏరి పడేసిన వడ్ల గింజల్ని కిచకిచలాడూ, ఏరుకు తినసాగాయి. తన పిల్లల్ని గురించి ఆలోచించుకుంటూ బియ్యం ఏరుతూన్న వసుంధరమ్మ తన ప్రశాంతతకు భంగం కలిగినట్టుగా "హుష్" అంటూ పైట చెరుగుతో వాటిని అదిలించింది. రెండు కాళ్ళూ ఒకేసారి లేపి గమ్మత్‌గా ఎగిరి దూరంగా వెళ్ళినా మరు క్షణం మళ్ళీ వచ్చి వాలాయి. పడిన గింజను పడినట్టు మిషన్ కంటే వేగంగా, నైపుణ్యంగా ముక్కుతో ఒలుచుకుని తినేస్తున్నాయి. మళ్ళీ అదిలించింది వసుంధరమ్మ. బుర్రుమని ఎగిరి దూరంగా వెళ్ళి పడ్డాయి.

తల వంచుకుని మళ్ళీ రెండు వడ్లగింజలు ఏరిపడేసింది ఆమె. మళ్ళీ వచ్చి వాలాయి పిట్టలు.

మళ్ళీ తోలటం!
మళ్ళీ వాలటం!!
ఇదే తంతు!!!

ఇలాగే మూడురోజులు గడిచిపోయాయి.

## నీ గుండె కార్చిన కన్నీళ్ళు

కూతుర్ని చూడడానికి వెళ్ళిన రంగారావుగారు ఆ రోజు తెల్లవారు ఝామున తిరిగి వచ్చారు.

ఉదయం పది గంటలకు రంగారావుగారు వసారాలో పడక్కుర్చీలో ఆరాంగా కూర్చుని పేపర్ పట్టుకున్నారు. వసుంధరమ్మ చేటలో బియ్యం పోసుకుని భర్తకు దగ్గిరగా నేలమీద చతికిల బడింది.

బియ్యాన్ని వేళ్ళతో అటూ ఇటూ కదుపుతూ "అమ్మాయి విశేషాలేం చెప్పారు కాదు" అంది.

"అమ్మాయికేం దివ్యంగా వుంది. 'అమ్మను కూడా తీసుకువస్తే బావుండేది నాన్నా' అంది" అన్నారు రంగారావుగారు పేపర్ మడుస్తూ.

"అలా అందా! నా తల్లి!" అంది వసుంధరమ్మ సంబరంగా.

"లేదు. నేనే అంటున్నాను" అన్నారు నవ్వుతూ.

ఉడుకున్నట్టుగా నొసలు చిట్లిస్తూ "సర్లేండి. ఈ వయసులో గూడాను సరసాలు! ఇంతకూ అల్లుడుగారెలా వున్నారు? అమ్మాయిని పండగకు పంపుతారటనా?" అని అడిగింది.

"వాళ్ళకు శలవులేవో కలిసి వస్తాయట. కాశ్మీర్ ట్రిప్ వేసుకోవాలనే ఆలోచనలో వున్నట్టున్నారు. బలవంతం చేస్తే కాదనరనుకో. కానీ మన సంతోషం కోసం వాళ్ళ సరదాల్ని పాడు చేయటమెందుకు? వెళ్ళిరానీ. అబ్బాయిలు వస్తారు కదా"

"పెద్దబ్బాయి కాన్ఫరెన్సుకేదో వెళ్ళాలని రాసినట్టున్నాడు కదండీ" అంది వసుంధరమ్మ కొంచెం నిరాశగా.

"పెద్దవాడు కాకపోతే చిన్నవాడు. వాడూ రాకపోతే మనిద్దరం. నీకు నేనూ నాకు నీవూ.. ఎంత సరదాగా వుంటుందనీ!" కొంటెగా చూశారు రంగారావుగారు

"మనిద్దరమా! బాగుంది సంబరం!" మూతి తిప్పింది.

"ఏం? ఎందుకు బాగుండదు? మర్చిపోయావా మన పెళ్ళయిన కొత్తలో మీ అన్నయ్య పండగకు పిలవడానికొస్తే పండగ మనిద్దరమే చేసుకోవాలని ముచ్చటపడి, నీవేమో మైలపడ్డానంటు ఝూలన చాప పరిచావు నేనేమో క్యాంపు కెళ్ళాలంటూ సూట్‌కేస్ సర్దుకున్నాను. అప్పుడు మీ అన్నయ్య "అయ్యో మా చెల్లాయికి భోజన మెలా మరి? ఈ మూడు రోజులూ నేను వుండిపోతాను లెండి బావగారూ" అంటూ మడుగు కట్టుకోబోవటం, కథ అడ్డం తిరగడంతో మనం కంగారు పడిపోవటం, అంతలో మా పిన్ని కూతురు రావటం, 'మా చెల్లాయి భోజనాని కిబ్బంది లేద'ని మీ అన్నయ్య సంతోషపడి వూరికి బయలుదేరటం, ఆ తర్వాత మా చెల్లాయిని పంపేయటానికి మనం అవస్థపడటం..."

వసుంధరమ్మ సిగ్గుపడిపోయింది.

"మరిప్పుడు ఆ అవకాశం వచ్చినా దిగులు పడ్తావేం?"

"చాల్లెండి, వయసు ముదిరినా ..." ముసి ముసి నవ్వులు నవ్వింది వసుంధరమ్మ.

"ఏ వయసయితేనేం వసుంధరా? మనం భార్యాభర్తలం. అంతే" అంటూ చిలిపిగా నవ్వారు.

వసుంధరమ్మ హృదయం వయసుతో సంబంధం లేకుండా పులకించిపోయింది.

"మరిక్కడి విశేషాలేమిటి?

### సంగీతచికిత్సలో కోర్సులు!

పశ్చిమజర్మనీలోని హీడిల్‌బర్గ్‌లో సంగీత చికిత్సలో కోర్సులను ప్రవేశ పెడుతున్నారు. మానసిక వైఫల్యాలకు సంగీత చికిత్స ఉత్తమమని ఇదివరకే నిరూపింపబడింది. సంగీత చికిత్సలో కోర్సులను ప్రవేశ పెట్టడం ఇదే ప్రథమం. మానసిక వైఫల్యాలు, నరాల బలహీనత, మత్తుమందులకు అలవాటు పడటం, చిన్న పిల్లల్లో పెరుగుదల తగ్గిపోవటం వంటి విపరీతాలను సంగీత చికిత్స తోడ్పడగలదు. ఈ కోర్సులో చేరే వారు సంగీత విద్వాంసులు కానక్కర్లేదు. అయితే సంగీతం గురించి కొంత తెలియాలి ఇది నాలుగు సంవత్సరాల కోర్సు. సంగీత చికిత్సతో పాటు, సైకాలజీ, వైద్యం మొదలైనవి కూడా ఈ కోర్సులో బోధిస్తారు.



## నీ గుండె కార్చిన కన్నీళ్లు

రోజులుగా వున్నాళ్లో లేనుగా ?'' అన్నారు రంగారావుగారు.

అంతలో పిట్టలు కిచకిచలాడుతూ చేట ముందు వాలాయి.

''ఇదిగో ఇదీ విశేషం. చేట ముందు పెట్టుకోనివ్వవు. వెధవ గోల. ప్రాణాలు తినేస్తున్నాయి''

నవ్వారాయన. పిట్టల్ని ముచ్చటగా చూస్తూ ''అవి నీకు అవసరం లేక పడేసిన వడ్లగింజల్ని తింటున్నాయిగానీ నీ ప్రాణా లెక్కడ తింటున్నాయి ?'' అన్నారు.

''ప్రాణాలంటే ఏకంగా ప్రాణాలే తినెయ్యాలేమిటి ! వాటి గోల చాలు ''

''పక్షుల కలకూజితాలలో సామగానం వినిపిస్తుందంటారు. గోల అంటావేమిటి ! చక్కగా వాటి భాషలో మాట్లాడుకుంటూ భోజనం చేస్తున్నాయి. నీ కొచ్చిన నష్టమేమిటి ?'' అంటూ ఒంగి చేటలోని బియ్యం గుప్పెడు అందుకుని, వాటి ముందు పడేశారు.

ఇంకాస్త ముందుకు వచ్చి ఆ పిట్టలు రెండూ ధైర్యంగా తినసాగాయి.

వసుంధరమ్మ చోద్యంగా చూస్తూ వుండిపోయింది.

మధ్య మధ్య విసుక్కుంటున్నా వసుంధరమ్మకు తను వడ్లగింజలు ఏరి పడేయటం, సమయానికి పిట్టలు వచ్చి వాలి వాటిని ఏరుకుని తినటం, వాటిని గమనిస్తూ బియ్యం ఏరటం వసుంధరమ్మకు నిత్యకృత్యాల్లో ఒకటై పోయింది సమయానికి ఇంట్లో వుంటే రంగారావుగారు కూడా ఆ కార్యక్రమంలో పాలు పంచుకోవటం, ఇద్దరూ పిట్టల గురించి నాలుగు పిట్ట మాటలు చెప్పుకుని సంబర పడటం, సరదా పుడ్తే మరి గుప్పెడు గింజల్ని వెదజల్లడం..

హఠాత్తుగా ఓ రోజు ఒక్క పిట్టే వచ్చింది.

'ఇంకో పిట్టేమయింది స్మీ !' అనుకుంది వసుంధరమ్మ

వచ్చిన పిట్ట నోరు తెరవలేదు. కిచ కిచ లాడలేదు. మౌనంగా, దిగాలుగా చేట ముందు వాలింది. జాలి గొలిపేలా వసుంధరమ్మ కళ్లలోకి చూసింది.

వసుంధరమ్మ ఆశ్చర్యంగా చూసింది.

దీని గొంతేమయింది ! ?

అరవదేం ! ?

మొత్తుకోదేం ! ?

తినదేం ! ?

అసలింకో పిట్టేమయింది ?

పిట్ట చాలాసేపు అలా కూర్చుని లేచి పోయింది.

'దీనికేమిటో వచ్చింది' అని నిట్టూర్చింది వసుంధరమ్మ.

పిట్ట మరునాడు వచ్చింది.

ఒక్కటే !

కోల్పోయిన స్వప్నంలోంచి అప్పుడే కోలుకున్న దానిలా కీచుగా చిన్నగా కిచకిచలాడింది.

గింజలు తినలేదు.

వెళ్ళిపోయింది.

పిట్ట మూడోనాడూ వచ్చింది.

దాని కేకలు పెరిగాయి దాని చూపుల్లో భావాలు పెరిగాయి. వసుంధరమ్మ కేసి చూస్తూ... నా భావాలు అర్థం కావటం లేదా అన్నట్లు చూస్తూ... నా భాషైనా అర్థం కాదా అన్నట్లు అరుస్తూ...

గింజలు తినకుండానే ఎగిరిపోయింది పిట్ట !

ఆ రోజు భర్తతో చెప్పింది వసుంధరమ్మ,

"పిట్టల్లో ఒకటి రావటం లేదండీ. రెండోది వచ్చినా గింజ ముట్టడం లేదు. మొదటి రోజు మౌనంగా కూర్చుని వెళ్ళిపోయింది నాకేమీ అర్థం కాలేదు రెండో రోజు కొంచెం అరిచింది. వెళ్ళిపోయింది. ఎందుకో ఎవరికి తెలుసు ఆ మర్నాటి నుంచీ ఒకటే అరుపు గోల పిచ్చిగోల ఏమిటో బాబూ నాకేమీ అర్థం కావటం లేదు. ఇంతకూ ఆ మగపిట్ట ఏమయినట్లు ?"

"పిల్లో, కాకో పట్టి తినేసి వుంటుంది పాపం" అన్నారు ఆయన బాధగా.

వసుంధరమ్మకూ చాలా బాధ కలిగింది.

'అయ్యో! పాపం! ఎంత పని జరిగిందీ!' అనుకుంది ఆవేదనగా

"మరి అదిపోతే దీనికేమండీ ? లక్షణంగా తిని వుండక వ్రతం పట్టుకు కూర్చుంది. ఇలా అయితే ఇది పిల్లో కాకో తినకుండానే గుటుక్కుమంటుంది".

రంగారావుగారు ఏమీ అనలేదు. బాధగా, ఆలోచనగా తల పంకించారు. అంతే.

*　　*　　*

పిట్ట వస్తూనే వుంది.

వసుంధరమ్మ మాటల్లో వెధవగోల, సంతగోల చేస్తూనే వుంది. ఎక్కడ తింటుందో, తినకపోతే దానికా శక్తి ఎక్కడి నుంచి వస్తుందో గింజ మాత్రం ముట్టదు.

ఆమె కళ్ళలోకి చూస్తూ, ఆమె చెవుల్లో సొదపెడుతూ... గోల గోల !

వసుంధరమ్మకు క్రమంగా దాని గోలతో ముచ్చట, జాలి, బాధ అన్నీ నశించిపోయి విసుగెత్తి పోయింది

ఏమిటి దీని గోల ! జత పిట్టపోతే దీనికేమిటిట? ఆ పిట్టతోనే పుట్టిందా? ఆ పిట్ట వెంటే పెరిగిందా ? కళ్ళెగుట గింజలున్నాయి తినొచ్చుగా ? ఊహూ. దీని సర్వస్వం పోయినట్లు, వెధవ పోజు ఈ ప్రపంచంలో ఎవరికెవరు ! అవసరార్థం ఎన్నో బంధాలు, అనుబంధాలు. అంతవరకే. అంత మాత్రాన పోయిన దానితో జీవితమే పోతుందా ? లేదే ! ఈ మాత్రం అర్థం కాదా పిచ్చి మొద్దుకు ! నిజమే. అవి రెండు ఎంతో అన్యోన్యంగా వుండేవి. దాంపత్య సుఖాన్ని అనుభవించేవి. అయితే మాత్రం పోయిన దాని కోసం ఇంత గోలా ? ఇన్ని అరుపులా ! అయినా వేలెడులేని ఈ పిట్ట ముండకు కామ దాహం కాస్త అధికంగానే వున్నట్లుంది బాబూ ! సుఖమిచ్చే జత పిట్ట పోయే సరికి — ఓ — తెగ గింజుకుంటోంది ! ఛీ ఛీ ! సుఖం కోసం తపన పడ్తోందిగానీ తన ప్రాణమే పోయేది తెలుసుకోవటం లేదు అవివేకపు పక్షి ! అయినా అంత పులకుంటే మరో పిట్టను చూసుకోవచ్చు కదా ?

వసుంధరమ్మ రకరకాలుగా ఆలోచిస్తోంది. తన ఆలోచనల్ని భర్తకు చెబుతుంది. ఆయన ఏమీ అనరు. 'నీకిప్పుడర్థం కాదు' అంటారు. అంతే ఆమె కదీ అర్థం కాదు. పిట్ట అర్చరికి విసుక్కుంటుంది. చెంగుతో, చేతితో తరుముతుంది. దానిలోని వాంఛలకు విడ్డూర పడుతుంది. అసహ్యించుకుంటుంది. దాని పీడ వదిలించుకుందామని రకరకాల ప్రయత్నాలు చేస్తుంది.

అయినా పిట్ట వస్తూనే వుంది

చూస్తూనే వుంది.

అరుస్తూనే వుంది

ఆ భావాలకు భాష, ఆ భాషకు అర్థమూ తెలిస్తే... !

## 2

మద్రాసు నుంచి వాళ్ళ పెద్దబ్బాయి కృష్ణ ఉత్తరం రాసాడు, పెద్ద పండగ సందర్భంగా. తల్లిదండ్రులను అక్కడికే రమ్మనీ, చెల్లాయీ, తమ్ముడూ అక్కడికే వస్తున్నారనీ

ఎక్కడో ఓ చోట అందరూ కలుసుకోవటమే వాళ్ళకు కావలసింది కాబట్టి వెళ్ళ






డానికే నిశ్చయించుకున్నారు.

పండగ ఇంకా మూడు రోజులు వుండగానే బెర్తులు రిజర్వు చేయించుకుని ప్రయాణం అయ్యారు.

రాక రాక తమున్న చోటుకు వచ్చిన తల్లి దండ్రుల్ని ప్రేమ మీర గౌరవించాడు కృష్ణ కొడుకుకు తగిన ఇల్లాలు కోడలు ఇద్దరు మనవలూ చంక దిగలేదు తల్లి దండ్రుల దగ్గర ఇంకా చిన్నతనం పోని కూతురు, చిన్న కొడుకు వాళ్ళిద్దరితో పోటీ పడ్డారు

పిల్లలతో పండుగ, దాంపత్య జీవితంలోని మాధుర్యపు తారస్థాయిని రుచి చూపింది. భార్య భర్తలిద్దరూ ఓపలేని ఆనందభారంతో సోలిపోయారు.

వారం రోజులూ పండుగే అయింది

"మీరిద్దరే అక్కడ వుండి ఏం చేస్తారు నాన్నగారూ పిల్లలతో కాలక్షేపంగా వుంటుంది ఇక్కడే వుండిపోండి" అన్నాడు, కృష్ణ పండుగ సందర్భంగా వాళ్ళు పొందిన తృప్తి వాళ్ళను అంగీకరింప జేస్తుందనే ఆశతో ?

"లేదు కృష్ణా ఈ రోజు ఇక్కడ లభించిన ఆనందంత' రేపూ వుండిపోవాలని ఆశ పడటం అవివేకం ఎవరు ఎక్కడ వుండాలో అక్కడే వుండాలి. రేపే ప్రయాణం" అన్నారు రంగారావుగారు

అన్నట్టుగానే మరునాటికి ఆయన ప్రయాణానికి ఏర్పాట్లు జరిగాయి, శాశ్వతమైన పయాణానికి !

ఆ రాత్రి హఠాత్తుగా రంగారావుగారికి గుండెపోటు వచ్చింది చూస్తూ వుండగానే ఆయన శరీరపు గూటిలోంచి పిట్ట ఎగిరి పోయింది !

భౌతిక కాయాన్ని సొంతవూరికి చేర్చాలనే ఆలోచన వచ్చినా చాలా దూరాభారం కావటం, ఆయన కంటిపాపలనదగిన వాళ్ళంతా చెంతనే వుండటం కారణంగా మద్రాసులోనే అంత్య క్రియలు ముగించారు

వసుంధరమ్మ నిశ్చేష్ట అయింది నిర్విణ్ణ అయింది. ఆమె చైతన్యమంతా ఆయనతోనే పోయినట్లు స్థబ్దురాలయింది,

ఇదేమిటి ! ఇదేమిటి ! ఏం జరిగింది ! ఏం జరిగింది ! ఏమిటో, ఏం జరిగిందో కూడా ఆమెకర్థం కావటం లేదు

తన చూపులకు గమ్యమై, తన మాట లకు శబ్దమై, తన హృదయానికి జీవమై

# నీ గుండె కార్చిన కన్నీళ్ళు

తన ఉనికికే అర్థమైన ఆయన ఎక్కడికి ... ఎక్కడికి వెళ్ళినట్లు ! ?!

శ్రుతి లయల్లా, రాగ తాళాల్లా జీవన సంగీతానికే అందం అయిన తామిద్దరిలో ఒకరు . ఒకరు ఏమయినట్లు ! ? !

రెండు శరీరాలను ఒక్క మనో మంజూషలో బంధించుకుని ఊపిరి సలపని ఆ వుక్కిరి బిక్కిరిలో తీయనైన బాధను, ఓపలేని హాయిని అనుభవిస్తూన్న తమను ఎవరు ... ఎవరు విడదీసినట్లు ! ? !

తామిద్దరి మధ్య నున్న ఈ ప్రేమకు, అనుబంధానికి ఆలంబన ఏమిటి ? పిల్లలా ? కాదు పిల్లలు తనతోనే వున్నారు డబ్బా ? ఊహూ డబ్బూ తనకే వదలి వెళ్ళారు మరి కామమా ? కాదు కాదు ఆయన వెన్నెముకకు వాలుగేళ్ళ కితం దెబ్బ తగిలి తామిద్దరి మధ్యా ఆ ప్రసక్తే లేకుండా పోయింది మరి తామిద్దరి మనసులనూ కలుపుతూన్న, శరీరాలు దూరమై మరింతగా మనసుల ముడి బిగుసుకుంటూన్న ఆ కారణం ఏమిటి ?

ఔను ! రెండు ఆత్మల సంగమం !

రెండు మనసుల ఐక్య చిద్విలాసం ! !

రెండు జీవితాలకు ఒకే బాటను వేసిన పవిత్ర బంధం ! ! !

## కొత్త టైపు మిషను !

పశ్చిమ జర్మనీలోని ట్రయంఫ్ – అడ్లెర్ కంపెనీవారు కొత్తరకం టైపు మిషన్ను తయారుచేశారు. దీనిని రెండు భాగాలుగా, కీబోర్డును కేరేజీని విడ దీయవచ్చు దీనిని ఎస్. ఐ 1040 మోడల్ అని పిలుస్తారు. దీనివలన టైపిస్టుకు మరో సౌకర్యం కూడా లభిస్తుంది టైపుచేయ వలసిన వాక్యాలన్నీ ఒక తెర పై కనిపిస్తుంటాయి. అందువలన అవసరమైతే సవరణలు చేసుకోడాని వీలవుతుంది. దీనిని హానోవర్ లోని ప్రదర్శనలో ప్రదర్శించారు.

పిల్లల సహకారంతో, ఓదార్పుతో, ప్రేమాభిమానాలతో మౌనంలోంచీ, మగత లోంచీ కొంత బయటకు వచ్చినా వసుంధరమ్మ చూపు, మాట, ఆలోచన, కదలిక సర్వస్వం రంగారావుగారి స్మృతిని ...కి పెట్టుకునే వున్నాయి కనిపించని వుయ్యాలా రంగారావుగారు తన జ్ఞాపకాల పరిమళాలమ ఆమె మనోనాశిక కందిస్తూనే వున్నారు

వసుంధరమ్మ రోజుల తరబడి స్నానం చేయదు. తల దువ్వుకోదు అన్నం తినదు. పగలే చీకట్లు కమ్మినట్టు, పౌర్ణమినాడు అమవస ముసిరినట్లు, పూలు ముళ్ళయి పోయినట్లు, తేనె విషంగా మారినట్లు గుండె కోసే భావన, వేదన ! చుట్టూ, ఇందరున్నా ఆమెను భయంకరమైన ఒంటరితనం వెంటాడసాగింది; వేటాడసాగింది

నవ్వుతుంది ఏడుస్తుంది. ఒకోసారి పిచ్చిగా కేకలు పెడుతుంది

స్వామీ ! మీ రెక్కడికి వెళ్ళారు ? నా జీవితాన్నే మీరు తీసుకు వెళ్తే నేనేం జీవించను ?

నా కంటిపాప మీ మూర్తి నంటుకుని వెళ్ళిపోయిందే, నేనేం చూడను ?

నా నవ్వులు మీ మెడను హారంగా ధరించి నడిచివెళ్ళారే, నే నెలా నవ్వను ?

నా చైతన్యం మీ పాదాలను కౌగిలించుకుని వెళ్ళిపోయింది. ఈ బండను ఇక కదిలించే దేది ?

నా ఆశ మీతోపాటు సమాధి అయింది. ఆశ లేక మనిషి లేడే లేని నేను ఇంకా వున్నానా ? లేను ... లేను ప్రభూ

మిమ్మల్ని ఆ కటిక మట్టి నేలలో సమాధి చేశారు అయ్యో ! నే నెంత పాపిష్ఠిదాన్ని ! నా గుండె చీల్చి దాని లోపల మిమ్మల్ని సమాధి చేసుకోలేకపోయాను. అప్పుడు ... మీ రెప్పుడూ నాలోనే, నాతోనే వుండేవారు. అయినా ఇంకా .. ఇంకా నాకు గుండె వుందంటారా ? లేదు లేదు మీ ప్రాణాలోనే అది ఎగిరి పోయింది మీ దేహంతోనే అది ఛిదమై పోయింది నా కళ్ళలో కరిగి కన్నీరై పోయింది ఆవిరై మేఘాల్లో కలిసిపోయింది. ఒట్టి కళ్ళే మిగిలింది ! కళ్ళెకి కన్నీళ్ళేమిటి ! కలత లేమిటి ! ఎందు కింత బాధ ! ఏమిటింత వేదన ! ఎవరిదీ శోధన !

ఊహూ. నాకు మరుపైనా కావాలి.



# రైతుల పాలిటి కల్పతరువు
# రామగుండం యూరియా




ఆంధ్రప్రదేశ్‌లో తయారు చేయబడుతున్న
యూరియా, రామగుండం యూరియా.
అన్ని పంటలకు, అన్ని కాలములకు అనువైన ఎరువు.

వాడండి
రామగుండం యూరియా.

**స్వస్తిక్ బ్రాండ్**
**యూరియా**




**ది ఫెర్టిలైజర్ కార్పొరేషన్**
**ఆఫ్ ఇండియా లిమిటెడ్**
అమ్మకపు విభాగము
6-2-30/C, లకిడి కా పూల్,
హైదరాబాదు-500 004.



## నీ గుండె కార్చిన కన్నీళ్లు

మరణమైనా కావాలి ఏదో ఒకటి కావాలి. అంతే అంతే. అంతే

"అమ్మా అమ్మా" పిల్లలు ఆదర్శాగా పిలిచే పిలుపు

తల్లి ఆవేదన నిండిన చూపు.

* * *

రెణ్ణెల్ల తర్వాత కొడుకు వద్దన్నా వసుంధరమ్మ పట్టుబట్టి సొంత వూరికి వచ్చేసింది "ఆయన చెప్పారుగా కృష్ణా. ఎక్కడికి వెళ్ళవలసిన వాళ్లు అక్కడికే వెళ్ళాలి ఎక్కుండుండ వలసిన వాళ్ళు అక్కడే వుండాలి" అని అన్నది

కొంత కాలం తోడుగా వుండి వెళ్ళాలని కూతురు, కోడలు కూడా ఆమె వెంట వచ్చారు ఇక్కడికి వచ్చీరాగానే రంగారావుగారి స్మృతులు మరీ అధికం అయ్యాయి వసుంధరమ్మకు. ఇంట్లోని గాలి అంతా ఆయన వూర్పులతోనే నిండివున్న భావన కలిగింది వేదన మిగిలింది

ఉదయం పది గంటలు.

ఆ సమయానికి అలవాటుగా, పరధ్యానగా చేట అందుకుంది రెండు గ్లాసుల బియ్యం పోసుకుని వసారాలో చతికిల బడింది ఆమె చూపు ఎక్కడో వుంది ఆమె మనసు ఎక్కడో వుంది. ఆమె ఆలోచన ఎక్కడో వుంది. వేళ్ళు మాత్రం బియ్యాన్ని గెలుకుతున్నాయి.

"కిచ కిచ ... కిచ కిచ"

పరిచయమైన శబ్దం!

ఉలికి పడి చూసింది వసుంధరమ్మ.

చిన్నారి పిట్ట!

గుండెను కోతపెట్టేంత దైన్యంగావుంది!

హృదయం ద్రవించేంత శల్యావశిష్టమై వుంది!

జాలిగా, జాలిజాలిగా, దీనంగా, దీనాతి దీనంగా వసుంధరమ్మ కళ్ళలోకి చూస్తోంది. కిచకిచమని అరుస్తోంది

వసుంధరమ్మ విసుక్కోలేదు "హుష్" అంటూ అదిలించలేదు. కోపంగా విదిలించలేదు. చీరె చెంగుతో తరిమి కొట్టలేదు. దాని గోల తప్పించుకోవాలని చూడలేదు

నిదానంగా, బాధగా, ఆప్యాయంగా చూసింది, దాని కళ్ళలోని భావాలు అర్థమైన దానిలా, దాని గుండెలోని కన్నీళ్లు తెలిసిన దానిలా!






# జాలి ఖరీదు

పాలడుగు వెంకటేశ్వరావు

శీతాకాలం పొద్దు వాలిపోయింది.

ఫ్యాక్టరీ సైరన్ కూసింది. కార్మికులు బిల బిల మంటూ బయటికి వచ్చివేసారు. వాళ్ళతోపాటు నేనూ వచ్చివేసాను. దగ్గరలోనే వున్న నా గదికి వెళ్ళాను. చన్నీటితో స్నానం చేసాను. ఫ్రెష్‌గా అన్పించింది. ఉతికిన శుభ్రమయిన బట్టలు వేసుకుని, గదికి తాళం వేసి బయటపడ్డాను. ఉషారుగా ఈల వేసుకుంటూ, నది వడ్డుకి షికారు వెళ్ళాను. దూరంగా పట్నపు రణ గొణ ధ్వనులు అస్పష్టంగా వినవస్తున్నాయి. నది వడ్డునే, చెట్ల చాటున, తెల్ల తెల్లగా ఇళ్ళు కన్పడుతున్నాయి. రణ గొణ ధ్వనులకు దూరంగా, ప్రశాంతమయిన వాతావరణంలో స్నిగ్ధంగా రూపు గొని వున్న, ఆ పల్లెటూరి వయిపుగా పశువులు మెల్లిగా మందగతిన సాగి పోతున్నాయి. ఆ పశువుల వెనకాలనే కబుర్లు చెప్పుకుంటూ, కేరుతూ, గంతులు వేస్తూ, పాటలు పాడుతూ, పశువుల కాపరులు నడిచి పోతూ వున్నారు.

అంతలో, చూస్తూ వుండగానే చీకటి పడింది.

చీకటి పడిన తరువాత, ఆ పరిసరాలలో ఒంటరిగా సంచరించటం ఏ వ రి క యి నా

క్షేమంగాదని, ఇటీవల ఆ ప్రాంతాలలో జరిగిన సంఘటనలు ఋజువు చేసాయి.

పదిరోజులనాడు హత్య చేయబడిన ఒక స్త్రీ శవం, ఆ పరిసరాలలో తేలింది వారం రోజుల క్రితం, ఫ్యాక్టరీలో రెండు వర్గాల కార్మికుల మధ్య అక్కడ ఘర్షణలు జరిగి రక్తపాతం అయింది నాలుగురోజుల కిందట, రెండవ ఆట సినిమా చూసి వెళ్తూవున్న ఒక యువకుడ్ని విపరీతంగా కొట్టి, అతని జేబులో వున్న వంద రూపాయలూ, చేతికి వున్న రిస్టువాచీ, లాక్కున్నారు!

రోజులు బాగాలేవు

ఫ్యాక్టరీలో ఆ వాళే జీతాలు ఇచ్చారు. అందులోంచి వందరూపాయలు మా వూళ్లో వుంటున్న నా ముసలి తల్లికి రేపు మనియార్డరు చేయాలి డబ్బు నా గదిలో బీరువాలో భద్రంగానే దాచి పెట్టాను. అయినాసరే. ఒక అనుమానం, ఒక భయం నా మనసులో చోటు చేసుకున్నాయి.

అందువలన, లేచి కాలనీ వయిపు నడువటం మొదలుపెట్టాను పదినిముషాలు నడిచి, రోడ్డు ఎక్కాను రోడు మీద లారీలు బరువుగా మూలుగుతూ, సాగిపోతున్నాయి. చిన్నకార్లు ... దూసుకుపోతున్నాయి.

దూరాన ఎల్లన్నలో వీధిదీపాలు వెలిగాయి, అప్పుడే ... లో వున్న ఫ్యాక్టరీ ఆవరణలోను ఫ్యాక్టరీ కాలనీలో కూడా, దీపాలు వెలిగాయి దూరంగా, నది వడ్డున వున్న ఆ పల్లెటూరులో కూడా దీపాలు వెలిగాయి, నదిలో సాగిపోతూ వున్న పడవల్లోంచి, మినుకు మినుకుమంటూ దీపాలు అవుపిస్తున్నాయి పడవ సరంగులు గొంతెత్తి పదాలు పాడుకుంటున్నారు అంతటా గాఢాంధకారం! కాటుక వంటి వల్లటి చీకటి వాన!!

నాయర్ హోటల్‌లో లాంతరు వెలుగుతూ వుంది. టేబులు దగ్గర నాయరు గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్నాడు ఆ పాకకి నలువయిపులా పెట్టిన తడికలు పెద్ద పెద్ద బొక్కలుపడి జీర్ణావస్థలో వున్నాయి. లోపల్నుంచి మసాలా వాసనలు వచ్చి నోరూరిస్తున్నాయి.

నన్ను చూసి నాయరు చిరునవ్వు నవ్వాడు. వేడి వేడిగా భోజనం వడ్డించాడు. భోజనంచేసి చేయి కడుక్కుని, అక్కడే కూర్చున్నాను. గదికి వెళ్లి నిదపోవటం తప్ప నాకు ఆ పూటకి వేరే పనిలేదు!

నాయరు ఏవో కబుర్లు చెప్తున్నాడు. సొంత గొడవ! ఎక్కడో కొన్ని వందలమైళ్ళ దూరంలో వున్న, కేరళలోని ఒక కుగ్రామంలో, అతని భార్యాపిల్లలూ వుంటున్నారు కడుపు చేతపట్టుకొని, ఇంత దూరం వచ్చాడు. హోటలు పెట్టాడు ఇప్పుడు అతని ఆర్థిక పరిస్థితి బాగానే వున్నది ఇంటికి, నెల నెలా డబ్బు పంపిస్తూ వున్నాడు. భార్యనీ పిల్లల్నీ తెచ్చి తన దగ్గరే వుంచుకోవాలని అతని కోరిక కాని ఆ కోరిక తీరే మార్గమే కనపడటంలేదు. పిల్లలు చదువుకుంటున్నారు. వాళ్ళని ఇక్కడికి తీసుకువస్తే ఆ చదువులు దెబ్బతింటాయి. వాళ్ళ భవిష్యత్తు పాడవుతుంది అందువలన ఆ పని చేయటానికి మనసు వప్పదు. పిల్లల గురించి నాయరు భార్యా అక్కడే వుండక తప్పదు. విచిత్రమయిన అవస్థ.

కాతా దార్లు ఒకరొకరు వచ్చి భోజనం చేసి వెళ్తున్నారు జీతాలు ఆ రోజే అందుకున్నందు వలన ఇవ్వవలసిన డబ్బులు నాయురుకి ఇచ్చి బాకీలు ఫైసలు చేసుకుంటున్నారు రిజిష్టరులో ఒక్కొక్క పేరుకి ఎదురుగా, జమ అయిన ఖాతాలకి పెన్సిలుతో గుర్తు పెట్టుకుంటున్నాడు. డబ్బుని డ్రాయరులో పెట్టి చిన్న గోద్రెజ్ తాళం వేస్తూ— నాతో సంభాషణ కొనసాగిస్తూనే వున్నాడు నాయరు. అతనికావేళ సంతోషంగా వుంది.

నాయురు ఎర్రగా, దృఢంగా, బలంగా వుంటాడు వ్యాయామం చేసిన శరీరం. తెలుగు బాగానే వచ్చును కొద్దిగా మళయాళీ యాస ఆరడుగుల పొడవయిన శరీరం. అతనికి నలభయి నాలుగేళ్ళ వయసుంటుంది. ముక్కుకు సూటిగా మాట్లాడతాడు ఏదీ దాచుకునే తత్వం కాదు. జాలి గుండె దేహీ అని చెయ్యి చాచిన వారికి పది పైసలో, పావలానో ధర్మం చేయటం, ఆకలితో అలమటించి అడిగిన వారికి, ఒక ముద్ద అన్నం అతను స్వయంగా పెట్టటం, నాకు తెలుసు!

చూస్తుండగానే— బాగా ప్రొద్దు పోయింది.

'ఇంక రావలసిన వాళ్ళు కూడా ఎవరూ లేరు!' ఆవలిస్తూ అన్నాడు నాయర్.

నేనూ ఆవలించాను

'అంతే ఇక హోటల్ మూసేస్తావా?' అని అడిగాను, లేచి వెళ్ళిపోదామని వుద్యమిస్తూ నేను.

'లేదులెండి ఇంకో అరగంట ఆగుతాను!' అన్నాడు నాయర్.

'అదేమిటి?! అందరూ వచ్చి వెళ్ళారంటివి గదా!' అన్నాను.

'అవుననుకో కొద్దిగా అన్నమూ,కూరలూ మిగిలిపోయాయి. కొత్తగూడెం నుంచి రావల్సిన లాస్టు బస్సు ఇంకా రాలేదు.






# జాలి ఖరీదు

ఏవరయినా పాసింజర్లు వస్తారేమోనన్న ఆశ' అని ఆశగా అన్నాడు నాయరు. నాకు నవ్వు వచ్చింది. ఆశకు అంతులేదు!

రోడ్డు నిర్మానుష్యమయింది.

చలిగాలి నరాల్ని కొరుక్కు తింటూవుంది.

అప్పుడొకటీ అప్పుడొకటీ ఆగకుండా పోతూవున్న లారీలు తప్ప, రోడ్డు పైన ఏ సందడీలేదు నాయరు హోటలుకి అటు ప్రక్కగా వున్న ఒక సైకిలు షాపూ, సావి బన్ షాపూ, కిళ్లీకొట్టూ, గంట క్రితమే మూతపడ్డాయి. దూరంగా రెండు కుక్కలు మొరుగుతున్నాయి.

కొత్తగూడెం నించి లాస్టు బస్సు వచ్చి ఆగింది. ఒకరో ఇద్దరో దిగారు. బస్సు వెళ్ళిపోయింది. నాయరు ఆశగా చూసాడు. అయిదు నిముషాలు గడిచాయి నాయరు దగ్గర పనిచేసే కురాడు బల్ల మీద పడుకుని నిద్రపోతున్నాడు. ఆద మరిచి గుర్రు కొట్టున్నాడు చింత లేని మనసు వాడిది!

నాయరు లేచాడు బల్ల దగ్గర నుంచి.

నేనూ లేవబోయాను.

అప్పుడు ఆ హోటల్లోకి చొరబడింది ఆ మనిషి! వచ్చి, ఒక బల్ల దగ్గర కూర్చుంది. ఇరవయి సంవత్సరాల యవ్వనం. దాన్ని సరిగా దాచలేని బట్టలు! రేగిన జుట్టు తత్తర పాటుతో కదులూ వున్న చేపల్లాంటి కన్నులు. ఎత్తయిన వక్షస్సంపద. వయసులో, నిగారింపు దేలిన, నునుపయిన శరీరం. కళ్ళల్లో ఆందోళన. ఆకర్షణీయమయిన విగ్రహం!

ఆ ఆడమనిషి దగ్గరకి వెళ్ళి — 'ఏం కావాలి? భోజనమా?' అని అడిగాడు నాయరు.

వద్దని తల వూపింది, ఆమె.

'మరేం గావాలి?'— విసుగ్గా అన్నాడు నాయర్!

'టీ, వుందా?' వొణికే గొంతుతో అడిగిందామె.

'వుంది.'

'ఒక్క టీ కావాలి!

నాయరు కుర్రాడ్ని లేపి, టీ తెమ్మని చెప్పి, క్యాషు దగ్గర కూర్చుని, నాతో మాటల్లో పడ్డాడు. నాయరు మాటలు వింటూ, నేను ఆవిడను గమనించాను.

'ఆ అమ్మాయి మొహంలో ఆందోళన స్పష్టంగా కొట్టవచ్చినట్లు కన్పిస్తూ వుంది. అక్కడ కూర్చుని వున్నదన్న మాటే గానీ, ఆమె చూపులు చంచలంగా దిక్కుల్ని పరికిస్తున్నాయి భయం భయంగా చలిస్తూ వున్నాయి. ఆమె మొహం పాలిపోయి వుంది. ఏదో ఆపద ముంచుకుని వచ్చినట్లు, ఆమె భయంతో, బిగదీసుకునిపోయి వుంది!

ఆశ్చర్యంగా, ఆమెనే గమనిస్తూ, నేను నాయరు మాటల్ని వింటున్నాను.

కుర్రాడు ఆమెకి టీ ఇచ్చి, ఆమె దగ్గర్నుంచి పైసలు అడిగి తీసుకుని వచ్చి, నాయరుకి ఇచ్చాడు. క్యాషు డ్రాయరులాగి, లోపల పైసలు వేసి, డ్రాయర్ను మరలా మూసాడు, నాయరు

ఆమె మెల్లగా టీని వూదుకుంటూ తాగుతూవుంది.

అప్పుడు—

ఎర్రటి మిడిగుడ్ల కళ్ళూ, రేగిన దుబ్బు జుట్టూ, మాసి దుమ్ము కొట్టుకున్న పాంటూ, చిరిగిన బుష్ షర్టూ—తో కర్కశంగా చూస్తున్న ఒక మొరటు మనిషి ఆ పాకలోకి వచ్చి నిలబడ్డాడు అతని మొహం బండగా వుంది. అతని చూపులు ఎర్రగా భయంకరంగా వున్నాయి!

టీ తాగుతూవున్న ఆమెనే కసిగాచూస్తూ నిలబడ్డాడు, అతను.

హఠాత్తుగా అతని చేతిలో, తళ తళ మెరుస్తూ వున్న బాకు ప్రత్యక్షమయింది!

అతన్ని చూసి గజ గజ వణుకుతూ, తాగుతూవున్న టీని వదిలేసి, నిలబడింది ఆమె

'ఏయ్! ఎవర్నువ్వు? ఆగు.' అని అరిచాడు నాయర్.

అతను ఆ మాటల్ని విన్పించుకోకుండా, చేతిలో వున్న బాకుని తిప్పతూ, ఆమె వయిపు లంఘించాడు. ఆమె ఆకులాగా గజగజ లాడుతూ, అతన్నుంచి తప్పించుకుని, ప్రాణభయంతో, మా వయిపు పరుగెత్తి వచ్చింది! ఒక్క క్షణం ఆలస్యమయివుంటే ఏమయేదో, నేను చెప్పలేను!

'ఏయ్! ఆగు. ఏమిటిది?' అని అరిచాడు నాయరు.

కాని, అతను ఆగలేదు. మా వెనకాల్తే వణుకుతూ నుంచున్న ఆమె వయిపు బాణంలాగా దూసుకుని వచ్చాడు.



దీపావళి శుభాకాంక్షలతో



# శ్రీరామా ఫైనాన్స్ కార్పొరేషన్

మోటార్ & జనరల్ ఫైనాన్షియర్స్

పి.బి.నెం:6, **బొబ్బిలి - 532 558** విజయనగరం జిల్లా
ఫోన్:345 గ్రామ్స్:ఫైనాన్స్

ఇతర ఆఫీసులు:

పి.బి.నెం:2020, 30-15-35,
దాబాగార్డెన్స్, విశాఖపట్నం-530 020
ఫోన్.64466 గ్రామ్స్: ఫైనాన్స్
టెలెక్స్:0495-330

మేజర్ పి.కె.దాస్ బిల్డింగ్స్,
నయాచౌక్,
కటక్-753 010 (ఒరిస్సా)
ఫోన్.20752 గ్రామ్స్.ఫైనాన్స

40, రామానుజం స్ట్రీట్, టి.నగర్, మద్రాస్-600 017
ఫోన్.446746 గ్రామ్స్:రామ్‌ఫిన్

**సులభమైన షరతులపై కమర్షియల్ వాహనములకు ఋణములు ఇవ్వబడును.**

మరియు

**ఆకర్షణీయమైన రేట్లపై ఫిక్సెడ్ డిపాజిట్లు అంగీకరించబడును.**

**సి.వి.సీతారామస్వామి**
మేనేజింగ్ పార్ట్‌నర్

## జాలి ఖరీదు

నేను అప్పుడు చూసాను, నాయర్ని!

నాయర్ చెంగున ఎగిరి, లాగి ఒక తన్ను తన్నాడు అతన్ని. అతని చేతిలోని కత్తి ఎగిరి క్రింద పడింది అతను జారి క్రింద పడ్డాడు. నాయర్ అతని పైకి లంఘించి ఫెడీ ఫెడీ గుద్దాడు. అతని నోరు చిట్లి రక్తం వచ్చింది. అతను బిళ్ళబీటుగా బల్ల మీద పడ్డాడు. అక్కడ్నించి దొర్లి కిందపడ్డాడు రొప్పాడు. అతను పిల్లిలాగా లేచి కూర్చుని, చెంగున గెంతి, పాక బయటికి వురికి చీకటో కలిసి పోయాడు. రోమన్ వీరుడిలాగా నిలబడివున్న నాయర్ని చూసి నేను గర్వపడ్డాను గజ గజ లాడుతూ వున్న ఆమెని, సంగతేమిటని అడిగాను. ఇక తనకి ఏం భయంలేదని హామీ ఇచ్చాను. కొంత సేపటికి ఆమె శరీరంలో వణుకు తగ్గింది. మంచి నీళ్ళు త్రాగి ఆమె సంగతి చెప్పింది —

తనది ఆ ప్రక్కన వున్న ఒక పల్లెటూరు. సినిమా చూడటానికి వచ్చింది. అక్కడ కన్పించాడు అతను తనతో రమ్మని బెదిరించాడు ఆమె నిరాకరించింది. అతను వెంబడించాడు. ఒంటరిగా సినిమాకి వచ్చినందుకు, తనను తాను తిట్టుకుంటూ, అతని బారి నుంచి తప్పించుకోవటానికి ఆమె పరుగెత్తి పారిపోయి వచ్చింది ఆమె వెనకాలనే అతనూ వచ్చాడు— ఆ తర్వాత జరిగింది, మా కళ్ళతో మేమే చూసామని ఆమె అంది. 'ఈ రాత్రి నేను ఇక్కడ్నించి బయటకి వెళ్తే వాడు నన్ను చంపేస్తాడు.' అని ఏడ్చింది ఆమె

మన దేశంలో రోజురోజుకీ ఆడదానికి భద్రత ఏ మాత్రం లేకుండా పోతూవుందని బాధపడ్డాడు నాయరు ఇకనయినా జాగ్రత్తగా వుండమని ఆమెని హెచ్చరించాడు.

'నీకేం ఫర్వాలేదు. ఈ రాత్రికి ఇక్కడే పడుకో. రేపు తెల్లవారిన తరువాత నేను దగ్గరుండి బస్సు ఎక్కిస్తాను. మీ వూరు వెళ్ళిపోదువుగాని! అని ఆమెకి భరోసా ఇచ్చాడు నాయర్. నేను నాయర్ని చూపులతోనే అభినందించాను.

అతని మాటలకి ఆమె ఎంతో సంతోషించింది. అతనికి కృతజ్ఞతా పూర్వకమయిన చూపులతో ధన్యవాదాలు తెలిపింది

'వాడు ఇక ఈ వయిపుకి తొంగి చూడలేడు అమ్మాయి! నీ ప్రాణానికి నా ప్రాణం

అద్దు వేస్తాను. నువ్వు నిశ్చింతగా పడుకో! అన్నాడు నాయర్

బాగా ప్రొద్దు పోయింది

నాయర్‌తో చెప్పి నేను నా రూముకి వెళ్ళిపోయేను

ఆ రాత్రి నాకు సరిగ్గా నిద్ర పట్టలేదు. నాయర్ హోటల్లో జరిగిన ఆ సంఘటన చిత్రంగా అన్పించింది దేశంలో ఆ కమం, పశుత్వం చెలరేగుతున్నాయ్! దవుర్జన్యం రాజ్యం చేస్తూవుంది!! మాన ప్రాణాలకి రక్షణ లేకుండా పోతూవుంది!!

ఆ తెల్లవారు ఝామున నారూము తలుపు దబదబ మోగింది! లేచి తలుపు తీసాను. మా వూరునించి మనిషి వచ్చాడు. మాఅమ్మ గారికి హఠాత్తుగా అస్వస్థత ముంచుకొచ్చి మంచం పట్టిందట! పరిస్థితి, కంగారుగా వుందట! నేనువెంటనే అతనోతో బయలుదేరాను. మా వూరు వెళ్ళాలంటే రెండు బస్సులు మారాలి. ఫసు బస్ ఎక్కి తల్లాడలో దిగాము, నేనూ, నా కోసం వచ్చినఆ మనిషీ!

మేము అక్కడ బస్సు దిగుతుండగా, ఆ మసక చీకట్లో 'ఆ ఇద్దర్నీ' గుర్తించి నా రక్తం గడ్డకట్టింది! నవ్వుతూ, తుళ్ళుతూ మాటాడుకుంటూ, చేతులు చేతులు పట్టుకుని నడిచిపోతూవున్న ఆ ఇద్దరూ—! వాళ్ళే!!

ఆమె రాత్రి నాయర్ హోటల్లోకి వచ్చిన ఆడమనిషి!

అతను కత్తితో ఆమెను చంపబోయిన ఆ రాస్కెల్!!

నేను ఆశ్చర్యంతో చూస్తూ వుండగానే, వాళ్ళు అటుగా వచ్చిన ఒక ప్రైవేటు వాన్ ఎక్కి వెళ్ళిపోయారు. ఆ వాన్ ఎక్కడికి పోయిందో నేను గమనించ లేకపోయాను. ఈ బస్సులు ఎప్పుడూ ఇంతే!

సమయానికి రావు! మనకు అవసరంలేని బస్సులు ఎన్నోవచ్చి పోతూవుంటాయ్.

ఒక గంట గడిచింది!

మేము ఎక్కవలసిన బస్సు రానే లేదు! తెల్లవారింది!

మేము వచ్చిన వూరు నించి రెండో బస్సొ వచ్చింది!

ఆ బస్సులోంచి నాయర్ దిగాడు!

నాయర్ కళ్ళు ఎర్రగా వున్నాయ్. అతని జుట్టు రేగివుంది. అతని కళ్ళు వెతుక్కుంటు న్నాయ్

'నాయర్! నాయర్' అని పిలిచామనేను.

నామాటవిని నాయర్ నాదగ్గరగావచ్చాడు

'ఏమయింది నాయర్?' ఆ ప్రశ్న అడిగానే గాని, నా గొంతులో సవాలక్షప్రశ్నలు కొట్టు మిట్టాడుతూ వున్నాయ్ ఆక్షణంలో.

'మోసం జరిగింది వేణూ! నీకు ఆ అమ్మాయి— అదే, రాత్రి హోటల్‌కి వచ్చిన ఆ ఆడమనిషిగాని కనపడిందా?' అన్నాడు నాయర్ కంగారుగా

'ఆఁ' అన్నాను.

'కనపడిందా? ఎక్కడా? చెప్పు. దాన్ని పట్టుకోవాలి'— అని ఆరాటం వ్యక్తం చేసాడు నాయర్.

నేను అంతక్రితం చూసిన సంగతిని నాయర్‌కి చెప్పాను.

నాయర్ కుప్పకూలిపోయాడు. ఏడ్పి పెడ బొబ్బలు పెడ్తూ—, ఆ రాత్రంతా తను ఆమె కోసం కాపలా కాసి, తెల్లవారుఝామున తన కనురెప్పలు వాలగానే, క్యాషు వున్న డ్రయగ్ని మారు తాళంతో తీసి, అందులో వున్న మూడు వేల రూపాయిల్నీ తస్కరించి, ఆమె పలాయనం చిత్తగించిన వైనం, వివరించాడు నాయర్.

'వాళ్ళిద్దరూ ఒక్కటే! ఇద్దరూ కలిసే ఆ సీన్ క్రియేట్ చేసారు- నీలో వున్న జాలిని కాష్ చేసి, హోటల్లో కాలు మోపారు. తమకు కావలసిందాన్ని సంగ్రహించుకుని పలాయనం చిత్తగించారు— ఎగిరి పోయారు! ఇక వాళ్ళు నీకు దొరకరు నాయర్ ఆ అపరిచిత మీద నువ్వు చూపించిన జాలి ఖరీదు, ఒక నెలపాటు చెమటోడ్చి సంపాదించిన నీ కష్టార్జితం! పూరుకో నాయర్. ఇక మనం చేయగలంది ఏమీ లేదు' అని ఓదార్చబోయాను నాయర్ని

ఎక్కడి ఓదార్పు! దాని వలన ఏమి వుపయోగమూ?!

దీన వదనంతో, విచారంగా, నేలమీద కూలబడిపోయాడు నాయర్.

అప్పుడే నేను ఎక్కవలసిన బస్సు తల్లాడ బస్ స్టాండ్‌లోకి ప్రవేశిస్తూ వుంది.

# అవీ ఇవీ అన్నీ

## ఎర్రన పీఠము — ఒంగోలు

"ప్రబంధ పరమేశ్వరుడు" బిరుదాంకితుడు కవిత్రయంలో ఒకడగు ఎర్రన మహాకవి పాద ధూళిచే పునీతమైంది ప్రకాశం మండలం. దాని కేంద్ర మగు ఒంగోలు పటణంలో ఈ కవి చేసిన సాహిత్య సేవకు స్మృతి చిహ్నంగా వారి పేర 'ఎర్రన పీటం' స్థాపించబడి ది

ఎర్రన జయంత్యుత్సవములు డిశంబరు 24, 25, 26 తేదీలలో జరపాలని కార్యవర్గం నిర్ణయించింది ఆ సందర్భంగా, ఈ సంవత్సరం ఎర్రన ప్రబంధ పరమేశ్వరుడు-బిరుదవుచిత్యం అను అంశం పరిశోధనకై ఈ పీఠంవారు నిర్ణయించారు ఈ పరిశోధనా వ్యాసం సుమారు 120 పూల్‌స్కేపు పుటలు కలిగి ఉండవలెను. ఉత్తమ వ్యాసకర్తను రూ 3000 లతో సత్కరించాలని ఈ పీట ప్రధానాశయం కవిపండిత విమర్శకాగ్రేసరులు, తమ పరిశోధనా వ్యాసాన్ని 15 11 82 లోగా (ఏ రాడు ప్రతులు) ఈ పీఠమునకు పంపి, విజేతలై సత్కారమును అందుకొన ప్రార్థన

జయంత్యుత్సవ సందర్భంగా వెలువడు ప్రత్యేక సంచికకు విమర్శకులు ఎర్రన సాహిత్యముపై వ్యాసములకు కూడా పంప కోరిక

డాక్టర్ అకొండి విశ్వనాథం, కార్యదర్శి, ఎర్రన పీటం, జిల్లాపరిషత్ కార్యాలయం, ఒంగోలు.

## 'కుందుర్తి స్మారక బహుమతి'

దాదాపు నాలుగు దశాబ్దాలుగా వచన కవితా రంగంలో ఉద్యమ స్ఫూర్తితో సారథ్యం వహించి తన సాహిత్య జీవితాన్ని వచన కవితా వ్యాప్తికి అంకితం చేసి ఇటీవలే దివంగతులైన పితామహుడు కీ శే శ్రీ కుందుర్తి స్మారక బహుమతిని ప్రతి సంవత్సరం ఇవ్వటానికి సాంస్కృతీ సమాఖ్య ఆంధ్రప్రదేశ్ భావిస్తున్నది కవిత్వం ప్రజల కోసమనీ, ప్రజల్లో కలిగే సామాజిక ప్రతిఘటన చైతన్యమే కవితకు పరమప్రయోజనమనీ భావించు కవులు, కవయిత్రులు అందుకు అను గుణంగా రాసిన వచనకవితలను నవంబరు 30 లోగా పంపి కీ శే కుందుర్తి స్మారక బహుమతిని స్వీకరించవచ్చు రచనలు పంపువారు రాష్ట్ర కవిటి ప్రధాన కార్యదర్శి, శ్రీ వి శిరీషకుమార్, సాంస్కృతీ సమాఖ్య నున్న, విజయవాడ—521 212 చిరునామాకు పంపాలి

## నవప్రణవం

రచన దినకర్, వెల ఒక రూపాయి ప్రతులకు రచయిత పేర 2—375, పోర్టు స్ట్రీట్ నంద్యాల్—518501



నవంబరు 19 నుంచి న్యూఢిల్లీలో జరిగే ఆసియా క్రీడోత్సవాలకి రాష్ట్ర ప్రభుత్వం పంపిన సాంస్కృతిక బృందంలో ఎంపికైన కుమారి గెన్నాడ ఉమాసోవేశ్వరి. ఈమె శ్రీ జి సుబ్రహ్మణ్యం (హైదరాబాదు) గారి కుమార్తె

## శిష్యద్విశతి (కందాలు)

రచన శ్రీ దూడం నాంపల్లి 37 పేజీలు. వెల 3 రూపాయలు ప్రతులకు రచయిత పేర, రేకొండ పోస్టు, వయా బెజ్జంకి. కరీంనగర్ జిల్లా 505 528 అను చిరునామాకు వ్రాయాలి,

## ఇంద్రధనుస్సు

సరోజినినాయుడు జీవిత చరిత్ర రచన శ్రీమతి కోడూరి లీలావతీదేవి 90 పేజీలు వెల 3 రూపాయలు ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ, 34 4 ఆర్ టిబర్కత్‌పురా క్వార్టర్స్, హైదరాబాదు—500 027

## ఎ. ఎస్. సుందరరాజు మృతి

తిరుమలలో ఆంధ్రపత్రిక న్యూస్ కంట్రిబ్యూటర్‌గా, ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా ప్రతినిధిగా పనిచేసిన శ్రీ ఎ ఎస్ సుందర రాజు నవంబరు 5వ తేదీన హఠాత్తుగా గుండెపోటు వల్ల మరణించారు. ఆయన వయస్సు 40 సంవత్సరాలు. భార్య, ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు ఉన్నారు



# మమత

డిలోప్ప బాలకేశవులు



అదొక మిషన్ హాస్పిటల్ పెద్ద ఆవరణలో పచ్చని పచ్చికలో ప్రశాంతమైన వాతావరణంలో నిశ్చలంగా నిల్చున్న చెట్ల మధ్య గంభీరంగా వున్న తెల్లని ఆ భవనాన్ని చూస్తుంటే ఆస్పత్రిలాకాక అభయహస్తంతో నిలిచే మేరీమాత ఆలయంలా కనుపించింది మా ఆంటీ అక్కడ హెడ్ నర్స్ చిన్నప్పటి నుంచి మా పిన్ని అంటే నాకు చాలాఇష్టం. రెండునెలల క్రితమే ఇక్కడకు బదిలీ అయి వచ్చారావిడ. మొదటినుంచి నాకు హాస్పిటల్స్ అన్నా, డాక్టర్లన్నా అయిష్టం.

మా బాబులు రాజా, మధు స్కూల్ కెళ్ళారు నాకు ఏంతోచక పిన్నిని చూద్దామని పించి ఇలా వచ్చాను. అదే మొదటిసారి నేనా హాస్పిటల్ కెళ్ళటం. ఆమె తన డ్యూటి ముగించుకునివచ్చి నాకు హాస్పిటల్ చూపిస్తున్నది. ఇది టి. బి వార్డు, ఇది అవుట్ పేషెంట్సు వార్డ్, ఇది ఆఫీసు రూం, ఇది ప్రసూతివార్డు, ఇది ఆపరేషన్ రూం, ఇది పిల్లలవార్డు, ఇది వేసెక్టమీ ఆపరేషన్‌లు చేసేది .. నిస్సహాయంగా పడుకున్న రోగులను జాలిగా చూస్తూ నడుస్తున్నాము. అది డెడ్ రూమ్. దూరం నుంచి చూపారు ఆంటీ

"ఎవరైనా ఉన్నారా ఆంటీ!" కుతూహలంగా అడిగాను.

'ఒక చిన్నపాపవుంది. రా చూస్తావా?' తల వూపాను రూం తలుపులుతీశారు ఒకమాదిరి గదిలో ఇనుపతీగల మంచం మీద గుడ్డల్లో చుట్టి పడుకోబెట్టిఉంది మూడేళ్ల పాప శరీరం. తను భూమ్మీదకొచ్చిన పని నెరవేరిందన్నట్టు నిశ్చలంగా నిద్రపోతున్నది ఏ తల్లి కన్న బిడ్డో! మనసంతా బాధగాఅయిపోయింది. అలా చూస్తూ, చూస్తూ మళ్ళా చిన్నపిల్లల వార్డ్‌లోకి వచ్చాము. ఉయ్యాలలన్నీ నీట్‌గా వేసిన పక్కలతో వరుసగా వున్నాయి. "కుటుంబ నియంత్రణ ధర్మమా అని డెలివరీ వార్డ్‌లో బెడ్స్, ఇక్కడ ఉయ్యాలలు చాలావరకు ఖాళీగా ఉన్నాయి" ఒక పాపను ఉయ్యాలనుంచి తీస్తూ అన్నారు ఆంటీ. అంతకుముందు ఉయ్యాలలోవున్న పాపలందరినీ తల్లులదగ్గర పడుకోబెట్టారు. ఆంటీ చేతిలోని పాప నిద్రాభంగం కలిగించినందుకు కాబోలు చిరాగ్గా కదిలింది. నాలుగోనెలవచ్చిందనుకుంటాను బొద్దుగా ఉంగరాలజుట్టుతో చిన్న గులాబీరంగు పెదాలతో అందంగాఉంది. తెల్లని ముఖంలో ఆల్చిప్పలాంటికళ్ళు 'ఎంత బాగుంది ఆంటీ, ఎవరిపాప!' నాకు ఆడపిల్లలంటే చాలా యిష్టం. కాని నాకు ఇద్దరూ మగపిల్లలే.

"ఎవరిపాప కాదు ఆస్పత్రిపాప"

"అంటే"

"అంటే అది అంతే"

"ప్లీజ్! చెప్పండి ఆంటీ ఎందుకలా." నాలో ఆతృత ఉరకలు వేస్తోంది.

"ఈ పాప వెనుక ఒక కథ వుంది. తల్లి పంజాబి యువతి తండ్రి ఆంధ్రా యువకుడు. ప్రేమించానని కబుర్లు చెప్పాడు వాళ్ళు అనుభవించిన ఆనందానికి ప్రతిఫలం లభించబోతున్నదని తెలిశాక పెళ్ళిచేసుకుంటానని ఇక్కడకు తెచ్చేశాడు. హాస్పిటల్లో చేర్పించి తల్లిదండ్రికి చెప్పి వస్తానని వెళ్ళిపోయాడు ఈ పాప పుట్టాక నాలుగోజులు



అతనికోసం ఎదురుచూసింది. ఒకరాత్రి అతని పేరు, ఫొటో, వివరాలతో ఉత్తరం వ్రాసి పాప ప్రక్కనపెట్టి ఆత్మహత్య చేసుకుంది. పాపం కదూ...''వింటున్న నాకు ఆశ్చర్యం, బాధతోపాటు ఆపుదామన్నా ఆగని కన్నీరు జలాజలా రాలాయి ఈ పాప పెద్దదైతే ఇంత నిశ్చింతగా నిదురించగలదా ? తనొక అనాధ అని, తనకెవరు ఆప్తులు, ఆత్మీయులు ఎవరూ లేరని తెలిసిన క్షణంలో భవిష్యత్తులో ఎంత బాధపడుతుందో ? జాలిగా గుండెలకు హత్తుకున్నాను

ఇంటికి వచ్చినా నా ఆలోచనలు నన్ను వదలలేదు. అంతలో పిల్లలిద్దరూ వచ్చారు. ఆలోచిస్తూనే పిల్లలిద్దరూ అన్నాలు తింటూ ఉన్నారు. ''అమ్మా! రఘువాళ్ళింట్లో చిన్ని పాప ఉందమ్మా ! భలే బాగుంది'' మధూ అన్నాడు.

''అమ్మా! మన యింట్లో పాప లేదుగా ఎలా?'' బిక్కమొహంవేసి అన్నాడు రాజా.

మెరుపులాంటి ఆలోచన వచ్చింది నాకు. పోనీ ఆ పాపను నేనే తెచ్చేసుకుంటే!ఆ భావం నాకో అంతులేని ఆనందాన్ని కలిగించింది. ఎవరైనా కావాలంటే ఆ పాపను యిచ్చేస్తామని ఆంటీ కూడా చెప్పారు. రవి ఎప్పుడు వస్తారా అని ఆదుర్దాగా ఎదురుచూట్టం ప్రారంభించాను. వారు ఆఫీసు నుండి రాగానే అడిగెయ్యాలి ఎలాగైనా ఆ పాపను తెచ్చుకోవాలి. పాపను స్వంతం చేసుకోవాలన్న కోరిక చాల అర్జెంటుగా చెయ్యాల్సిన పని అనిపిస్తోంది. ఎంత ముద్దుగా ఉంది పాప ! మాకెలాగూ పాపలేదు. చిన్నవాడు రాజాకు అప్పుడే మూడోఏడుకూడా వచ్చింది ఎప్పుడు ఐదవుతుందా, ఎప్పుడు రవి వస్తారా అన్న ఆతృతతో సరిగ్గా ఒక్కపనీ చెయ్యలేక పోయాను

ఎదురుచూసిన సాయంత్రం మెల్లగా వచ్చింది. రవి వస్తూనే ఇద్దరు స్నేహితులను వెంటేసుకుని వచ్చాడు. టిఫిన్ తిని మళ్ళా తయారౌతున్న వారిని చూస్తుంటే నాకు నీరసం వచ్చింది ''రాధా ! నాకోసం చూడక అన్నం తినేయి నేను సినిమాకెళుతున్నాను'' అంటున్న ఆయన్నిచూస్తుంటేవళ్ళు మండింది కాని ఏం చెయ్యను? రాత్రి సినిమా నుంచి రాగానే చెబుదామని సమాధానపడ్డాను

కాని రవి స్నేహితుడు అతనిని వదల్లేదు. ఎవరో చిన్ననాటి స్నేహితుడు హటాత్తుగా



కనిపించాడని తీసుకొచ్చాడు. అన్నం తిని హాయిగా కబుర్లు చెబుతూ స్నేహితుడి ప్రక్కన పడుకున్న వారిని చూస్తుంటే కోపం, ఏడుపూ వచ్చాయి. ఉదయం నుంచి ఎన్ని అనుకున్నాను? సాయంత్రం వారు ఆఫీస్ నుంచి రాగానే టిఫిన్ పెడుతూనో, రాత్రి అన్నం పెట్టేటప్పుడో, తిన్న తరువాత వాలు కుర్చీలో కూర్చున్నపుడు చిలకలుఅందిస్తూనో అలా ఎప్పుడో ఏకాంతసేవలలో మెమ్మదిగా పాప విషయం చెప్పి రేపు తెచ్చేసుకుందామను కున్నాను. నా ఖర్మకాలి ఆ స్నేహితుడు ఈరోజే రావాలా?

ఎవరైనా అడిగితే పాపను యిచ్చేస్తామని చెప్పారు ఆంటీ దేవుడా ఎవరు రాకుండా ఉండాలి. పాపను ఎలా తెచ్చుకోవటం? ఆలోచనలతో నిద్ర పట్టేసట్టేక ఆ రాత్రి గడిపేశాను మర్నాడు రాత్రికిగాని వారికి విషయం చెప్పటం కుదరలేదు.

నేను చెప్పిందంతా శ్రద్ధగా విని ... నీకేమైనా పిచ్చిపట్టిందా? మనకిక పాపలే పుట్టరా? రాజుకు మూడేళ్ళు వస్తేమాత్రం మనమేమన్నా ముసిలాళ్ళమై పోయామా ? ఆయన నిర్ణయం వింటే అరగంట నుంచి

## ప్రైవేటు విశ్వవిద్యాలయం!

పశ్చిమ జర్మనీలో నార్త్ రైన్ వెస్ట్ ఫాలియా రాష్ట్రంలో ప్రైవేటు విశ్వవిద్యాలయానికి ప్రభుత్వ అనుమతి లభించింది. వచ్చే వేసవిలో ఈ విశ్వ విద్యాలయంలో తరగతులు ప్రారంభం కాగలవు. మొదటి సంవత్సరం 300 మంది విద్యార్థులకు ప్రవేశంలభిస్తుంది. ఇతర విశ్వవిద్యాలయాల్లో పని చేస్తున్న 80మంది లెక్చరర్లు దీనికి రూపకల్పన చేశారు. దీనికి ప్రభుత్వం నుండి ఎటువంటి సబ్సిడీలు లభించవు. డొనేషన్లద్వారా కావలసిన నిధులను సమకూర్చగలరు. ఐదు సంవత్సరాల సరిపోయేనిధులను ఇప్పటికేసేకరించడం జరిగింది. రూర్ నగర పరిసరాల్లో దీనికి కావలసిన భవంతులను నిర్మిస్తున్నారు.

మొత్తుకున్నదంతా బూడిదలో పోసిన పన్నీరవుతున్నందుకు బాధగా ఉంది

''కాదండీ! ఆ పాపకు తల్లీ దండ్రీ లేరు చాల బావుంది మనం తీసుకుంటే ఒక అనాధకు ఆశ్రయమిచ్చినట్లు ఉంటుంది. మన పిల్లల్లో కలిసిపోతుంది కూడా'' చివరిసారిగా ప్రయత్నించాను.

''పిచ్చిపిల్లా ! అలాంటి అనాధలు ఈ దేశంలో ఎందరో వున్నారు. రోజుకు ఎంత మంది అనాధలుగా పుడుతున్నారో? వాళ్ళందరికీ నువ్వు ఆశ్రయం యివ్వగలవా? అమ్మవై ఆదరించగలవా ? నీకంత జాలిగా వుంటే కొంచెం డబ్బివ్వు. అసలా హాస్పిటల్కెందు కెళ్ళావు? పిచ్చిగా ఆలోచించక పడుకో''చేయి చాచి దగ్గరకు తీసుకుంటూ అన్నారు.

నా మనసులో అశాంతిగా, ఏదో మంటగా ఉంది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఎంత మరిచిపోదామని ప్రయత్నించినా చిన్నారి పాప మరుపుకురావటంలేదు.నిద్దరాని కళ్ళతో ఆలోచిస్తూ బాధపడుతూ పడుకున్నాను.నా ఆలోచనలతో పనిలేదన్నట్లు తెల్లారిపోయింది.

* * *

వారం రోజుల వరకూ కోపంతో రవితో మాట్లాడలేదు పాపను తెచ్చుకోలేనని తెలిసి కూడా పాపమీది మమకారాన్ని చంపుకోలేక పోయాను. రోజూ హాస్పిటల్కి వెళ్ళి పాపను ఎత్తుకొని ఆడించి వచ్చేదాన్ని. నా అదృష్టమో పాప దురదృష్టమో పాపకోసం ఎవరూ రాలేదు. పాపకు సరోజ అని నేనే పేరు పెట్టాను. నేను వచ్చే టైముకి నాకోసం కిటికీలో కాచుకుని కూచునేది. నన్నంతదూరాన చూస్తూనే 'అమ్మ అమ్మ' అంటూ కేరింతలు కొట్టేది

రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. పాప నా ఆరోప్రాణంఅయింది. మా ఇంట్లోకి మరో కొత్తమెంబరు వచ్చాడు. క్రితంసారి రెండుసార్లూ పాప కావాలనుకున్నాను. కాని ఈసారి మాత్రం పాప పుడుతుందేమో, సరోజమీది మమతతగ్గిపోతుందేమోనని భయపడ్డాను. హాస్పిటల్లో నెలరోజులు ఉండాల్సి వచ్చింది. ఈ నెలరోజులు సరోజను వదలి క్షణం ఉండలేదు. పసివాడిని కూడా అంత శ్రద్ధగా చూడలేదేమో! ఇది ఏనాటి అనుబంధమో? ఆరోజు సరోజ పుట్టినరోజు.

హాస్పిటల్ నుంచి వచ్చి వారం రోజులవుతోంది. మొదటి. రెండవ పుట్టినరోజుపండు



# ఖచ్చితంగా గ్రోమోర్

# ఎరువులే కొనండి

ఇది గ్రోమోర్ గుర్తు









**గ్రోమోర్**
**28-28-0**

**గ్రోమోర్**
**14-35-14**

FDS-CFL-783 TEL

**చేనుకు చేవ, రైతుకు రొక్కం — గ్రోమోర్**

## మమత

గలు సరోజ మా ఇంట్లోనే గడుపుకుంది. సరోజకు కొత్త గౌను తొడిగి హాస్పిటల్ స్టాఫ్‌కు స్వీట్స్ పంచిపెట్టేదాన్ని. ఆ రోజు కూడా పాపను ముస్తాబు చేసి ఇంటికి తీసుకెళ్దామని గౌను, గాజులు, స్వీట్స్ అన్నీ తెచ్చాను. హాస్పిటల్ కెళ్ళి సరాసరి సరోజ ఉండే దగ్గరకు వెళ్ళాను. నన్నుచూడగానే "అమ్మా" అంటూ పరుగునవచ్చే పాప కనుపించలేదు.

ఆంటీ రూంకి తీసుకెళ్ళారని అక్కడి డ్యూటీ నర్స్ చెప్పింది. కొంచెంసేపు ఎదురు చూసి ఇక ఆగలేక నేనే బయలుదేరాను. వరండాలో ఆ చివర మంచుని ఎవరో కారులో ఉన్నవాళ్ళకు టా! టా! చెప్తున్నారు. కారు వెళ్ళిపోయింతరువాత ఆంటీ లోపలికి వచ్చారు నా కళ్ళు సరోజకోసం అసహనంగా వెతుకుతున్నాయి. "నమస్తే ఆంటీ, పాప ఏది ? ఇవాళ సరోజ పుట్టినరోజుగదా ఇంటికి తీసికెళ్తాలి. ఇదం స్వీట్స్! నాకు టైం లేదు. ఈసారి స్టాఫ్‌కు మీరే పంచండి. త్వరగా స రో జ ని వ్వ ం డి" గుక్కతిప్పుకోకుండా మాట్లాడుతున్న నన్నుచూసి ఆంటీ నవ్వుతూ "రాధా! నీకో శుభవార్త చెప్పనా" అంది.

"ప్లీజ్ ఆంటీ శుభవార్తలు తరువాత ముందు సరోజనివ్వండి" పాకెట్స్ పట్టుకొని నిలబడుతూ అన్నాను.

"తొందరపడకు ! నిదానంగా కూచుని విను! ఈ రోజు ఓ గమ్మత్తు జరిగింది. సరోజ తండ్రికి ఇన్నాళ్ళకి జ్ఞానోదయం కలిగింది కాబోలు ! కూతురు కోసం వచ్చాడు. ఆమె అడ్రస్ చెప్పమన్నాడు. చనిపోయిందని చెపితే, తన అసమర్థతకు బాధపడ్డాడు. సరోజనైనా యిమ్మని అడిగి తీసికెళ్ళిపోయాడు..." మా ఆంటీ చెబుతున్న తరువాత మాటలు వినిపించలేదు. నా చేతిలోని పాకెట్ జారిపడిపోయింది.

సరోజ వెళ్ళిపోయింది. నమ్మలేకుండా వున్నాను. ఇంకా సరోజ ఎక్కడనుండో "అమ్మా" అని పిలుస్తున్నట్టుగా ఉంది — ఆగని కన్నీరు జలజలా చెక్కిలిపై రాలింది. "ఛా! ఏమిటి రాధా ! నువెప్పుడు బాధపడే దానివిగా, తనకెవరూ లేరని ! సరోజకు ఇప్పుడు కన్నతండ్రి ఉన్నారు లోకంలోని అందరిలాగానే తనూ ఆనందంగా ఉంటుంది బి హాపీ మై చైల్డ్" ఓదార్చింది ఆంటీ.

ఉత్తచేతులతో వెనుతిరిగాను ఇంటికెలా వెళ్ళానో నాకేతెలియదు. మనసంతా శూన్యమైపోయింది. 'పోనీలే కన్నతండ్రి దగ్గర సరోజ అందరిలా పెరుగుతుంది వెనెలాగూ తీసుకొని రాలేను. ఎక్కడో ఒకచోట సరోజ సుఖంగా ఉంటుంది అంతేచాలు'. నన్ను నేనెంత ఊరడించుకున్నా మనసు సమాధానపడలేదు. అన్నం తినకుండా ఏడుస్తూ పడుకున్న నా దగ్గరకు వచ్చాడు మధు వర్షించబోయే మేఘాల్లా ఉన్నాయి వాడి కళ్ళు... "సరోజ వెళ్ళిపోయిందని ఏడుస్తున్నావా అమ్మా. నేను తెచ్చిస్తాగా ఏడవకు" చిట్టి చిట్టి చేతులలో నా కన్నీళ్ళు తుడుస్తున్న వాడిని దగ్గరకు తీసుకున్నాను. కాలం జరిగిపోతోంది. సరోజ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా దాని ఫోటోలు ముందు పెట్టుకునేదాన్ని. ప్రతి పుట్టినరోజుకు సరోజ పేరుమీద కొంత డబ్బు, బట్టలు హాస్పిటల్‌కిచ్చేదాన్ని.

## 2

పదహారు సంవత్సరాలు గడిచిపోయాయి. పెద్దవాడు మధు నాగపూర్‌లో బియ్యీ చదువుతున్నాడు. తరువాత రాజా బి యస్సీ రఘు ఇంటర్. మధు ఒక్కడే అంత దూరాన వున్నాడు. వాడంటే నాకు కొంచెం ఇష్టం ఎక్కువ. మధును వదలిఉండాలంటే మొదట చాలా బాధపడ్డాను. రెక్కలొచ్చిన పక్షి ఎగరటం సహజం కదా. మొదటిసారి శలవులు యిచ్చినపుడు ఒక్కరోజుకూడా ఆలస్యంచెయ్యకుండా ఇంటికి వచ్చేశాడు.

నాగపూర్ నీళ్లు ఒంటికిపడి కొంచెం లావెక్కాడు. పచ్చగా, ఆరోగ్యంగా వున్నాడు. మొన్నటిదాకా నా వడిలో ఆడుకున్న మధు హఠాత్తుగా ఎదిగిపోయినట్లుగాఅనిపించింది, తృప్తితీరా చూసుకుని దిష్టి తీసివేశాను. ఆ రాత్రి అక్కడి కాలేజీ కబుర్లు, అక్కడి స్నేహితుల కబుర్లు చెప్పి నవ్వించాడు హాస్టల్‌లో సౌకర్యంగా లేదని వేరే గదిలో మరో ఇద్దరు స్నేహితులతో ఉంటున్నాడట. మధు ఉన్న నెలరోజులు చకచకా గడిచిపోయాయి. వెళ్లేరోజున వంగి నా కాళ్లకు దండంపెడుతున్న మధును దగ్గరకు తీసుకుని కళ్లనీళ్లు పెట్టుకున్నాను.

“అమ్మా ! నువ్విలా బాధపడితే నేను వెళ్లను. వెళ్లినా అక్కడ ఉండలేను'' చిన్నపిల్లాడిలా నా భుజంమీద తలవాల్చి అన్నాడు మధు.

“ఛా! లేదురానాన్న వెళ్లు'' కళ్లుతుడుచుకున్నాను.

“బాగుంది. ఆడపిల్లను అత్తగారింటికి పంపినట్లు ఏమిటీ అప్పగింతలు'' నవ్వుతూ వెక్కిరించారాయన. ఆ మాటతో నాకు హఠాత్తుగా సరోజ గుర్తొచ్చింది. సరోజకిప్పుడు పెళ్లీడు వచ్చిఉంటుంది. ఆడపిల్లలు ఎంతలో ఎదుగుతారు. బహుశా పెళ్లైపోయిందేమో ? చీరల్లో ఉన్న సరోజను ఊహించుకుందామన్నా “అమ్మా'' అంటూ చేతులుచాచే చిన్నారిపాప రూపు మాత్రమే గుర్తొస్తున్నది ఏం చేస్తూందో, ఎక్కడ ఉందో? ఎలాఉందో నిట్టూర్చాను. మరునాడు సరోజ పుట్టినరోజు చక్కని నైలెక్స్ చీర, దానికి సరిపడే బ్లౌజ్ పీస్ తీసికెళ్లి ఆంటీకిచ్చాను. మామూలు చిరునవ్వుతో అందుకున్నారు ఆంటీ. మరి రెండు సంవత్సరాలు గడిచిపోయాయి.

మధు చదువు ఇంకో ఏడాదితో అయిపోతుంది వాడికప్పుడే పెళ్లి సంబంధాలు వస్తున్నాయి. శలవలకు ఇంటికి వచ్చిన మధు ఈసారెందుకో హుషారుగా లేడు. వచ్చిన దగ్గరనుంచి గమనిస్తున్నాను. ఏదో చెప్పలేక బాధపడుతున్నట్లుగా వున్నాడు. ఒకరోజు రాజా, రఘు సినిమాకెళ్ళారు. వారు ఎవరో ఫ్రెండింటికెళ్లారు. పనంతా అయింది. తీరిగ్గా కూచున్నాను. మధు నా ఒళ్లో తలపెట్టి పడుకున్నాడు.

“చిక్కిపోయావేరానాన్నా! బాగా చదువుతున్నావా?''

“లేదమ్మా. అమ్మవుకదూ. నీ కళ్లకింకా పాపాయిలా కన్పిస్తాను''

'నిజమే నాకు చిన్నవాడిలా కనిపిస్తున్నాడు. పిచ్చివెధవ వీడికప్పుడే పెళ్లేమిటి' అనుకున్నాను.

“అమ్మా''

“ఏమిటి నాన్నా''

“నే చెప్పేది విని నన్ను క్షమిస్తావా అమ్మా''

ఉలిక్కిపడ్డాను. “అంత క్షమించరాని తప్పు చేశావా మధూ!''

“లేదమ్మా! నా దృష్టిలో అది తప్పు కాదు''

“మరి... చెప్పు''

ఒకసారి నావైపు చూసి కళ్లు దించుకున్నాడు. ఆ కళ్లలో సన్నని బెదురు. మీస కట్టు వచ్చినా పసితనం వదలని ముఖం. ఏం వినాల్సివస్తుందో! నాలో ఏదో ఆందోళన.

“నాగపూర్‌లో మా ఇంటివారమ్మాయి జ్యోతి. బి.యస్సీ పాసైంది. తల్లిలేదు. తండ్రి ఇంజనీర్. ఆంధ్రాస్ కాదు. తనకు మనసిచ్చాను. మాటకూడా యిచ్చాను నువ్వు నాన్నగార్ని ఒప్పించగలవనే ధైర్యంతో వున్నాను. వాళ్ల నాన్నగారు మా పెళ్లికి తొందరపడుతున్నారు. అందుకని.. మరి...''

హఠాత్తుగా మనసు మూగపోయింది. మధు నోటినుండి సరికొత్త సమస్య క్రిందటి క్షణం వరకూ పసివాడిగా కనుపించిన మధు అందుకోలేనంత ఎత్తుగా ఎదిగిపోయాడు. చాలా సేపు మౌనంగా కూచున్నాను. నా జవాబుకోసం నిరీక్షిస్తున్నాడు. ఏం చెప్పాలో తోచలేదు. “నిద్రపో నాన్నా, ఆలోచిస్తాను'' లైటార్పి కిందకు వచ్చాను. మధుకు చెప్పానే గాని నాకారాతంతా నిద్రలేదు.

“తెలుగు పిల్లకాదు. కులం, మతం అలా ఉంచినా భాష కూడా ఒకటి కాదు. ఆయన ఒప్పుకుంటారా? అసలెలాఒప్పించను. బంధువులంతా ఏమనుకుంటారు. ముఖ్యంగా పరాయి రాష్ట్రపు పిల్లను చేసుకుంటే మధు నాకు దూరమౌతాడేమో?'' ఈ ఊహ గుండెల్లో సన్నని మంట రేపుతోంది. ఇది భరించలేను. నాకు ఆడపిల్లలులేకపోవడంతో వాళ్ళ పెళ్లిళ్ళు కావేమోననే భయంలేదు. కాని ఎలా? వద్దని శాసిస్తే, కన్నీరు పెడితే,మధు కాలుకదపలేదు.






కాని ఆ నీలికళ్లలో ఇంక వెలుగు డదు. చిన్నప్పటినుంచి అంతే. సున్నితమైన మనసు వాడిది. వాడు ఇష్టపడింది, నాకిష్టంలేని పని ఏదైనా చెయ్యవద్దని గట్టిగా కసురుతే చేసేవాడుకాదు. కాని ఆరోజంతా ఓడిపోయినట్టు ముఖం దించుకొని దిగులుగా వుండేవాడు. మధు జీవితంలోని అశాంతిని మాత్రం భరించగలనా? అలాగని ఈ పెళ్లికి ఒప్పుకుని అయినవాళ్లందరికీ దూరమై, మచ్చలేని ఈ కుటుంబపు పరువును, వారి మర్యాదను మంటగలపగలనా ? ఎలా ... ఎలా ఈ సమస్యను పరిష్కరించను? ఆలోచనలతో తెల్లారిపోయింది. రోజంతా మధును తప్పించుకుని తిరిగాను మరునాడు మా దూరపుబంధువు ఒకాయన వచ్చి వాళ్లింట్లో పెళ్లని, ముగ్గురు మగపిల్లల్ని ఎలాగూ శెలవులే కదా రమ్మని బతిమలాడి తీసుకెళ్లాడు. వారం రోజుల తర్వాత వచ్చారు ముగ్గురూ. వారం రోజుల వ్యవధి దొరికిందిగాని నా ఆలోచనలకు అంతు చిక్కలేదు. ఒకవైపు మధు భవిష్యత్తు, మరోవైపు కుటుంబ పరువు ప్రతిష్ఠలు.

"అమ్మా! వారం రోజులకే ఇంత చిక్కిపోయావేం" అన్నం తింటూ అడిగాడు రాజా.

"అన్నయ్య మీద బెంగ కాదమ్మా" చిలిపిగా అన్నాడు రఘు.

"నీ మొహంలే తిను" ఆలోచనతో మానసికంగా అలసిన నేను శారీరకంగా చిక్కినట్టు కనుపించానేమో. ఒకసారి నావైపు చూసి తలదించుకున్నాడు మధు.

"క్షమించమ్మా! నా వల్లనే కదూ" అన్నట్టున్నయ్యా చూపులు.

ఆ సాయంత్రం వంటపనిలో బిజీగా వున్నా రా దగ్గరకు వచ్చాడు మధు.

"ఏం కావాలిరా !"

"ఉత్తరం వచ్చిందమ్మా !"

"ఉత్తరమా. అక్కడ పెట్టు!"... ఏదో పనిలో వున్నా నేను చాలా సేపటి వరకూ ఆ ఉత్తరాన్ని చూడలేదు. విప్పాను.

డియర్ మధూ

రేపు మూడున్నర ఎక్స్ప్రెస్ కి వస్తున్నాను, రిసీవ్ చేసుకో. మర్చిపోకు. ఎక్స్ప్రెస్ మూడున్నరకు.

నీ జ్యోతి'

గులాబిరంగు కాగితం మీద ఆకుపచ్చని అక్షరాలు ముద్దుగా, పొందికగా ఉన్నాయి.

# మమత

ఉత్తరం ప్రక్కన పెట్టి పనిలో మునిగిపోయాను. మధ్యాహ్నం రెండైంది. నిద్ర పోతున్న మధును లేపుదామని గదిలో కెళ్లాను. పరీక్షగా చూడలేదుగాని పిచ్చివెధవ చిక్కిపోయాడు. బుగ్గలపై కన్నీటి ధారలు, నా గుండెల నెవరో నొక్కుతున్నట్టుగా బాధపడ్డాను. మధు కన్నీరు పెట్టటం అరుదైన విషయం. ఎలాంటి బాధనైనా మౌనంగా భరిస్తాడు ఈ ఉదాహరణ చాలు మధు హృదయంలో జ్యోతికి ఉన్న స్థానం ఏమిటో చెప్పటానికి.

"మధూ లే నాన్నా" నెమ్మదిగా తల మీద చెయి వేశాను. ఉలిక్కిపడి లేచాడు. "లేచి ముఖం కడుక్కునిరా. టిఫిన్ తిందువుగాని, రెండైంది స్టేషన్‌కెళ్లాలిగా" మధు కళ్లల్లో ఇంద్ర ధనస్సు లాంటి మెరుపు. నిట్టూర్చాను.

ఆ అమ్మాయి ఎవరైనా ఎలాంటిదైనా మధు స్నేహితురాలు. ఇంటికొచ్చిన ఆడపిల్లను అవమానించ కూడదు. తరువాత సందర్భాన్ని బట్టి చూసుకోవచ్చు. చదువు నేర్పిన సంస్కారం నాలో మాసిపోలేదు. ఇంతలో ఫోన్ మ్రోగింది.

"హలో"

"హలో రాధా. సరోజ వస్తోంది చూస్తావా."

"ఆంటీ... ఆంటీ ... ఏమిటి మీరంటున్నది, సరోజ. నా పాప వచ్చిందా ? ఇప్పుడే వచ్చిందా. వస్తున్నాను ఆంటీ"

"ఓహో...రాధా...తొందరపడక. సరోజ రేపు వస్తుంది. రేపుదయం రా."

ఒక్కక్షణం నీరసంగా అనిపించింది. ఇంతలో గుమ్మంలో టాక్సీ ఆగింది. ఫోన్ పెట్టేసి వీధిలోకి నడిచాను. మధు వెనుక తల వంచుకొని వస్తోంది ఆ అమ్మాయి. సన్నగా, తెల్లగా, నాజూగ్గా, చిన్న పెదవులతో, ఆకర్షణీయంగా ఉంది జ్యోతి. అందరికీ పరిచయం చేశాడు. "మా అమ్మ"

కళ్ళనిండుగా అనందం నింపుకుని "నమస్తే" అంది వినయంగా.

ఆ కళ్లలో సరోజ కనుపించింది. లోపలికి తీసుకెళ్ళాను. మరునాడు ఆంటీ ఫోన్‌కాల్ కోసం చూస్తున్నాను. జ్యోతి, మధు, రఘూ, రాజా ఎక్కడికో వెళ్లారు. గణగణా మ్రోగింది ఫోన్.

"హలో" గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి

"రాధా. సరోజ వచ్చింది రా"

ఆనందంతో చేతిలోని రిసీవర్ జారిపోయిందనుకున్నాను వళ్ళంతా చెమట పట్టేసింది. అంతు తెలియని సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయినాను.

"ఎన్నాళ్లకు పాపను చూడబోతున్నాను. నా పాప నన్ను గుర్తిస్తుందా ? అమ్మ






అంటూ దగ్గరకు వస్తుందా లేక దూరం నుంచే నమస్తే...ఊహు అలా కాకూడదు'' టాక్సీలో హాస్పిటల్ దగ్గరకు వచ్చాను. పరుగెడుతున్నట్లు ఆంటీ రూంలోకి వచ్చిన నాకు అక్కడ ఆంటీ ఒక్కరే కనుపించారు.

"నమస్తే ఆంటీ! పాప ఏది..." త్వరగా రావటంవల్ల ఆయాస పడ్డాను. మామూలు చిరునవ్వుతో చూస్తూ!

"కూర్చో... కూర్చో... ఈ నీళ్ళు త్రాగి అలసట తీర్చుకో ముందు'' అన్నారు ఆంటీ. గటగటా నీళ్ళు త్రాగి ... "చూపండి'' అన్నాను. ఇద్దరం మరో రూంలోకి వెళ్ళాము.

"ఇదిగో నీ పాప''

మధు ప్రక్కన కూర్చున్న జ్యోతి అయోమయంగాచూస్తోంది. నాకర్థంకాలేదు.

"సరోజా, ఈమే నువ్వు చూడాలని వచ్చిన అమ్మ''

ఆంటీ మాటలతో ఈ లోకంలోకి వచ్చాను. రెండడుగులు వేశాను ప్రపంచం గిర్రున తిరుగుతున్నట్లుగా అనిపించింది. నీళ్ళు నిండిన కళ్ళకు మసగ్గా కనుపించింది. ఇన్నాళ్ళూ జ్యోతి పేరుతో పెరిగిన సరోజ, చేతులు చాచేలోగా కుప్పకూలిపోయాను. తిరిగి కళ్ళు తెరిచేసరికి సోపా మీద వున్నాను. ముందుగా కనిపించింది సరోజ. పదహారేళ్ల మమతా ఒక్కసారి గుండెల్లో పొంగింది. ఆర్తిగా చేతులు చాచాను.

"అమ్మా—అమ్మా..."అంటూ సరోజ నా కౌగిలిలో వాలిపోయింది. చిన్నారి సరోజ "అమ్మా'' అన్నట్లుగా అనుభూతి చెందాను. పిచ్చిగా గుండెల కదుముకుని కన్నీటితో తడిపేశాను. నా కెంతో తృప్తిగా, గర్వంగా, ఆనందంగా ఉంది.

"రాధా! ఈ రోజు నీకు పండుగ కదూ'' నవ్వుతున్న ఆంటీ నా కళ్ళకు దేవతలా కనుపించారు... "ఆంటీ మీకొక శుభవార్త. ఈ సరోజే నా ఇంటికి కోడలుగా వస్తోంది, చిన్నప్పుడు కూతురుగా ఇక్కడనించి తీసుకెళ్దామని ప్రయత్నించి, వారి మాటలు కాదనలేక పోయాను. సరోజకు దూరమై బాధ పడ్డాను. ఇప్పుడు నా బాబు మధు తోడు ఉన్నాడు. అందుకే సరోజను నా ఇంటికి దీపంగా చేసుకుంటున్నాను.'' మధు, సరోజల ముఖాలు ఆనందంతో వెలిగాయి.

బట్టలన్నీ
ఉతికేందుకు
క డిటర్జెంట్ పౌడర్ కన్న
మరింత
మంచిదేది?



# కొత్తది! మెఱుగు పరచ బడింది!

## కీ




**అంతేకాదు, ఇంకా దీని ధర యితర ప్రముఖ డిటర్జెంట్ల కన్న 30% తక్కువే!**

ఈ మెఱుగుదలలు చూడండి!



ఇప్పుడు కీ మరింత సమృద్ధిగా నురగ నిస్తుంది.



ఇప్పుడు కీ బట్టలకు మరింత తెల్లదనాన్ని, తళతళను ఇస్తుంది.

గోద్రెజ్
ఉత్పాదన

**అందరికీ కనిపించే ఆ అదనపు తెల్లదనం, తళతళ–కొత్త, మెఱుగు పరచబడిన కీ లో**

CHAITRA-G-167 TEL

# కొన్ని కథలకు అర్థాలే వేరు

డియర్ ప్రేమా,

ఎన్నో రోజుల నుంచి నీకీ ఉత్తరం రాయాలని—కాని తీరిక ఎక్కడ? ఉదయం నుంచి సాయంత్రం దాకా ఒకటే పని. ఒక క్షణం తీరిక దొరికితే నీకు లేఖ రాసే ప్రశాంతత, ఏకాగ్రత వుండదు. ఇంతకీ నువ్విప్పుడు ఎక్కడున్నావు? ఏం చేస్తున్నావు?

తీరికలేని జీవితం గడుపుతున్నా అనుక్షణం నువ్వు నాకు జ్ఞాపకం వస్తుంటావు. సూర్యుడు, చంద్రుడు, విశాల ఆకాశం, అందులో తేలిపోయే మబ్బులూ,వర్షమూ—వెన్నెలా, పుట్టలూ, పిట్టలూ—కొండలూ—నదులూ, వీటిని చూసినప్పుడల్లా నువ్వే మనసు నిండా నిండిపోతావు. అంతా, "ప్రేమమయంగా" తోస్తుంది. నీలాగా వాటికి అందరూ సమానమే. ఎప్పుడు వాటిచుట్టూ మసలుతూ, వాటితో దగ్గరి అనుబంధం వున్న మనిషి వాటిలా మమతని, సమతని ఎందుకు పెంచుకోలేక పోతున్నాడో? వాటిని ఆదర్శంగా తీసుకుని నీకు దగ్గరకావాలని నా తాపత్రయం—ప్రేమమయి మదర్ థెరిసా అన్నట్లు "ఈ ప్రపంచంలో కరువు అన్నానికీ, వస్త్రానికీ కాదు—ప్రేమకు" ఆమె మాట అక్షరాలా నిజం. అందుకు అనుదినం మనకి ఎన్నో ఉదాహరణలు. అందాకా దేనికి సుప్రసిద్ధ హాలీవుడ్ తార మార్లిన్ మన్రో నటిగా ప్రపంచ ఖ్యాతి పొందింది. కావల్సినంత డబ్బు గడించింది. కీర్తికి కొదవలేదు. కాని నిజమైన "ప్రేమ" దొరక్క ఆమె ఆత్మహత్య చేసుకుంది! ఇలాంటి ఆలోచనలతో మనసువికలమైపోతూ వుంటుంది. అలాంటప్పుడు గతాన్ని నెమరువేసుకుంటూవుంటాను—

ప్రేమా! నీకు గుర్తుండే వుంటుంది. 27 ఏళ్ళ క్రితం నేను ఎం. ఏ. అయాక యీ పట్టణంలో ఏం చెయ్యాలో తోచక, అందంగా అమర్చిన మిఠాయి దుకాణాల ముందు ఆకలి కళ్లతో చూస్తూ నిలబడినప్పుడు "రావ్" అనే టైలర్ భుజం మీద చెయ్యి వేసి నన్ను మీ ఇంటికి తీసుకువచ్చాడు. అప్పుడు నువ్వూ, మీ తమ్ముడు సత్యం, మీచెల్లెలు ఆశ డాబా మీద కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకున్నాం. గుర్తుందా? ఆ మసక వెన్నెలలో కొబ్బరి చెట్లకు వేలాడే గిజిగాడి గూళ్ళని చూస్తూ, నేనూ—నిశ్శబ్దంగా కూర్చున్న నువ్వూ—ఆశ చాలా ప్రోత్సాహం యిచ్చింది. సత్యం నేను వుంటా కదా పర్వాలేదన్నాడు — మీరంతా బాసటగా వుంటే ఏమైనా చేయగలనని నాకు నమ్మకం చిక్కింది. కొండంత ధైర్యం వచ్చింది

ఆ రావ్ కుట్టిచ్చిన రెండు జతల పైజమా లాల్చీలు, రామస్వామి యిచ్చిన 30 భోజనం టిక్కట్లతో నువ్వు పిల్చుకు వచ్చిన పదిమందికీ నేను మాస్టరునయినాను. అప్పుడు నా వయసు పందొమ్మిది. నా అంత వాళ్ళకి నేను చదువు చెప్పడం! తల్చుకుంటే తమాషాగా వుంటుంది. తర్వాత ఎన్నో వసంతాలు, హేమంతాలు వచ్చాయి, వెళ్లాయి. మబ్బులూ వానలూ, ఎండా, వెన్నెలా వస్తున్నాయి—పోతున్నాయి. చెట్లూ, పిట్టలూ, కొండలూ, కోనలూ అప్పటి నా ఆదర్శాలు వాటి వాటి నైజాలను మార్చుకోకుండా వుంటున్నాయి. ఒక లక్షమంది పైగా విద్యార్థులు నా శిక్షణలో చదివి వివిధ వృత్తులలో, వ్యాపకాలలో స్థిరపడ్డారు. ఇంజనీర్లు, డాక్టర్లు, లాయర్లు, ఉపాధ్యాయులూ, ఆఫీసర్లూ, వ్యాపారస్తులూ, యిలా అన్ని రంగాలలో—వారి వృత్తి ఏదైనా, వ్యాపకం ఏదైనా నాకు మాత్రం వారంతా విద్యార్థులే! జీవితంలో ఎందరో కవులు, కళాకారులు, చిత్రకారులు, శిల్పులు, క్రీడాకారులు పరిచయమయినారు. ఇదినా అదృష్టం—నీ చలవ.

కాని ప్రేమా! ఒక్కోసారి జీవితం ఎంత శూన్యంగాతోస్తుందో చెప్పలేను. డబ్బుకి విలువ యిచ్చిమాట్లాడే మనుషులు ఎక్కువైపోయారు.

"నీవెలా ఉన్నావ్"అని నీలాగా పలకరించే వాళ్లకంటె "నీకేమయ్యా" అని ఈర్ష్య ధ్వనించేలా పలకరించే వాళ్ళెక్కువయారు. రంగస్థలనటులు, మధుర గాయకులు వారి నటనతో, మధుర గానంతో ప్రేక్షక శ్రోతల్ని పరవశింప చేస్తారు. ఆనందించి హాయిగా ప్రేక్షక శ్రోతలు వెళ్లిపోతారు. కాని ఆ కళాకారుల గురించి ఎందరు ఆలోచిస్తారంటావ్?

"Halls are full but hearts are empty" ఈ వాక్యంజ్ఞాపకం వచ్చినప్పుడల్లా గుండె కలుక్కుమంటుంది. అంతా శూన్యంగా గోచరిస్తుంది. ఏదో ఒక వెలితి నన్నావరిస్తుంది. అలాంటి సందర్భంలోనే వోసారి నిన్ను చూద్దామని మీ ఇంటికి వచ్చా— "ప్రేమ వున్నదాండి" అని అడిగా. "ఎక్కడికో వెళ్లిందండి" అని జవాబు చెప్పారు మీ ఇంట్లో. ఆ జవాబులో అనేక అర్థాలు స్ఫురించాయి నాకు. తల దించుకు వచ్చేశాను. మరి కొద్ది రోజులకి "సత్యం" పరారయ్యాడని పేపర్లో ప్రకటన చదివా. ఆశకు అనారోగ్యంగా వుందని తెలిసింది. చాలా బాధపడ్డాను. వున్నట్టుండి వోరోజు మన "బాకా" కన్పించాడు. "బాకా" అంటే గుర్తొచ్చాడా? మీతో ఎక్కువ స్నేహంగా వున్నట్టు నటించేవాడు. ఎప్పుడూ తన గురించి తను మాట్లాడేవాడు. అందుకే మనం "బాకా" అని ముద్దు పేరుతో పిలిచే వాళ్లం. అతనిలో మార్పేమీ లేదు. గంటసేపు సొంత బాకా వూదాడు. అందులో ఫస్టన్నాడు—ఇందులో ఫస్టన్నాడు. ఏంటేంటో చెప్పాడు. నాకు సరిగ్గా అర్థంకాలేదు కాని తర్వాత విచారిస్తే అతనొక విద్యాసంస్థ పెట్టాడనీ, నానా రకాలుగా డబ్బు సంపాయించాడనీ తెలిసింది.

ఇవన్నీ చూస్తుంటే ఏంచెయ్యాలో అర్థంకావడంలేదు. మీముగ్గురి దగ్గరా నేను నేర్చుకున్న మొదటి పాఠం యీ జీవితానికి చాలన్పిస్తూంది. అలాగే జీవిత యాత్ర సాగిస్తున్నా— నాకు విచారం లేదు. అసూయ లేదు. అహంకారం లేదు—దానికి కారణం మీరే. ఎంతో డబ్బు వచ్చింది—

ంది. అయినా 27 ఏళ్లనాడు మీ డాబా ర మొదటిసారి మనం కల్సినప్పుడు ఎట్లా న్నో యిప్పుడూ అలాగే వున్నాను. చిన్న చిన్న ప్పులు లేకుండా వుండవనుకో. మనంయంత్రాల ర తయారయిన వస్తువులం కాదు కదా— వున్న మనుషులం.

ఆమధ్య అనుకోకుండా వోరోజు మన సత్యం ంచాడు. చిక్కి సగమైపోయాడు.

"ఇల్లు వదలి వెళ్లిపోయావట దేనికి?" అని తే—

"నేనెవరికి కావాలి మాస్టారూ?" అన్నాడు ్రహగా. నేను ధైర్యం చెప్పడానికి ప్రయ ్తే సత్యం నిట్టూర్పుగా నవ్వి—

"రోజులు మనవికాదు సార్—మన "బాకా" ్రగా— వాడు పరీక్ష పేపర్లు కొనుక్కుని, కాపీ స్సి, మార్కులు వేయించుకుని పాసయ్యాడు. ా నేను ఒకటేనా చెప్పండి?" అన్నాడు.

"సత్యం నువ్వే తప్పక జయిస్తావు. నిజం ్డ మీద తెలుస్తుంది" అని వూరడించాను. కుల సాగా వుందనీ, కొంచెం కొంచెం కోలుకుం ందనీ చెప్పాడు.

ప్రేమా! నేను యీ వృత్తిలో అడుగుపెట్ట కి నాంది పలికినరోజు —మీ డాబా పిట్టగోడ ద నేను కూచుని వుండగా నువ్వొక మాట న్ — జ్ఞాపకం వుందా? నేనెప్పుడూ ఆ ఎల్ని జ్ఞాపకం చేసుకుంటూ వుంటాను. అవి అజ్ఞాత సైనికుని సమాధిపై వ్రాసిన మాట చెప్పావ్—

"ఒక సైనికుడు తన దేశంపైగల ప్రేమతో ారిగాడు—ఎప్పడైనా యీ వైపు వెళ్ళటం స్థిస్తే ఒక కన్నీటిబొట్టుంటే రాల్చండి"అని- ఆ శిలాక్షరాలే నా జీవితం. నువ్వే నా లక్ష్యం. ాది విద్యార్థులు, వారి తలిదండ్రులూ, ఇరుగు ుగు వారు, మిత్రులూ, ఆప్తులూ. ఇది ్తే చాలు.

ఇంతకీ సమాచారంతెలియనేలేదు. బావున్నావు ా? మునుపటిలాగే మాటా పలుకూ లేకుండా గే వుంటున్నావా? ఎందుకు ఉత్తరం వ్రాయ ఇన్నాళ్ళు? కోపమా? నీహృదయంలో కోపానికే ు లేదే! నేను మారిపోయానని అనుమానమా? లంటే మీ సత్యాన్ని అడుగు. అప్పుడూ, ుడూ అలాగే వున్నాను.

ప్రేమ, సత్యం, ఆశ, శ్రమ అనే నాలుగు ్తాల మీద నడుస్తూంది గుంటూరులోగల ) కళాశాల'! ఈ 27 సంవత్సరాలలో లక్షకు గా విద్యార్థులు శిక్షణపొంది మమ్మల్ని ప్రేమతో చారు. వారికికృతజ్ఞతలు. అశేష ఆంధ్రులకు వళి శుభాకాంక్షలు. మీ సి. వి. యన్. ధన్.

*మా ఖాతాదారులకు, మిత్రులకు, శ్రేయోభిలాషులకు*
*దీపావళి శుభాకాంక్షలు!*





# వంటలు

## క్యాబేజీ దోసె

కావలసిన వస్తువులు:- బియ్యం 250 గ్రా., కందిపప్పు 125 గ్రా, క్యాబేజీ 400 గ్రా, కొబ్బరికాయ ఒకటి, ఉల్లిపాయలు రెండు, ఎండు మిరపకాయలు పది, తగినంత ఉప్పు, చిన్ననిమ్మకాయంత చింతపండు, నూనె.

తయారుచేయు విధము:- ముందుగా బియ్యమును, కందిపప్పును మూడు గంటల సేపు నీటిలో నాననివ్వాలి. బాణలిలో కొద్దిగా నూనె తీసుకుని పొయ్యి పై పెట్టి ఎండు మిరపకాయలు వేసి వేయించి దించాలి. కొబ్బరిని తురమాలి. ఇపుడు కొబ్బరి తురుము, వేయించిన ఎండు మిరపకాయలు, చింతపండు. రోట్లోవేసి రుబ్బాలి. సగం రుబ్బిన తర్వాత బియ్యం కందిపప్పు చేర్చి కొద్దిగా నీరు చల్లి బాగా మెత్తగా రుబ్బాలి. పిండి గట్టిగా వుండేలా చూడాలి. తర్వాత క్యాబేజీ, ఉల్లిపాయలు సన్నని ముక్కలుగా తరిగి రుబ్బిన పిండిలోకి వేసి, దానితోపాటు తగినంత ఉప్పు కూడా వేసి బాగా కలపాలి. ఈ పిండిని దోసెల పెనంపై కాస్త దళసరిగా దోసెలుపోసి, రెండు వైపులా నేతితో కాల్చి తింటే చాలా రుచిగా వుంటాయి.

— గార్ల సరస్వతి

## కొబ్బరి దోసె

కావలసిన వస్తువులు .— బియ్యం— అరకిలో, కొబ్బరికాయ—1.

తయారుచేయు విధము :— బియ్యం ముందుగా నానబెట్టి కొబ్బరి కోరుతో మెత్తగా రుబ్బుకోవాలి. ఉప్పు వేసి ఒక గంట వుంచాలి. పిండిని చాలా పలచగా ఉండేటట్లు నీరుపోసి కలపాలి. స్టౌ మీద పెనం పెట్టి, చుట్టు నుంచి మధ్యకు గరిటతో పోయాలి. పిండి ఎంత పలచగా ఉంటే దోసె అంత పలచగా వస్తుంది. కావలసిన వారు ఉల్లిపాయ ముక్కలు, పచ్చిమిర్చి తరిగి దోసె పై అద్దవచ్చు. కొబ్బరి చట్నీతో తింటే రుచిగా వుంటాయి.

— కె. ఉషారాణి ★

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు
పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన
కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. —సం.

# మీ చిగుళ్లను దృఢంగా వుంచుకోండి
# మీ పళ్లకు దీర్ఘ ఆయుస్సునివ్వండి.



## కేవలం ఫోర్‌హాన్స్‌లో మాత్రమే చిగుళ్లను దృఢపర్చగల ఒక ప్రత్యేకమైన అస్ట్రింజంట్ కలదు.

**దీని అద్వితీయమైన రుచియే దీని ప్రభావానికి ఋజువు**

ఫోర్‌హాన్స్‌లోని అస్ట్రింజంట్ చిగుళ్లకు విశిష్టమైన రక్షణ నిస్తుంది. ఈ అస్ట్రింజంట్ వాపును అరికట్టి బలహీనమైన మరియు మెత్తబడిన చిగుళ్లను సంకోచింపజేసి వాటిని ఆరోగ్యంగా వుంచుతుంది. మీ పళ్లకు దీర్ఘ ఆయుస్సు మరియు దృఢమైన ఆధారాన్ని ఆరోగ్యమైన చిగుళ్లే ఇవ్వగలవు. ఆరోగ్యమైన పళ్లకు కూడా కావాలి దృఢమైన చిగుళ్ల ఆధారం. అందుకే మీకు కావాలి ఫోర్‌హాన్స్... అస్ట్రింజంట్ కల్గిన అద్వితీయమైన టూత్‌పేస్టు.




## ఫోర్‌హాన్స్‌ను విశ్వసించండి.

**ఇది పళ్ల డాక్టరు సృష్టించిన టూత్‌పేస్టు**

188 F 203 TEL

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

**ఆచార్య మొదలి నాగభూషణశర్మ :**

ప్రవృత్తి వృత్తుల సమ్మేళనం అరుదు. గణిత శాస్త్రంలో అపూర్వ విషయాలు కనుగొన్న రామానుజం చాలకాలం మద్రాసు పోడరేవులో గుమాస్తాగా వున్నాడు. మహా నాటక రచయిత బెర్నార్డ్‌షా మొదట్లో బ్యాంకులో పనిచేశాడు. ఏ అదృష్టవంతుడికోగాని ప్రవృత్తికి తగిన వృత్తి లభించదు. అదృష్టం అని ఎందుకన్నానంటే, అర్హతలున్నవారినందరినీ అదృష్టం వరించక అగచాట్లపాలు చేస్తుంటుంది. యోగ్యతవుండి, అదృష్టమూ వుంటే, ఇక చెప్పనక్కర లేదు. అన్ని అర్హతలూవున్న అలాటి అదృష్టవంతులు మిత్రులు డాక్టర్ మొదలి నాగభూషణ శర్మ. తమ ప్రవృత్తికి అనుగుణమైన పదవిని— ఉస్మానియా విశ్వ విద్యాలయంలో రంగస్థల కళాచార్య పదవిని (ప్రొఫెసర్ ఆఫ్ థియేటర్ ఆర్ట్స్ పదవిని) పొందారు, ఇటీవలే. డాక్టర్ శర్మకు నాటక రచనపైన, రంగస్థల నటనపైన చిన్నప్పటి నుంచే అభిరుచి వుంది. ఆయన 1935 జూలై 24 నర్సారావుపేట తాలూకా బ్రాహ్మణకోడూరులో మాతామహు స్థానంలో జన్మించారు. నాయనగారు శ్రీ మొదలి వెంకట సుబ్రహ్మణ్య శర్మ కూడ నాటకాలరాయుడే. ఆయన ధూళిపూడిలో వున్న పబ్లిక్ స్కూలులో ఉపాధ్యాయుడుగా వున్నారు. ఆయన శివాజీ చరిత్ర చిత్రించే 'విధి నిర్వహణ' అనే నాటకం మరికొన్ని వ్రాసి బడిపిల్లలతోవేయించేవారు. నాగభూషణ శర్మ విధి నిర్వహణలో షయిస్త ఖాన్, అసంపూర్ణ రామాయణంలో రాముడు మొదలుగా, పదహారు, పదిహేడు నాటకాలలో నటించారు. 1950 లో బందరు హిందూ కాలేజీలో ఇంటరు చదువుతుండగా నార్లగారి నాటకాల్లో, భమిడిపాటి నాటకాల్లో స్థానిక రవీంద్ర కళాసమితిలో వేశారు. నార్లగారి నాటకాల్లో ఆడవేషాలు, కన్యాశుల్కంలో మధురవాణి వేషంకట్టారు. ఇంటర్‌లో వున్నప్పుడే నాటకాలు నాటక విమర్శలు, కథలు వ్రాశారు తెలుగు స్వతంత్రలో. అప్పుడు గుడివాడ కాలేజీలో శ్రీ ఎ. ఎస్. త్యాగరాజు ఇంగ్లీసు గొప్పగా చెప్పేవారు. అందువల్ల నాగభూషణ శర్మ తండ్రిగారు ఆయనను గుడివాడలో బి. ఎ లో చేర్చారు. అక్కడి ఆచార్యులు వేదాంతం రామచంద్రరావు, జి. వి. జోగారావు, ఎస్. రామమూర్తి వంటివారి సన్నిహితత్వం వల్ల నాటక సంప్రదాయాలు శర్మకు బాగా ఒంటబట్టాయి. ముఖ్యంగా రామకోటి శాస్త్రిగారి సాహచర్యం నాటకాలకు చాల ప్రోత్సాహమిచ్చింది. ఇంటరలా వుండగా భారతిలో మూడు నాటికలు ప్రచురించారు. గుడివాడలో పది పన్నెండు నాటకాలు వేశారు. డాక్టర్ గరికపాటి రాజారావు నిర్వహించిన నాటకాల కార్య గోష్ఠులలో (వర్క్‌షాప్‌లలో) పాల్గొన్నారు. 1955 లో కొర్లపాటి గంగాధరరావు రచించిన కమల అనే నాటకం ప్రదర్శించి ఉత్తమ బహుమతి సంపాదించారు. బి. ఏ. చదువుతూ, విషాదాంతం, జంట పక్షులు, సంస్కర్తలు మున్నగు ఎనిమిది నాటకాలు వ్రాసి ప్రదర్శించారు. బి. ఎ. లో విశ్వవిద్యాలయం ప్రథములుగా వచ్చారు. తర్వాత గుంటూరు ఏ. సి. కాలేజీలో సంవత్సరంపాటు స్పెషల్ ట్యూటరుగా వుండి, తెలిక చెర్ల వెంకటరత్నంగారి ప్రోత్సాహంతో చాల నాటకాలు వేయించారు. 1957—58 లో ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ఇంగ్లీషు ఎం. ఎ. లో చేరారు. 1960 లో ఇంగ్లీషుశాఖలో లెక్చరర్‌గా చేరారు. అప్పటినుంచే తమ అభిరుచికి తగిన థియేటర్ పని ప్రారంభించారు. 1962 లో తెలుగు సాహిత్యం— పాశ్చాత్య ప్రభావం— అనే వ్యాస పరంపరను ఆంధ్రప్రభలో ప్రచురించారు. 1961 నుంచి 1967 దాక వరంగల్లులో వుండి, కాకతీయ సాంస్కృతి కోత్సవాలను ప్రారంభించారు. నాటకాలు రచించి, నాటకాలకు దర్శకత్వం వహించి ప్రథమ బహుమతులు పొందారు. విద్యార్థులలోనేకాక, నగర ప్రజల్లోను నూతనోత్సాహం వెల్లి విరియజేశారు. మరచాను : 1956 లో రేడియో నాటికల పోటీలో 'కల—కాపురం' అనే దానికి ప్రథమ బహుమతి లభించింది. గంటసేపు ప్రసారమయ్యే 22 రేడియో నాటకాలు వ్రాసి జనాదరం పొందారు. 1967లో ఉస్మానియా విశ్వ విద్యాలయానికి బదిలీ అయింది. వరంగల్లు నుంచి, ఇటు నాటకరంగం పైన, అటు సాహిత్యంపైన పుంఖాను పుంఖంగా పుస్తకాలు వెలయించారు— తెలుగు సాహిత్యంపై గాంధిజీ ప్రభావం (తొలి పుస్తకం), నాటకకర్తగా చిలకమర్తి (సంగీత నాటక అకాడెమీ ప్రచురణ) తెలుగు నవలా వికాసం (ఎం. ఎ. ఎం. ఫిల్‌లకు సహాయ గ్రంథం), మాస్టర్ అండ్ డిసైపుల్ (వివేకానందునిపై రామకృష్ణ మటానికి), ఆధునిక ఏకాంకికలు (ఆంగ్లం) నూరేళ్ల తెలుగునాటకరంగం (సంకలనం), బళ్లారి రాఘవ (ఆంగ్లం— ఆయన డైరీలు, ప్రసంగాలు ఆధారంగా నటనశైలిని గురించి చర్చ), నాట్యకళ సంపాదకులుగా నాట్య కళ ప్రత్యేక సంచికలు, తెలుగు నాటక శతజయంతి ప్రత్యేక సంచిక ఇలా ఎన్నో. సైకలాజికల్ రియలిజంతో పాత్రల మనస్తత్వంపై ఆధారపడిన నటనను రాఘవ సమకాలిక ఆంగ్లనటులకు సమంగా ఎలా చేశారో సుదీర్ఘంగా చర్చించారు శర్మ. 1973 లో సాంస్కృతి వినిమయ కార్యక్రమం కింద అమెరికాకువెళ్లి ఇల్లినాయిస్‌లో, రెండున్నర సంవత్సరాలు ఆనాటి నాట్యశాస్త్రం నుంచి ఈ నాటివరకు వచ్చిన విభిన్నప్రవృత్తులను చూపే నాటకాలు శోధించి, ప్రదర్శింపజేసి మెప్పుపొందారు. టాగూరు విసర్జన్ 32 సార్లు అక్కడ ప్రదర్శింప జేశారు. అక్కడ రంగస్థల కళలో అద్యయనం చేసి మాస్టర్ ఆఫ్ ఫైన్‌ఆర్ట్స్ (ఎం. ఎఫ్. ఎ.) డిగ్రీపొందారు. దర్శకత్వంలో ప్రత్యేకత సంపాదించారు. చెకోవ్, గిరెదో (ఫ్రెంచి) బ్రెర్ష్ల నాటకాలకు దర్శకత్వం వహించారు. వేసవిలో ఒక నటన శిబిరం నిర్వహించి, 24 మంది అమెరికనులకు శిక్షణ ఇచ్చారు. మృచ్ఛ కటికం (పి. లాల్ అనువాదం) వారితో ప్రదర్శింపజేశారు. 1976 లో యూజీన్ వోనీల్ నాటకాలపై పరిశోధనచేసి డాక్టరేట్ పొందారు. ఇది మౌలికమైన పరిశోధన అని ప్రశంసలు పొందారు. 1977 లో ఆంగ్లభాషా శాఖలో రీడరయ్యారు. శర్మకు పెక్కు నాటక సాంస్కృతిక సంఘాలతో సంబంధం వుంది: విశ్వ విద్యాలయం సాంస్కృతిక సంఘం ప్రధాన సలహాదారు. విశ్వ విద్యాలయం స్వర్ణోత్సవ, వజ్రోత్సవ సాంస్కృతిక కార్యక్రమ ప్రధాన సంచాలకులు. ప్రేరణ (ప్రేక్షక, రచయిత, నట) సంఘంస్థాపించి ప్రయోగాత్మక నాటకాలు వేయిస్తున్నారు. హైదరాబాద్ డ్రెమటిక్ కల్చర్ కార్యదర్శి, డైరెక్టరు. షేక్స్‌పియర్ ఆంగ్ల నాటకాలు, గిరీశ్ కర్నాడ్ హయవదన, తుగ్లక్ మున్నగు నాటకాలు ఈ సంఘం ద్వారావేయించారు. తుగ్లక్‌లో 42 మంది నటులు, ఆరుబయలు రంగస్థలంలో వేయించారు బేగంపేట పబ్లిక్ స్కూలులో. కొండను మలచి ఎనిమిది రంగస్థలాల్లో చేసి వాతావరణం సిద్ధపరచడానికి తెలుగుదేశంలో ఇంతటి కృషి జరుగ లేదు. రంగస్థల కళపై తెలుగులో, ఆంగ్లంలో పెక్కు వ్యాసాలు వ్రాశారు. తోలు బొమ్మలాట బృందాన్ని 1970 లో దేశమంతటా



ఆచార్య మొదలి నాగభూషణ శర్మ

## మీరు మంచి ఆలోచనా పరులు, ముందు చూపు గల వారేనా? అయితే,

# సన్‌సార్

## పంఖాలు మరియు గృహోపకరణ వస్తువులను మాత్రమే కొంటారు




నాణ్యతకు, మన్నికకు మరోపేరు "సన్‌సార్". ఎందుకనగా సమర్థులైన సాంకేతిక నిపుణులు వాటిగురించి శ్రద్ధ వహిస్తారు. 'సన్‌సార్' వారి వస్తువులేవి అవకాశముపై ఆధారపడిలేవు.

ఉత్పత్తికి సంబంధించిన ప్రతి చిన్న విషయములోను అత్యంత జాగరూకత మరియు నాణ్యత గురించి శ్రద్ధ వారికి సర్వసాధారణమైన విషయము.

అందువలననే మీరు "సన్‌సార్" వారి వస్తువులను ఎప్పుడు కొనినా, తెలివైన నిర్ణయం తీసుకొన్నామనే సంతృప్తిని పొందుతారు. ఇది మీలో చిరకాలము నిలచిపోతుంది.

విక్రయించిన తదుపరి మీకు ఎప్పుడు అవసరమయినా దేశ వ్యాప్తముగా నైపుణ్యమైన సర్వీసు లభించును.

ఈరోజే **సన్‌సార్** వస్తువులను కొనండి తెలివిగల పనిచేశామని సంతృప్తి పొందండి

associated UP/273

## హైదరాబాది నోట్ బుక్

50 చోట్ల త్రిప్పి తెలుగువారి కీర్తి ...... తోలుబొమ్మలాటలో గొప్పవాడైన అనపర్తి బ జీకి సంగీత నాటక అకాడెమీ నుంచి కళాప్రపూర్ణ బిరుదం ఇప్పించారు. రాష్ట్ర మంతా తిరిగి వివిధ జానపద కళాస్వరూపాలు తెలుసుకుని ప్రదర్శిస్తున్నారు. ఉరుముల నృత్యం వంటి కొత్త నృత్యాలు 24 ను, అక్కమ్మ కథ, ఎల్లమ్మ కథ చెప్పుకొని నిష్టతో వుండే హరిజనుల సంగతి ప్రపంచానికి తెలిపారు. 1982 సెప్టెంబరులో ప్రొఫెసర్ ఆఫ్ థియేటర్ ఆర్ట్స్‌గా ఉస్మానియా విశ్వ విద్యాలయంలో నియమితులయ్యారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఈ శాఖ ఈయనతోనే ఆరంభమయింది. రెండు సంవత్సరాల కోర్సు. ఉత్తీర్ణులకు వి. జి. డి. టి. ఎ. అనే డిగ్రీ ఇస్తారు. ఇలాటి డిగ్రీ భారత దేశంలో ఇదే తొలిసారి. నటన, దర్శకత్వం, రంగ స్థల శిల్పాలలో శిక్షణ వుంటుంది. శిక్షణ పొందిన వారికి రేడియో, టెలివిజన్, ప్రజా సంబంధశాఖ లలో అవకాశం వుంటుంది. సంగీత, నృత్య నాటకాలకు విశ్వ విద్యాలయంలో ప్రత్యేకమైన ఫాకల్టీ ఏర్పాటు చేయాలని నా ఆశ. దానికిది నాందికాగలదు. బెనారెస్, గౌహతి విశ్వ విద్యాలయాలలో ఇలాటి ఫ్యాకల్టీ వుంది. దేశంలో జానపదకళలు వందలకొలది వున్నాయి. కడపలో సోది జగన్నాథం వెంకటప్పగొప్పగా చెపుతారు. ఏడు మెట్ల కిన్నెరను మాలలు వాడుతారు. లేపాక్షి రామాయణం విరివిగా ప్రచారం చేయాలి. జానపద స్వరూపాలు చాల ఇదివరకే రికార్డు చేశాను. ఇంకా ఉన్నవన్నిటినీ భద్రపరచాలి— అని అన్నారు శర్మ, ఆవేదనతో. ఆయనకు ప్రవృత్తికి తగిన వృత్తి నడి వయస్సులో లభించింది గనుక తన ఆశయాలన్నీ సఫలం చేసుకోగలరనే విశ్వసిస్తున్నాను. శ్రీ శర్మ మంచివక్త. ఏ విషయమైన బాగా ఒప్పించగల తర్కచాతురి గలవారు. కనుకనే ఆయన తెలుగు లలిత కళలను గురించి బాగా చెప్ప గలరనే విశ్వాసంతో సాంస్కృతికశాఖా మంత్రిగా వున్న శ్రీ ఐ. రామకృష్ణంరాజు ఆయనను కేంద్ర సంగీత నాటకఅకాడెమీకి రాష్ట్రప్రతినిధిగా నియమించారు.

**ఉపశ్రుతి :**

ఏంసార్, ఇటీవల కవి, పండితులు చాలమంది అస్తమిస్తున్నారే పాపం— అన్నారు, ఒకరు నన్ను చూచి, నీవూ ముసలాడువు సుమా అన్నట్లు. మీ ప్రశ్న బలేవుందే. అందరినీ కాలుడు సమానంగానే ఆహ్వానిస్తాడు. కాని సామాన్య మానవుడికి కాయమూ మిగలదు, కీర్తి మిగలదు. కవి పండితులకి, సంఘ సేవకులకి అయితే, కాయం మిగలకపోయినా కీర్తి మిగులుతుంది. అదే భేదం— అన్నారు ఒకరు. ★


**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**